# నిరంతర సత్యాన్వేషి

## కృష్ణమూర్తి తత్త్వదర్శన కరదీపిక



"శ్రీ విరించి"



జయంతి పబ్లికేషన్స
కారల్ మార్క్స రోడ్డు * విజయవాడ-520002

**NIRANTARA SATYANVESHI**

Krishnamurti Tatwadarsana Karadeepika

by

SRIVIRINCHI

JAYANTI PUBLICATIONS

Vijayawada - 520 002.



First Edition :

JUNE 1998

Price :

**Rs.20-0 0**

Printers :

HANUMAN PRINTERS

Vijayawada - 11.

# విషయ సూచిక

# ముందుమాటలు

శ్రీ జె. కృష్ణమూర్తి (1895-1986) తత్త్వవేత్తగా సరికొత్త జీవన ప్రక్రియల ప్రారంభకుడుగా ప్రపంచమంతటా ప్రసిద్ధి పొందారు.

ఆయన పరమపదించి పన్నెండు సంవత్సరాలు దాటిపోయింది. దాదాపు 75 సంవత్సరాలపాటు అంటే 1910 నుంచి 1985 వరకు ఆయన ప్రపంచమంతటా పర్యటనలు చేసి యిచ్చిన ప్రసంగ పాఠాలు, వ్రాసిన పుస్తకాలు, నడిపిన చర్చా గోష్ఠులు యధాతధంగా మనముందు వున్నాయి. మరో భాష్యకారుడి అవసరం లేకుండా వాటిని ఎవరికివారు చదువుకొని ఆలోచించుకోగల అవకాశం వుంది.

ఎవరు ఈ కృష్ణమూర్తి?
మత సంస్కర్తా?
తత్త్వజ్ఞుడా?
విజ్ఞాన శాస్త్రవేత్తా?
కేవలం సాంఘిక శాస్త్రవేత్తా?
అవతార పురుషుడా?
విద్యావేత్తా?
యోగవిద్యా ప్రావీణుడా?
మాంత్రికుడా?
తాంత్రికుడా?

—యిలా అనేక ప్రశ్నలు మదిలో మెదులుతాయి, ఆయన ఉపన్యాసాలు విన్నప్పుడు, పుస్తకాలు చదివినప్పుడూను. వీటిలో యే వొక్కటీ ఆయన కాదని పిస్తుంది కొద్దిసేపు. ఇవన్నీ కలిపినా ఆయన వ్యక్తిత్వాన్ని సమగ్రంగా విశ్లేషించినట్లు అవదు అనిపిస్తుంది మరికొద్దిసేపు.

ఎవరు ఈయన?

ప్రతి విషయాన్నీ- పిపీలికం నుంచి బ్రహ్మపదార్థం వరకు-అణువు నుంచి మహత్ వరకు- వాటికి యెలాంటి పేర్లు, బిరుదులు, పటాటోపాలు తగిలించకుండా

విడమరచి, విరిచి విరిచి అందరికీ అవగాహన అయ్యేట్లు చెప్పుచూస్తున్న ఈ మహా త్తర పరిశీలకుడు 'జీవితాన్ని సమగ్రంగా, ఏక ముఖంగా చూడమని చెప్పడం తప్ప' యింక యే మార్మికతనూ ప్రవేశ పెట్టలేదు. సూటిగా నిష్కర్షగా మాట్లాడడం యీయన పద్ధతి.

ఆయన దగ్గర యే మంత్రదండమూ లేదు. మనుషులందరూ ఎవరికి వారు హృదయాలనిండా ప్రేమను. అనురాగాన్ని నింపుకుని స్వస్వరూప జ్ఞానాన్ని అవ గతం చేసుకోవడం ఆవసరం; ప్రకృతితో తాదాత్మ్యం పొందడం తప్పనిసరి. అవిభాజ్యం అయిన సృష్టికంతటికీ 'మనిషి' మూర్తిమంతుడు-అంటారు ఆయన.

మనిషిని పరిపూర్ణంగా, నిరాటంకంగా విముక్తిడిని చేయడమే తన పని అని ప్రకటించిన ఈ కృష్ణమూర్తి 'సత్యం' అనేది దుర్గమ క్షేత్రం అనీ, యిది నిలకడగా ఒకచోట ఒదిగివుండిపోయేది కాదనీ, దీనిని తనలో స్థావరింపచేసుకోవటానికి మనిషి చేయవలసింది అంటూ యేమీ లేదనీ, ప్రయత్న పూర్వకంగా వ్యవహరించడం కూడని పని అనీ అంటారు. 'అది' వున్నది. నీకు అతి చేరువలో వున్నది కూడా. దానిని నీలో ప్రవేశించనియ్యి- అంతే! దానికి అడ్డుగోడలు కట్టకు. విముఖంగా నించోకు....అంతే!– అంటారు.

చుట్టూవున్న ప్రకృతిని ఆత్మీయంగా చూచుకోవడం, ప్రపంచంలో జరుగు తున్న ప్రతిదానికీ 'బాధ్యత' తీసుకోవడం, అనుభవసారాన్ని అందరితో పంచు కోవడం ద్వారా స్వబుద్ధిని, స్వావలంబనను వికసింపచేసుకుని విశ్వమంతటితోనూ తాను తాదాత్మ్యం పొందడం....యివీ కృష్ణమూర్తి అలవోకగా చెప్పే సాధన సూత్రాలు.

విద్యావిధానం గురించి, మనుష్యులలో పరస్పరం వుండవలసిన సంబంధ బాంధవ్యాలను గురించి, వైఖరులలో విధాయకంగా తీసుకురావలసిన మార్పు- చేర్పులను గురించి సతార్కికంగా నుబోధకంగా తెలియచెప్పచూచిన కృష్ణమూర్తిని జీవితంలో యేదో ఒక 'శాఖ'కు సంబంధించిన వ్యక్తిగా కట్టిపడవేయడం కాకుండా జీవిత సమగ్రత కంతటికీ ప్రతీకగా చూడడం అవసరం అనిపిస్తుంది— ఆయన ఆలోచన ధోరణిలోని విస్తృతిని పలికించినప్పుడు.

అస్తిత్వవాదం, మానవతావాదం, సతార్కిక సామాజిక తత్త్వవాదం.... యివన్నీ ఆయనలో రంగరించుకుపోయి ఏకముఖంగా ఓ కొత్త ధోరణిలో అభి వ్యక్తం అయినాయి— అనిపిస్తుంది. మతాన్ని, విజ్ఞాన శాస్త్రాన్ని దగ్గరకు తీసుకు రావాలనే ఆలోచనను చెప్పకనే చెప్పుతూ ఆ శాస్త్రవేత్తల సమావేశాలను ఏర్పరచి వారికి సమాలోచన సూత్రాలు వివరించడం ఆయన చేసిన ఒక నూతన ప్రయోగం.

పరాశ్రయం -- పుస్తకం అయినా, పరమ పురుషుడు అయినా—అనవసరం. మనిషి ప్రతిదాన్నీ పరిశీలనాత్మకంగా చూడగలగాలి. స్వబుద్ధితో ఆలోచించుకోగల గాలి. సృజనాత్మకతను వెలికి రానివ్వాలి. అనుకరణలు, పోటీ మనోభావాలు, పరుగులాటలు, వెంపర్లాటలు ఏ మాత్రం పనికిరావు. మనిషి శీలసంపద పెరగ టానికి. ఎవరో సాధికారికంగా చెప్పారనుకున్న విషయాలను అశ్రద్ధగా తోసిపార వేయడం, పరమ విధేయంగా ఆలోచనతో నిమిత్తం లేకుండా అంగీకరించడం కాకుండా....ఎవరికివారు పరీక్ష పెట్టుకుని చూచుకోవడం అవసరం. తనను తాను పుస్తకం చదువుకున్నట్లుగా చదువుకోగలగాలి. తనలోని ఉద్దేశ్యాలను, అభిప్రాయా లను వాటి మూలాలు అందేంత వరకు అన్వేషణ సాగించాలి. పరిసరాలతో, పర మార్థంతో స్పందన, అనుస్పందన సంపాదించాలి. హృదయమంతా ప్రేమ, అను రాగం, అనుకంపలతో నింపుకున్న తరువాత 'ఏమయినా చేయి, ఫరవాలేదు' అంటారు ఆయన. నీకు చెడ్డ చేయడం చేతకాకుండా పోతుంది. మంచి చేయడం అలవాటయిపోయి అందుకు ప్రత్యేక ప్రయత్నం, పరిశ్రమ అవసరం లేకుండా పోతాయి.

ముందుగా నిన్ను నీవు కట్టిపడవేసుకున్న లక్షణాలను గమనించు. అల వాట్లు, ఆచారాలు, సంప్రదాయాలు....వాటి పరిమిత ప్రయోజనాలను గమనించు. ఈ బంధాల నుంచి నిన్ను వేరెవరో విముక్తుడిని చేయలేరు. ఆ పని నీవే చేసు కోవాలి—నీ పరిశీలన ద్వారా, సంబంధ బాంధవ్యాల ద్వారా, ప్రవర్తన తీరుల ద్వారా, ఆలోచనల వికసనం వల్ల!

కృష్ణమూర్తిని ఎవరో 'కనిపెట్టారు' [డిస్కవర్ చేశారు], ప్రత్యేక శిక్షణ— బోధన యిచ్చారు. పుష్పంలా ఎదిగేందుకు, వికసించేందుకు దోహదం చేశారు— అనుకోవడం ఒకరకంగా నిజమే అయినా, తననుతానే కనుక్కున్నాడు కృష్ణమూర్తి; తన శిక్షణ మార్గాన్ని తానే నిరంతర అన్వేషణ ఫలితంగా చేరుకున్నాడు; పరమ గమ్యం అయిన పరిపూర్ణ వికసనం సునిశితంగా సాధించాడు....అనుకోవడం మరింత న్యాయం.

ఆయన తత్త్వ దర్శనం అంతా జీవితంలో నుంచే పుట్టుకు వచ్చింది. అనుభవంలో నుంచే ప్రభవించింది. ఆలోచనలో నుంచే రూపుకట్టుకుంది.

అతి చిన్న వయసులోనే మాతృవియోగం; స్కూళ్ల చదువులలో మాష్టర్లు పెట్టే ఆరళ్లు....యివన్నీ పిల్లల పెంపకాన్ని గురించి, విద్యాబోధన పద్ధతులను గురించి, 'అసలు మనిషి' ఎదగటానికి అవసరమైన సాంఘిక స్థితిగతులను సమాలోచించుకోవటానికి అవకాశం కల్పించాయి.

ఎంతో ప్రేమించి ఆత్మీయంగా భావించిన 'తమ్ముడు' మరణించడం జీవన ప్రక్రియను గురించి, మరణానికీ, జీవనానికీ వున్న అవినాభావ సంబంధం లోతులు తెలుసుకునేందుకు ఉపకరించింది.

చుట్టూవున్న వాళ్లు తీసుకువచ్చే ఒత్తుడులు, నమ్మకాలు వమ్మయిపోయిన సందర్భాలు, స్నేహపాత్రులు అనుకున్నవారు చేస్తూవచ్చిన దగాలు—దగ్గాలు.... జీవితాన్ని మరింత తీవ్రంగా లోతుగా ఆలోచించి ప్రగాఢ సత్యాలను పెరికి పైకి తీసుకురావటానికి సహకరించాయి.

ఇలా తొంభయి యేళ్ల జీవితసారాన్ని ఎప్పటికప్పుడు కాచి వడపోసి ఇతరులకు అభివ్యక్తం చేయటానికి ప్రయత్నించారు ఆయన. సంస్థల ద్వారా, ఉపదేశాల ద్వారా, అనుకరణల ద్వారా మనిషి ముందుకు పోలేడు. నిరంతర జీవన మధనాన్ని నిర్నిమిత్తంగా చూచుకోగలగడం, ముందే చేసుకున్న నిర్ణయాలు దానిమీద రుద్దటానికి చూచుకోకుండా పరిశీలనలోనే పరిపక్వత పొందటం ఒక కొత్త సదుపాయం. పరిశీలిస్తున్న వస్తువు, దానిని పరిశీలిస్తున్న వ్యక్తి కరిగిపోయి; మటుమాయం అయిపోయి; కేవలం పరిశీలన మటుకే సవివరంగా, సంపూర్ణంగా విస్తరించుకోవడం ఈ సదుపాయం వల్ల వచ్చే సత్ఫలితం. జీవిత నిర్మాణమే 'నిర్వాణం'గా రూపాంతరం పొందుతుంది. ఇదీ ఈయన తాత్త్విక దర్శనం.

ఈ బోధనలు ఎలా నిలుస్తాయి?

కాలగర్భంలో కలిసిపోయిన అనేక విజ్ఞుల, తత్త్వ విదుల ఉపదేశాల మాదిరి 'లుప్తం' అయిపోకుండా వీటిని పరిరక్షించుకోవడం ఎలా?— అని ఎవరో అడిగినప్పుడు కృష్ణమూర్తి తరుణోపాయం చెప్పారు :

వాటిని అనువర్తించడం ద్వారానే అవి నిలుస్తాయి. LIVE THEM — అన్నారు.

ఉపదేశం; ఒక అభిప్రాయం ఎంతో బాగుంది, ఉపయుక్తంగా వుంది అని లొట్టలు వేయడం కాదు, అనుష్ఠానంలోనికి తీసుకురావాలి దాన్ని. అది ఒక్కటే అనుసరణీయమైన ప్రక్రియ అని ఆయన దాదాపు మొదటినుంచి-అంటే 1910లోనే-చెప్పారు. 1985-86 వరకు యీ ఆలోచననే పదే పదే వక్కాణిస్తూ వచ్చారు.

బోధనలు అని ఆయన అంగీకరించకపోయినా, ఆయన సూచనలను యధాతధంగా అవగాహన చేసుకునేందుకు 'నిరపేక్షంగా ఆసక్తులం' అవడం తప్ప మరో శ్రేయోమార్గం లేదు, ఎన్నో మానవ నిర్మిత పాశబంధాలతో కూరుకుపోతున్న ఈ మానవాళిలో భాగం అయిన మనకు అనిపిస్తుంది.

మనిషి పరిణామ పుష్పంగా వికసించి విశ్వమంతా విస్తరించాలి.

—0—

# ప్రవేశద్వారం

జె. కృష్ణమూర్తి జీవితంలో అనేక విచిత్ర సంఘటనలు వున్నాయి. ఆయన వ్యక్తిత్వాన్ని, తత్త్వ విచారాన్ని తెలుసుకోవటానికి ఈ సంఘటనలను కూడా కొంతలో కొంత ఎరుక పరుచుకోవడం అవసరం అవుతుంది.

బాల్యంలోనే ఆయన 'దివ్యజ్ఞాన సమాజ' నాయకుల పరిపోషణలో ఉన్నారు. ఆ సమాజం అధ్యక్షురాలు డాక్టర్ ఆనీబెసెంట్ ఆయనను తన రక్షణలోనికి తీసుకుంది. విద్యాభ్యాసం, పెరుగుదల, వ్యక్తిత్వ వికాసం మొదలయిన అన్ని అంశాలను ఆమె పర్యవేక్షించింది. ఈ కార్యక్రమంలో ఆమెకు బాసటగా నిలచినవాడు సి. డబ్ల్యు. లెడ్‌బీటర్ అనే ఆయన, ఇంకా కొందరు సమాజ సభ్యులు-హితైషులు. ఈ సమాజ పరిరక్షణలోనే వున్నా ఆయన కోసం ఒక ప్రత్యేక సంస్థను కూడా ప్రారంభింప చేసింది ఆమె. ఈ సంస్థకు నాయకుడు కృష్ణమూర్తి. పోషకురాలు ఆనీబెసెంట్. సంస్థ ప్రపంచవ్యాప్తంగా ప్రభవించింది. అనేకులు యువతీ యువకులు, వయోవృద్ధులు దీనిలో చురుకయిన కార్యకలాపాలు నిర్వహించారు.

విచిత్ర సంఘటన ఏమంటే, 1929లో-అంటే సంస్థ 18 సంవత్సరాలపాటు పనిచేసిన తరువాత- కృష్ణమూర్తి దీనిని రద్దు చేశారు. ఈ రద్దు చేస్తున్న ప్రకటన ఆయన 1929లో చేసినా, ఇందుకు ఆలంబన ఆయన ఆలోచనలు ఆయనకు అప్పటికి నాలుగయిదు సంవత్సరాలుగా మదిలో మెదులుతూ ఉండినాయి అని నిర్ధారణగా తెలుస్తుంది.

దీనిని రద్దు చేయడంలో తన ఆలోచనలు ఏమిటో, తన భవిష్యకార్యక్రమం ఏమిటో బహు వివరంగా ప్రసంగించారు కృష్ణమూర్తి. ఈ ప్రసంగ పాఠం ఆయన ప్రణాళికకు నాంది. దీనిని గురించి ఎంత వివరంగా తెలుసుకుంటే అంత స్ఫుటంగా, స్పష్టంగా అవగాహన అవుతుంది ఆయన ఆలోచన ధార. కృష్ణమూర్తి, తత్త్వచింతన అంతా ఇందులో ద్యోతకం అవుతుంది.

'ఈ సంస్థను రద్దు చేయడం చాలామందికి సంతోషదాయకంగా ఉంటుంది. అలాగే మరికొంతమందికి ఖేదకారణం అవుతుంది కూడా-' అంటారు. ఆయన ప్రారంభంలోనే. అయితే రద్దుచేయడం తప్పనిసరి. ఎందుకు తప్పనిసరో చెప్పడం ఆయన చేసిన ముఖ్యమయిన పని యిక్కడ.

ఒక పిట్టకథ చెబుతారు :

రోడ్డుమీద వెడుతున్నారు ఒక భూతం, దాని స్నేహితుడూ. రోడ్డుమీద వాళ్ళకి

ముందుగా ఒక మనిషి నడుస్తున్నాడు. ఆ మనిషి ఉన్నట్లుండి కిందకువంగి దారిలో దొరికిన ఒక వస్తువును ఏరుకుని తటాలున జేబులో వేసుకున్నాడు. 'ఏమిటా వస్తువు?' అనడిగాడు స్నేహితుడు, భూతాన్ని. 'అదా? సత్యం తాలూకు ఒక చిన్న ముక్క-, అని భూతం జవాబు. మనిషికి సత్యం దొరికితే నీ వ్యాపారం అంతా దివాలా అయిపోతుందిగదా- అని మందలింపుగా అంటాడు స్నేహితుడు. 'మరేం బెంగలేదు. నేను ఆ మనిషిచేత సత్యాన్ని వ్యవస్థీకరింప జేస్తాను' అంటాడు భూతం;

సత్యాన్ని వ్యవస్థీకరింప చేయడం (Organise) మనిషికి మంచిది కాదనీ, భూతానికి తగినపని అనీ సూచన ఈ కథలో దొరుకుతుంది. మనిషి ఈ పనిలో నానాఅవస్థలపాలు అవుతాడనీ, తన ముఖ్య కర్తవ్యానికి సుదూరంగా వెళ్ళిపోతాడనీ కూడా అర్థం చేసుకోవచ్చు.

ఈ కథ చెప్పిన తరువాత కృష్ణమూర్తి తన ఆలోచనను బయట పెడతారు.

'సత్యం అనేది దుర్గమ క్షేత్రం (A Pathless land). ఒక మతం ద్వారా, ఏదో సామూహికమయిన చర్యల ద్వారా ఎవరూ సత్య క్షేత్రానికి చేరుకోలేరు—' అంటారు.

ఇక్కడ దివ్యజ్ఞాన సమాజ ఆదర్శాలను ఒక్క క్షణం గమనంలోకి తీసుకు రావడం అవసరం. దివ్యజ్ఞాన సమాజం సత్యాన్వేషకుల సముదాయం.వీరు ఏ మతానికి చెందిన వారయినా కావచ్చును, ఏ మతానికీ చెందని వారయినా కావచ్చును. 'సత్యాన్నాస్తి పరోధర్మః' There is no Religion higher than truth — సత్యాన్ని మించిన మరో ధర్మం, న్యాయం, సూత్రం ఏమీ లేదు అనే ప్రకటన ఈ సమాజానికి మకుటం. ఫలానా మార్గం ద్వారా వెడితేనే సత్యసాక్షాత్కారం జరుగుతుంది. - అనే పద్ధతి లేదు. యిక్కడ 'దివ్యజ్ఞానం' పేరిట చెప్పే అనేక ప్రకృతి సూత్రాలు, ధర్మ ప్రవచనాలు కేవలం దత్తాంశం (Hypo—thesis) గానే తీసుకోవాలిగానీ, యిదే నికార్యయి?, అనుసరించక తప్పని నీతి సూత్రం అనే పద్ధతి ఉండగూడదని సభ్యులకు, ఇతరులకు పదే పదే గుర్తుచేస్తూ వుంటుంది దివ్యజ్ఞాన సమాజం. అలాగే ఈ సమాజ ప్రథమ ప్రకటిత ఉద్దేశ్యం ఏమంటే; జాతి, మతము, కులము, వర్గము, వర్ణము అనే విభేదాలు ఏ మాత్రం లేకుండా సర్వమానవ సోదర భావాన్ని ప్రదర్శించే ఒక అంకురాన్ని -Nucleus- తయారుచేయడం, నిర్మాణం చేయడం. కృష్ణమూర్తి బాల్యం నుండి యిటువంటి వాతావరణంలో పెరిగినవాడు; ఆలోచన విధానాన్ని మలుచుకున్నవాడు. సత్య క్షేత్రానికి చేరుకోవడంలో ఎలాంటి 'ముందే వేసి ఉంచిన బాటలు' ఉపకరించవు-

అని ఆయన యిప్పుడు నొక్కి వక్కాణించడం దివ్యజ్ఞాన సూత్రాలను మరో మాట లలో ప్రజల ముందుకు తీసుకురావడమే. ఆయన ఇంకా ఇలా అంటున్నారు. 'ఇదే నా ఖచ్చితమయిన అభిప్రాయం; దీనికి నేను కట్టుబడి ఉంటాను. స్థిరంగా, నిర్ని బద్ధంగా ఇందుకే నిలిచి ఉంటాను. "సత్యం" అనేది సరిహద్దులు లేనిది; ఎలాంటి షరతులకు నియమాలకు లొంగి వుండేది కాదు. ఏదో ఒక మార్గాన్ని పట్టుకుని నడిచినందువల్ల లభ్యం అయేది అసలేకాదు. దీన్ని వ్యవస్థీకరించడం అసాధ్యం. ఒకే పద్ధతిలో ఒకే మోస్తరుగా నడవండి, ప్రవర్తించండి అనే జనాన్ని కట్టడి చేయడం బలవంత పరచడం మంచి పనికాదు. ఈ విషయం ముందు చక్కగా అర్థం అయితే అప్పుడు ఒక మతాన్ని,విశ్వాసాన్ని వ్యవస్థీకరించడం ఎంత అసాధ్యమైన విషయమో మీకు తెలిసివస్తుంది.'

విశ్వాసం - నమ్మకం అనేది కేవలం వ్యక్తిగత విషయం. దీన్ని వ్యవస్థీ కరించడం అసాధ్యమైన విషయమే కాకుండా - మనం చేయగూడని పని కూడా— అంటారు ఆయన. ఎంతో కష్టపడి, శ్రమదమాలకు ఓర్చి వ్యవస్థీకరించినా అప్పుడు అది– సత్యం-కరుడు గట్టుకుపోయి పిడచకట్టుకుపోయి తయారవుతుంది. తప్ప జనానికి యేమాత్రం ఉపకరించేదిగా రూపొందదు.

నేను సిద్ధాంతాన్ని కనుగొన్నాను, యిది అందరికీ ఆచరణ యోగ్యం. దీనినే అందరూ తప్పనిసరిగా అనుసరించాలి....అనే ధోరణి ప్రపంచ వ్యాప్తంగా ఎందరో అనుసరించిన పద్ధతి! ఈ ధోరణి వల్ల సత్యం సంకుచితం అయిపోతుంది. బల హీనులకు ఆట వస్తువుగా తయారవుతుంది. తమ నిత్య వ్యవహారాలతో అతృప్తులైన వారికి తాత్కాలిక ఉపశమన హేతువు అవుతుంది. అంతే. సత్యాన్ని కిందకు దిగ జార్చకూడదు. మనిషి దాని స్థాయికి ఎదగటానికి ప్రయత్నం చేయాలి. పర్వత శిఖ రాన్ని లోయలలోనికి తీసుకు రాలేము కదా.... అంటారు ఆయన.

మీరు పర్వత శిఖరాన్ని చేరుకోవాలనుకున్నారు... అప్పుడు లోయగుండా నడచి వెళ్ళాలి. నిటారయిన మార్గంలో నిలువుగా పైకి ఎగబాకే ప్రయత్నం చేయాలి. కిందకు పడిపోతామేమో ప్రమాదంలో చిక్కుకుంటామేమోనని భయపడ కూడదు. అలాగే సత్యాన్ని అందుకోవాలంటే మీరు పైకి నడవాలి. కుశలంగా నేర్పుగా యీపని చేయాలి. అంతేగాని మీ కోసం ఎవరూ సత్యాన్ని కింది స్థాయిలకు తీసుకు వచ్చి, వ్యవస్థీకరించి రూపొందించలేరు. అలాగని వ్యవస్థ వల్ల ఏమీ ప్రయో జనము లేదనుకోగూడదు. ఇవి అభిప్రాయాలలో జనసామాన్యానికి అభిరుచులను తయారు చేస్తాయి. ఈ అభిరుచులు నిలకడగా వుండేట్లు చూస్తాయి. అభిప్రాయాల పట్ల బాహ్యమైన అపేక్షలు కలుగచేస్తాయి. బాహ్యమైన అపేక్ష ఒక్కటే చాలదు గదా! అంతరికంగా, స్ఫూర్తిదాయకంగా తయారు అవాలి అవి. 'సత్యం' పట్ల నిజ

మైన ఆపేక్ష, ఆకాంక్ష తానంతట అది తయారు అవుతే తప్ప బాహ్య వ్యవస్థల వల్ల ప్రత్యేక ప్రయోజనం యేమీ వుండదు. వ్యవస్థ దానిపట్ల ఆసక్తి తయారు చేయగలు గుతుంది. అంతవరకే దాని పని. ఇతర ఆపేక్షలు, ఆసక్తుల పట్ల గమనం లేకుండా సత్యం గురించిన ఆకాంక్ష యేర్పడాలి. వ్యవస్థ ఒక చట్టం వంటిది. ఆకాంక్ష వున్న వారందరూ యిందులొ యిమిడి పోతారు.చట్టంలో యిమిడిపోయిన తరువాత సత్యం పట్ల గమనం తగ్గిపోతుంది. నీరస పడుతుంది. పర్వత శిఖరానికి చేరుకోవాలి అన్న గమనం సడలిపోతుంది. ప్రతి మనిషీ యీ చట్టంలో తనకు ఒక స్థానం ఏర్పరచు కోవడం, యీ స్థానం చెక్కుచెదరకుండా వుండేట్లు చూచుకోవడం....అనే ప్రయత్నంలో కూరుకుపోతాడు. అంతేకాక, యీ వ్యవస్థ తనను సత్యం వయిపు నడిపిస్తుంది. అనే భ్రమలోచిక్కుకుపోతాడు. వ్యక్తిగతంగా తాను చేయవలసిన ప్రమాణాన్ని మరెవరో చేసి తనకు మార్గం సుగమం చేసి పెడతారనే దురూహలో కలిసి పోతాడు. ఇదీ వ్యవస్థ వల్ల వచ్చే ప్రమాదం.

ఈ సంస్థను. వ్యవస్థను రద్దు చేయడంలో ఆయన ముందుగా చెప్పిన కారణము యిది.

'నేను యీ సంస్థను రద్దు చేస్తున్నాను. మీలో కొందరు యితర సంస్థలను తయారు చేయవచ్చు. సత్యం కోసం అన్వేషిస్తున్నాం —అని చెప్పుకునే ఇతర సంస్థలలో సభ్యులుగా చేరవచ్చును!ఒక్క విషయం మటుకు చక్కగా గమనించండి నామటుకు నేను... ఆధ్యాత్మికతవైపు నడిపించబూనుకున్న ఏ సంస్థలోనూ భాగంగా వుండగోరను. కేవలం యాంత్రికము, ప్రయాణ గమనాన్ని సుకర పరిచే సంస్థల సంగతి వేరు. ఉదాహరణకు మీరు లండన్ వెళ్ళదలచుకున్నారు. ఆ నగరానికి వెళ్ళటానికి మీకు అవసరం అయిన విమానం టిక్కెట్లు, సదుపాయాలు కూరే సంస్థను ఎన్నుకుంటారు. వాళ్ళు మీ సౌకర్యాలు చూస్తారు. మీ ప్రయాణం అనుకున్నట్లుగా నెరవేరుతుంది. అయితే ఇదంతా యాంత్రికమైన వ్యవహారం. సత్యాన్ని చేరుకోవడం అనే ప్రయాణం యిలా యాంత్రిక సదుపాయాలవల్ల ఒనగూడేది కాదు. మోటారుకార్లు, పడవలు, తంతి వార్తలు పంపడం... ఇలాంటి సౌకర్యాలు చూసే సంస్థలు అనేకం వున్నాయి. వాటిని మనం ఉపయోగించుకుని అనుకొన్న పనులు పూర్తి చేసుకుంటాం. వీటన్నింటికీ 'ఆధ్యాత్మికత'తో ఎలాంటి నిమిత్తమూ లేదు. నేను బాహాటంగా చెప్పే విషయం యేమంటే—ఏ సంస్థ, వ్యవస్థ అయినా మిమ్మల్ని ఆధ్యాత్మికత వైపు, సత్యక్షేత్రానికి తీసుకు వెళ్ళి అక్కడ మీకు స్థావరం ఏర్పాటు చేయలేదు. దాన్ని జాగ్రత్తగా గమనించండి...

సత్యక్షేత్రానికి—ఆధ్యాత్మిక రంగానికి మిమ్మల్ని సురక్షితంగా చేర్చే సంస్థ యేదయినా ఏర్పాటు చేసినట్లయితే, ఆ సంస్థ కేవలం మీకు కట్టుకొయ్యలా, బల

హీనతగా, బంధంగా తయారు అవుతుంది తప్ప మీ వ్యక్తిత్వ వికాసానికి సహాయ పడదు. మీ పెరుగుదలకు, స్వావలంబనకు గుదిబండలా తయారయి కూర్చుంటుంది. 'నేను ఈ సంస్థకు నాయకుడిని గనుక, మీరు ఇలాంటి యిబ్బందులలో పడకుండా వుండాలనే దీనిని నేను రద్దు చేస్తున్నాను—'అంటారు ఆయన. ఇలా రద్దు చేయమని ఎవరో సలహా యిచ్చారనీ, బలవంత పరచారనీ అనుకోవద్దని చెబుతూ యిది తన స్వంత నిర్ణయమే, బహుకాలం ఆలోచించిన మీదట చేరుకున్న నిశ్చయమే అని మళ్ళీ మళ్ళీ చెబుతారు

'ఇదేదో మహత్కార్యం అనిగూడా నేను అనుకోవడం లేదు. నాకు అనుయాయులు, శిష్యులు అక్కర్లేదు-' అంటూ మీరు ఎవరినయినా అనుసరిస్తున్నారు అంటే సత్యాన్ని చేరుకునే ప్రయత్నం విరమించుకున్నారనే అర్థం అని కూడా అంటారు.

"నేను చెబుతున్న విషయాలు- ఈ కారణాలు మీరు ఎలా తీసుకుంటున్నారు, ఎలా అన్వయించుకుంటున్నారు అనేది నన్ను బాధించదు. నేను ఈ ప్రపంచంలో ఒక పని చేయదలుచుకున్నాను. అచంచలమైన ఏకాగ్రతతో ఆ పని చేస్తాను- అంతే!"

"మనిషికి నిర్నిమిత్తంగా స్వేచ్ఛ చేకూర్చడం ఒక్కటే నాకు ముఖ్యమయిన కర్తవ్యంగా కనిపిస్తోంది" అంటూ ఆయన యింకా యిలా వివరిస్తారు: అన్ని రకాల పంజరాల నుంచి, భయాల నుంచి మనిషిని విముక్తుడిని చేయాలి. కొత్త మతాలు స్థాపించడం, కొత్త శాఖలు ఏర్పరచడం, కొత్త సిద్ధాంతాలు, తత్త్వదర్శనాలు రూపొందించడం కాదు నా పని.

"అయితే మీరు మరో ప్రశ్న వేయవద్దు. ఎందుకు ప్రపంచం అంతటా తిరుగుతావు? నీ అభిప్రాయాలను ప్రచారం చేసుకుంటూ ఎందుకు ప్రసంగాలుచేస్తావు?"- అని దానికి యిలా సమాధానం చెబుతారు: "నాకు అనుయాయులు, శిష్యులు కావాలని నేను యీ పనులన్నీ చేయడం లేదు ప్రత్యేక తరహాకు చెందిన శిష్యులను తయారు చేయడం కోసం యిదంతా చేయడం లేదు. మనుషులకు యిలా తమకు తాము ప్రత్యేక తరహాకు చెందిన వాళ్ళం అనుకోవడంలో యెంతో మక్కువ వుంటుంది ఈ మక్కువను పెంచడం నా ఉద్దేశ్యం కాదు. ఇదో నిరర్థకమయిన పని అనిగూడా నా ఉద్దేశ్యం. నాకు శిష్యులు లేరు, ప్రత్యేక దూతలు లేరు, భూలోకంలో గాని.... ఆధ్యాత్మ రంగంలోగానీ నాకు అనుయాయులు అంటూ యెవరూ లేరు...."

"అంతేకాదు ధన సంపాదన కోసం,జీవితం కులాసాగా అనుకూలంగా గడిపి వేయడం కోసం చేస్తున్న ఏర్పాటు కూడా కాదిది. అలాంటి ఉద్దేశ్యాలు వున్న మనిషి

యిటువంటి "క్యాంపు"లకు రావడం యిక్కడి దయనీయ పరిస్థితులలో కాలం గడపటం కుదరదు. ఈ విషయం అంతా యింత స్పష్టంగా ఎందుకు చెబుతున్నానంటే -దీనిని గురించి పదే పదే, ప్రతి సంవత్సరమూ ఎవరెవరో ప్రస్తావనలు తీసుకు రావడం, చర్చిస్తూ వుండడం నాకు యిష్టం లేదు. సందర్భాన్ని ఒకేమారు కూలంకషంగా నిర్ణయించుకుని నికార్సయిన విషయాన్ని బయలుపరచడం కోసమే యిప్పుడీ మాటలు చెబుతున్నాను. ఇదే విషయాన్ని నిరవధికంగా చర్చిస్తూ కాలహరణం చేయడం, అభిప్రాయాల తికమకలలో చిక్కుకుపోవడం-చిన్నపిల్లలు చేసే పని. అలాంటి పని జరగడం నాకు యిష్టం లేదు, అందుకనే ముక్కుకు సూటిగా స్పష్టంగా, ఇప్పుడు చెప్పివేస్తున్నాను...." అనికూడా అన్నారు. ఆయన అభిప్రాయాలలో స్పష్టతను సూటితనాన్ని గమనించడం చాల అవసరం. విషయాన్ని ఉన్నది ఉన్నట్లుగా చూడగలగాలి....

దివ్యజ్ఞాన సమాజ ప్రధాన స్థాపకులు, దివ్యజ్ఞాన తత్త్వదర్శనాన్ని కూర్చిన వారు అయిన మేడం బ్లావట్ స్కీ ధోరణి కూడా యిక్కడ మనం ప్రస్తావించుకోవడం అవసరం. సత్యనిరూపణ కోసం బృహద్గ్రంథాలు 'అయిసిస్ అన్ వీల్డ్', 'ది సీక్రెట్ డాక్ట్రిన్' వ్రాసిన బ్లావట్ స్కీ ప్రపంచంలో యింతవరకు ఆవిర్భవించిన మతాలు, తత్త్వశాస్త్రాలు, విజ్ఞాన శాస్త్రాలను సమతుల్యంగా క్రోడీకరించి చర్చించి వాటికి 'మూలం' ఒక్కటే అన్న విషయాన్ని నిర్ధారించటానికి ప్రయత్నించారు. వీటి 'ఏకత' గమనించగలగడం, విస్తృతమయిన భౌగోళ పరిస్థితులలో.... మానసిక మేధా పరిణామరంగంలో యిలా అనేక దర్శనాలు అవతరించడం సహజమేనని గ్రహించడం అత్యవసరం అంటారు ఆమె. కాకపోతే వివిధ రంగాలలో, అభిప్రాయ ప్రాంగణాలలో వ్యక్తుల దురూహలవల్లగానీ- సంస్థాపరమైన పరిమితులవల్లగానీ చేరుకుని కరుడుగట్టుకుపోయిన దురభిప్రాయాలను-ఛాందసాలను కడిగివేయడం అవసరం గనుక తాను ఈ ఉద్గ్రంథాలను వ్రాయవలసి వచ్చిందంటారు. ఎప్పటికప్పుడు మానవమేధస్సులో కలుపు మొక్కలలాగ విషవృక్షాలలాగ మొలుస్తూ విస్తరిస్తున్న దురర్థాలను సమూలంగా పెకలించివేసి, క్షేత్రాన్ని సునిశితంగా, నిష్కల్మషంగా తయారుచేసి వుంచటమే 'జ్ఞానసంచయాన్ని' ప్రపంచానికి సరఫరా చేయదల్చుకున్న పెద్దల కర్తవ్యం అని కూడా అమె చెబుతారు. 'విషపూరితమైన వాతావరణాన్ని తొలగించడమే నేను చేసిన పని. మనిషి మనస్సు స్వచ్ఛంగా తయారయి కొత్త కొత్త సత్యాలను అవి అవతరించినప్పుడు గుర్తించి, అందుకు అనుగుణంగా వర్తనాన్ని మలుచుకుని పురోభివృద్ధిని సాధించడమే మానవజాతి కర్తవ్య'మని ఆమె గుర్తుచేస్తారు.

వ్యవస్థలు ఏర్పడడం, కొత్తకోణాలనుంచి ప్రకృతిని పరిసరాలను విశ్లేషిం

చడం, కాలానుగుణంగా వాటిలో ఎన్నో అవలయాలు, అవకతవకలు చేరడం....
దానివల్ల వ్యవస్థ తన అసలు ప్రయోజనాన్ని దాదాపు మరచిపోవడం- వ్యక్తుల
స్వార్థమే పరాకాష్ఠ అయిన పరమ ప్రయోజనంగా రూపొందడం మనం ప్రపంచ
చరిత్రలో చూస్తూనే వున్నాం.

ఈ దృష్టితో గమనించినప్పుడు కృష్ణమూర్తి ప్రకటన ఒక 'చారిత్రక అవ
సరం'గా కూడా రూపొందుతుంది. ఆయన యింకా యీ 'రద్దు'ను గురించి ఏమంటు
న్నారో చూద్దాం.

'నన్నో వార్తాపత్రిక ప్రతినిధి కలుసుకున్నాడు. వేలకు వేలు మనుష్యులు
సభ్యులుగా అనుయాయులుగా వున్న యీ సంస్థను రద్దు చేయడం చాల గొప్ప
విషయం-అద్భుతమైన సంచలనాన్ని కలుగచేసే సంగతి అని కూడా అన్నాడు.
ఆయనకు యిదో విచిత్రంగానే కనిపించింది. ఆయన యేమన్నాడో చూడండి :
"సంస్థను రద్దు చేస్తారు, సరే. తరువాత మీరు యేం చేస్తారు ? ఎలా బతుకుతారు ?
మీ చుట్టూ అప్పుడు జనం పోగవరు మీరు చెప్పే మాటలు వినడానికి వేలసంఖ్యలో
శ్రోతలు మీచుట్టూ మూగరు. మీరు యేమయిపోతారు?"-అన్నాడు. వేలలో లక్షలలో
ప్రజలను మనచుట్టూ పోగుచేసుకోవడం గొప్ప విషయమే కావచ్చును.కాని చూడండి.
నా అభిప్రాయం ఏమంటే, 'చక్కగా కుశలంగా వినగలవాళ్ళు అయిదుగురే వున్నా
చాలు! వాళ్ళు తాము విన్న సంగతులను ఆచరణలో అనుక్షణంలో తీసుకురాగలిగిన
వాళ్ళయితే అంతే చాలు. వాళ్ళ ముఖాలు, మానసిక కోణాలు శాశ్వతమైన సత్యం
వయిపు మళ్ళివుంటే చాలు! వేలకొద్దీ మనుషులు-తలలు వూపేవాళ్లూ-వుంటే యేం
లాభం ? ఏం వింటున్నారో కూడా సరీగా తెలుసుకునే శక్తి లేనివాళ్ళు ఎన్ని వేలు
లక్షలమంది వుంటే మటుకు యేం ప్రయోజనం? వింటున్నవాళ్ళకు-శ్రోతలకు-పూర్వ
నిశ్చిత భావాలు వుండగూడదు. కొత్తగా వింటున్నదానిని తమ పూర్వపు పడికట్టు
రాళ్ళతో తూచి చూచుకునే ఆలోచన వుండగూడదు. ఇదివరకు తెలిసిన విషయాల
తోనే ముడిపెట్టుకు కూర్చుని,యిప్పుడు వింటున్నది దానితో సరిపోలుతోందా లేదా...
దానితో సమన్వయ పరచుకోవడం ఎలా అనే ఆలోచనలతో సతమతం అవుతూ
వుండేవాళ్ల వల్ల యేమీ ప్రయోజనం లేదు. నేను యిలా కుండ బద్దలు కొట్టినట్లు
మాట్లాడుతున్నానని అనుకోకండి కర్కశ హృదయంతో ప్రవర్తించడం లేదు నేను.
నాకు జాలి, అనుకంప, సానుభూతి, సహకార మనోభావం వున్నాయి. ఒక సర్జన్
వున్నాడనుకోండి. మీ శరీరంలో దుష్టాంగాన్ని తొలగిస్తాడు అతను. మీకు
తాత్కాలికంగా బాధ కలుగుతుంది నిజమే. కాని మిమ్మల్ని బాధించాలని అతని
ఉద్దేశ్యం కాదు. మీకు ఆ దుష్టాంగం నుంచి, అది తయారుచేసే యీతిబాధల నుంచి
విముక్తి కలిగించాలని కదా అతని ప్రయత్నం. అదే పద్ధతిలో నేను యిలా సూటిగా,

మీకు తాత్కాలికంగా యిబ్బంది కలిగే పద్ధతిలో మాట్లాడుతున్నాను. అంతే. నాకు నిజమైన ఆప్యాయత, ఆత్మీయత లేవనుకోకండి నిజానికి అవన్నీ వున్నాయి గను కనే యిలా ప్రవర్తిస్తున్నాను.'

ఈ వివరణను అప్పటికప్పుడు తాత్కాలికంగా గమనించడమే కాకుండా, తరువాతి ఆయన ప్రసంగాలలో కర్కశ వచనాలు వచ్చినప్పుడు కూడా గుర్తుంచుకో వలసిన అవసరం వుంది. 'మానవాళి పట్ల బాధ్యత' వున్న వ్యక్తి తాత్కాలిక ప్రయోజనాలు–దీర్ఘకాలిక ప్రస్తావనలను ఎలా విడమరచి చూపుతాడో గమనించడం కూడా యిక్కడ శ్రేయస్కరం.

ఆయన ఒకే విషయాన్ని పునరుక్తి దోషం అంటించకుండా మళ్లీ మళ్లీ చెబుతూ వుంటారు. విరిచి విరిచి చెబుతూ వుంటారు.

'నా ఉద్దేశ్యం ఒక్కటే: అదే-మనిషిని స్వేచ్ఛాయుతుడ్ని చేయడం. అతన్ని స్వేచ్ఛ వయిపు మళ్లించడం. అన్ని పరిమితుల నుంచి, బంధనాల నుంచి విముక్తిడిని చేయడం. అటువంటి స్థితి మటుకే మనిషికి శాశ్వతమైన ఆనందాన్ని కూరుస్తుంది. అతనికి నిర్నిబద్ధంగా ఆత్మసందర్శనం ఒనగూరుస్తుంది. (**Will give him the unconditioned realisation of self**).'

మరింత స్పష్టంగా ఎలా చెబుతున్నారో చూడండి :

'నేను స్వేచ్ఛాజీవిని. ఎలాంటి బంధనలు లేనివాడిని. పరిపూర్ణుడిని. నేను ఒక తునకను. ఒక భాగాన్ని కాదు. శాశ్వతమైన పరిపూర్ణతను నేనే. నన్ను అనుసరించ దలుచుకున్నవాళ్ళు, అర్థం చేసుకోవాలనుకున్నవాళ్ళు-తాముగూడా స్వేచ్ఛాజీవులే అయివుండాలి. నన్ను అనుసరించడం అంటే స్వేచ్ఛ యేం వున్నట్లు? నన్నో పంజ రంగా తయారుచేసి దానిలో ఒక మతాన్ని ప్రతిష్టిస్తున్నారన్నమాట! అన్నిరకాల భయాలనుంచీ స్వేచ్ఛగా వుండాలి. మతం తాలూకు భయాలు, ముక్తిని గురించిన భయాలు, ఆధ్యాత్మికతకు సంబంధించిన భయాలు, అలాగే ప్రేమ - మృత్యువు- జీవితం వీటన్నిటిని గురించిన భయాలు, ఎన్నో వున్నాయి. వీటన్నిటినుంచీ విము క్తులు కావడం అవసరం. ఒక చిత్రకారుడు వున్నాడనుకోండి. అతను బొమ్మలు గీస్తాడు. రంగు రంగుల చిత్రాలు తయారుచేస్తాడు. ఎందుకోసం ? బొమ్మలు గీయడంలోను వర్ణచిత్రాలు తయారుచేయడంలోను అతనికి ఆనందం వుంది. అతని ఆత్మ అందులో అభివ్యక్తం అవుతుంది. అతని వైభవం, సంక్షేమం అంతా అందులో వెల్లివిరుస్తుంది. అందుకోసమే అతడా పని చేస్తాడు. అందుకోసమే——నేను చేయదలుచుకున్న పనులన్నీ చేసుకుంటూ పోతాను, అంతేగాని యింకెవరినుంచో, దేనినుంచో యేదో ప్రతిఫలం, పారితోషికం ఆశించి కాదు. నాకు యితరుల నుంచి యేమీ అవసరం లేదు. ఏమీ కావాలని కోరను.

'మీకందరికీ అధికారానికి దాసోహం చేయడం అలవాటు. అధికారానికి చేతులు కట్టుకు నించోవడం, మనస్సును మౌనపరచుకోవడం చేస్తారు. ఇలాంటి వాతావరణమే అధ్యాత్మికత వయిపు మిమ్ములను నడిపిస్తుందని భావిస్తారు. ఎవరో ఒక మహా పురుషుడు-మంత్రద్రష్ట- మాయాజాలం తెలిసినవాడు మిమ్మల్ని యీ భవసాగరం నుంచి అవతలి గట్టుకు అవలీలగా తీసుకుపోయి పడేస్తాడని ఆశిస్తారు.

సుఖప్రాంగణంలో శాశ్వతంగా స్వేచ్ఛ అనిపించే వాతావరణంలో మిమ్ము తేలియాడేట్లు చేస్తారని ఊహిస్తారు. అటువంటి మనుషులకు, వాతావరణానికి 'దాసోహం' చేయడం అలవాటయిపోయి, మీ జీవిత విధానం అంతా యిటువంటి వాటికే అంకితం అయింది.

ఆ తరువాత మరో కోణం నుంచి యీ పరిచర్యను వివరించ బూను కుంటారు. సంవత్సరాల తరబడి ఉపన్యాసాలు, ఉపదేశాలు వింటాము. కాని ఎలాంటి మార్పూ రాదు. మన నడవడిలో, వైఖరిలో. ఎందుచేత?- కారణాలను వివరించటానికి ముందు, పరిస్థితిని విశ్లేషిస్తూ ఆయన యేం అంటున్నారో చూద్దాం:

"ఇప్పటికి మూడు సంవత్సరాలుగా మీరు యిలాంటి కన్వెన్షన్లలో నా ప్రసంగాలు వింటున్నారు. బహు కొద్దిమందిలో తప్ప మీలో యెలాంటి మార్పూ రాలేదు. నేను యేం చెబుతున్నాను అనేది పట్టుపట్టి గట్టిగా పరీక్షించి చూడండి. నేను చెబుతున్న దానిని విమర్శించుకు చూడండి.కడిగిపారవేయటానికి,ముక్కలు ముక్కలుగా నరికి వేయటానికి ప్రయత్నించండి. అప్పుడే మీకు నేను చెబుతూ వున్నది పూర్తిగా నికార్సుగా అర్థం అవుతుంది. ఆధ్యాత్మికంగా మిమ్ములను ముందుకు తీసుకుపోవటానికి ఒక సంస్థనో వ్యవస్థనో నిర్మించుకోవాలని చూస్తున్నారంటే మీరు దాని అధికారానికి దాసానుదాసులయిపోతారు. ఆధ్యాత్మికత వయిపు మమ్మల్ని తీసుకు వెడుతుంది అనుకున్న యీ సంస్థే మీకు పంజరంగా తయారవుతుంది. మీరు ఆ పంజరంలో చిక్కుకుపోతారు. మీకు తెలియకుండానే!

"మళ్ళీ గుర్తు చేస్తున్నాను. కర్కశంగా మాట్లాడుతున్నాను గదా అని నాకు సానుభూతి, సహకారభావం యేమాత్రమూ లేవని అంచనా వేయకండి. నేనేమీ క్రూరుడిని కాదు, కర్కోటకుడిని కాదు. నేనేం చెబుతున్నానో మీరు పూర్తిగా సరిగా అర్థం చేసుకోవాలనే కోరికతో, తపనతో యిలా మాట్లాడుతున్నాను. మీరందరూ యిక్కడకు ఎందుకు వచ్చినట్లు? నేనేదో చెబుతాననీ, అది మీకు ఉపకరిస్తుందనీ కదూ? అందుకోసమే నేను యిలా కుండబద్దలు కొట్టినట్టుగా చెప్పవలసివస్తోంది. నిష్కర్షగా మాట్లాడవలసి వస్తోంది.

సాధారణంగా మనిషి మనస్సుకు రెండు లక్షణాలు వుంటాయి. ఎవరు యేం

చెబుతూవున్నా విని ఊకొట్టటం ఒక్కటి అయితే యిదంతా అబద్ధం అని కొట్టిపార వేయడం మరొక్కటి. ఆలోచించకుండా నిదానంగా పరిశీలించకుండా ఎదుటి మనిషి చెబుతున్న దానిని అంగీకరించినా, నిరాకరించినా.... యీ రెండు చర్యలవల్లా కూడా ఆ మనిషికీ అతను చెబుతున్న దానికీ అన్యాయం చేసిన వాళ్ళమే అవుతాం' కొందరయితే 'యిదివరకు యీ సంగతి నేను విన్నాను. నాకు తెలుసు. అందువల్ల యిది నిజమే' అనుకుంటారు; మరికొందరు "యిదివరకు యెక్కడా వినలేదు. అందువల్ల యిది తప్పనిసరిగా అబద్ధం అయివుంటుంది" అనుకుంటారు. వాళ్ళు నిజం అనుకున్నా, అబద్ధం అనుకున్నా... వాళ్ళ వాళ్ళ మనోభావాలమీద ఎలాంటి పరిణామమూ లేకుండా పోవడం మరో విషయం. "నాకు తెలుసు గనుక యిది నిజం.... తెలియదు గనుక యిది అబద్ధం— అని తేలికగా కొట్టిపారవేయకు. తెలియని దాన్ని పరిశీలించి చూచి ఆలోచించి తెలుసుకునేందుకు ప్రయత్నం చేయి. ప్రతిదానినీ కూలంకషంగా పరీక్షపెట్టి చూచుకో...." అని నారదుడు ఒకచోట అంటాడు. సామాన్యంగా తత్త్వవేత్తలు, దార్శనికులు చెప్పేదే యీ ధోరణి. "దేనినీ గుడ్డిగా నమ్మకు. అపనమ్మకంతో కొట్టిపారవేయకు. నిదానంగా ఆలోచించి నిగ్గుతేల్చుకో" అన్న సూత్రాన్ని దాదాపు అందరూ చెబుతారు.

బ్లావట్స్కీ యిదే విషయం అనేకమార్లు ప్రస్తావిస్తారు. పూర్వుల విషయం గుర్తుచేసుకుంటే శంకరుడు—అంతకుముందు బుద్ధుడూ యిదే విషయం యిదే రీతిగా చెప్పారు. కృష్ణమూర్తి కూడా యిదే కోవలో మాట్లాడారు. ఈ విషయాన్ని మనం గుర్తువుంచుకోవడం అవసరం.

కృష్ణమూర్తి మళ్ళీ తన స్వవిషయం ప్రస్తావిస్తూ యిలా అంటున్నారు:

"పద్దెనిమిది సంవత్సరాలు మీరు వేచివున్నారు;కాచుకుని వున్నారు. జగద్గురువు అవతరిస్తాడనీ, యేవేవో బోధనలు యిస్తాడనీ, పద్దెనిమిది సంవత్సరాలపాటు యేదో మహత్తర సంఘటన జరుగుతుందని, దానికోసం ఎదురు తెన్నులు చూస్తూ కూర్చున్నారు. ఎవరో వచ్చి మీ హృదయాలకు- మనస్సులకు సరికొత్త ఊరట, కాంతి కలుగజేస్తారని ఊహించారు. దానితో మీ జీవనవిధానం అంతా మారిపోతుందనీ, మీకు సరికొత్త అవగాహన యేర్పడుతుందనీ ఆకాంక్షించారు. మీ జీవన ప్రమాణం మరో ఉన్నత సీమకు ఎదుగుతుందనీ, మీకు సరికొత్త ప్రోత్సాహం ఆలంబన ఏర్పడుతుందనీ కోరుకున్నారు ఎవరో మిమ్మల్ని విముక్తులను చేస్తారని ఎదురు చూశారు. ఇప్పుడు ఏం జరుగుతోందో చూడండి. జాగ్రత్తగా పరిశీలనగా గమనించండి. తార్కికంగా ఆలోచించి చూడండి. మీ నమ్మకం మీకు ఏ రకమయిన ఫలితాన్ని తీసుకువచ్చిందో చూచుకోండి. మీరు కొత్తరకం మనుషులుగా తయారయినారా? పైపై మార్పుల విషయం కాదు నేను చెబుతూవున్నది. ఏదో ఒక కొత్త 'బ్యాడ్జి'

తగిలించుకున్నారు. అదో అల్ప విషయం; దానిని గురించి కాదు నేను చెప్ప చూస్తున్నది. మీ నమ్మకం పాత కీపితాలలోని అముఖ్యమైన, అప్రధానమైన విషయాలను ఆసాంతం తోలిపారవేయగలిగిందా? అదే- నిర్ణయం తీసుకునేందుకు అనుకూలమైన పరీక్షాంశం. మీరు ఏ రకంగా స్వేచ్ఛాయుతులు అయినారు, విముక్తులుగా రూపొందారు. ఉన్నతులైనారు, అబద్ధము-కృతకము-అప్రధానము అయిన బాహ్య వ్యవస్థలకు ఏ విధంగా వ్యతిరేకులుగా, ప్రమాదకారకులుగా తయారయినారు? ఈ 'తారక సంస్థ' సభ్యులు యితరులకంటె ఏ రీతిని భిన్నంగా వున్నారు?

'పద్దెనిమిది సంవత్సరాలపాటు మీరంతా వేచి వున్నారనే విషయం మళ్ళీ గుర్తు చేస్తున్నాను. అప్పటి నుంచీ సంసిద్ధులు అవటానికి ఉత్సాహంగా కూర్చున్నారు. నేనే జగద్గురువునా, కాదా అనే విషయంలో మీ నమ్మకాలు, విశ్వాసాలు యెలా వున్నాయి అనేది నాకు ప్రధానాంశం కాదు. మీరు ఈ తారకసంస్థ సభ్యులుగా వున్నారు గనుక, దానికి చెందినవారం అనుకున్నారు గనుక దీనికోసం మీ శక్తి యుక్తులన్నీ ధారపోస్తున్నారు మీ సహాయ సహకారాలు అందిస్తున్నారు. కృష్ణమూర్తే జగద్గురువు అని సంపూర్ణంగానో, పాక్షికంగానో మీ నమ్మకాన్ని ప్రకటిస్తున్నారు. నిజంగా అన్వేషణలో మనసు నిల్పినవారికి పూర్తి నమ్మకాన్ని, అర్ధసత్యాలతోనే తృప్తిపడి వుండేవాళ్ళకు పాక్షికమయిన నమ్మకాన్ని ప్రదర్శిస్తున్నారు. అంతే!

'ఈ పద్దెనిమిది సంవత్సరాల మీ సంసిద్ధతలో, మీ అవగాహనలో యెన్ని క్లిష్టతలు వున్నాయో, ఎన్ని సంకీర్ణతలు ఎదుర్కోవలసి వచ్చిందో ఎంతెంత క్షుల్లక విషయాలను తట్టుకోవలసి వచ్చిందో మీరు ఎరుగుదురు. మీ దురూహలు, భయాలు, అధికార ఆదేశాలు, దేవాలయాలు-పాతవీ, కొత్తవీ కూడా అవగాహనకు ఆటంకాలుగానే తయారవుతున్నాయని నేను మళ్ళీ నొక్కి చెబుతున్నాను. ఇంతకంటే విడమరిచి మరింత స్పష్టంగా చెప్పటం ఎలాగో నాకు తెలియదు. మీరు జాగ్రత్తగా వినండి. నేను చెబుతున్నదానితో మీరు అంగీకరించనక్కరలేదు. నన్ను మీరందరూ అనుసరించవలసిన పనిలేదు. నేను చెబుతున్నది అర్థం చేసుకోవటానికి ప్రయత్నించండి. అంతే చాలు.

—ఈ రకంగా పద్దెనిమిదేళ్ళపాటు తన తారకసంస్థ ఏ విధమయిన కొత్త యిబ్బందులు తీసుకువచ్చిందో వివరిస్తూ పోతారు. ఎంత తార్కికంగా చెప్పినా, సోదాహరణంగా ప్రసంగించినా. మూలవిషయాల అవగాహనలో ఎలాంటి మార్పులు రాలేదని-శ్రోతల ప్రవర్తన తీరులు మార్పు లేనేలేదనీ ఆయన మరోమారు స్పష్టపరుస్తారు.

'ఈ విషయం సరిగా అవగాహన చేసుకోవటం అవసరం. మీ నమ్మకాలు,

విశ్వాసాలు మిమ్మల్ని మార్చివేయలేకపోయాయి. అంతేకాదు ఎన్నో ఆటంకాలు, ప్రతిబంధకాలు తీసుకువచ్చాయి. మీరు విషయాలను ఉన్నవి వున్నట్లుగా చూచటానికి ప్రయత్నించడం వల్ల మరింత చిక్కు ఉత్పన్నమవుతూ వస్తోంది.

'మీ దేవుళ్ళను మీరు నిర్మించుకోవాలని చూస్తున్నారు. పాతదేవుళ్ళను తీసేసి ఆ స్థానాలలో కొత్త దేవుళ్ళను ప్రతిష్టించుకుంటున్నారు. పాత మతాలను కూలదోసి, కొత్త మతాలను ప్రతిష్ఠిస్తున్నారు. పాత రూపాలు సమసిపోతున్నాయి. వాటి స్థానంలో కొత్త ఆకారాలు చోటుచేసుకుంటున్నాయి. పాతవీ, కొత్తవీ.... ఈ రెండు రకాల విభజనలు వింగడింపులుకూడా నిష్ప్రయోజనమైనవీ, విలువలేనివీ, ప్రతిబంధకమూ, అడ్డుకర్రలూనూ! ఆధ్యాత్మికంగా యిదివరకూ విభాగాలు, విభజనలు వుండేవి. అవి యథాతథంగా యిప్పుడు లేవు. కాని మరో కొత్తరకం విభజన, విభాగం యిప్పుడూ వుండనే వుంది. పాత పూజా విధానాలు యిప్పుడు లేవు కాని కొత్త పూజా విధానం వుంది. విధానాలలో మార్పులేతప్ప 'పూజ'లో పునస్కారాల్లో ఎలాంటి మార్పులు లేవు. మీరందరూ ఆధ్యాత్మికత కోసం- అందులో పురోభివృద్ధి కోసం యింకెవరిమీదనో ఆధారపడుతున్నారు. మీ సుఖానుభూతులకోసం యితరులను ఆశ్రయిస్తున్నారు. మీ మానసిక వికాసం కోసం యింకెవరిమీదనో దృష్టి వుంచుతున్నారు. పద్దెనిమిది సంవత్సరాలుగా యీ పరిశ్రమలన్నీ అనవసరం, ఈ బాహ్యాడంబరాలు శుద్ధవ్యతిరేకం ...అని నేను చెబుతూనే వున్నాను. మీరు వింటూనే వున్నారు. తలలు ఊపుతున్నారు. కాని అవన్నీ కొనసాగిస్తూనే వున్నారు. వీటన్నిటికీ విరామం యివ్వాలనీ నిలిపి వేయాలనీ నేను చెబుతూనే వున్నాను. మీ వికాసం కోసం, పురోగతికోసం, ఆధ్యాత్మికతకోసం మీలోకి మీరు చూచుకోవాలి. అంతర్ముఖులు అవాలి.... వికాసము, వైభవము, పవిత్రత.... ఇలాంటివన్నీ అంతరంగంలో సమకూడాలి. ఆత్మవికాసం కోసం భ్రష్టరీతులు పనికిరావని నేనుచెబుతూ వున్నా మీరు నా మాటలను అనుసరించటానికి అంత సుముఖంగా లేరు. ఎవరో ఒకళ్ళు, ఇద్దరు తప్ప తతిమ్మావాళ్ళంతా మీ యిష్టం వచ్చినట్లే- మీకు తోచినట్లే ప్రవర్తిస్తున్నారు.

'ఇటువంటి పరిస్థితులలో యీ వ్యవస్థ వుంటే నేమి? వుండకపోతే నేమి ?'

కృష్ణమూర్తి ఆవేదన, అంతః చింతన యిక్కడ మనం అర్థం చేసుకోవటానికి ప్రయత్నించవచ్చు' ఆయన ప్రస్తుతం అంటున్నది ఒక్కటే మాట. సరికొత్త వికాసం కోసం- పురోగతి కోసం– ఆధ్యాత్మికత కోసం.... నేను యిన్ని సంవత్సరాలుగా ఈ సంస్థ ద్వారా అనేక సూచనలు, ప్రకటనలు యిస్తూ వస్తున్నాను. వీటిని మీరు వింటున్నారు, తలలు ఊపుతున్నారు. కాని ఆచరణ దగ్గరకు వచ్చేసరికి ఏమీ

మార్పులు, చేర్పులు జరగడం లేదు. బాహ్య ఆడంబరాలలో మార్పులు కొట్టవచ్చి
నట్లు కనిపిస్తున్నా ఆంతరికమైన మార్పులు మాత్రలు అసలు గోచరమే కావడం
లేదు. నా మాటలను ఒకళ్ళు యిద్దరు తప్ప....బహుజనం, సభ్యులందరూ పట్టించు
కోవడం లేదు. అనుసరించు ప్రయత్నం అలా వుంచి-అవగాహన చేసుకుందుకయినా
ప్రయత్నం చేయడం లేదు ఇటువంటి సందర్భంలో....ఇంక ఈ సంస్థ ఉండి యేమి
లాభం? ఉండక యేమి నష్టం?.... అందుచేత దీన్ని రద్దుచేయడమే శ్రేయస్కర
మైన పని....ఇదే ఆయన ఆలోచనా ధోరణి.

ఆయన యింకా పదునుగా, నిష్కర్షగా, నిర్మొగమాటంగా ఎలా మాట్లాడు
తున్నారో చూడండి:



ఈ అబద్ధాల కోరులను. పైకొకటి లోపల ఇంకొకటి ఆలోచించే మనుష్యు
లను....నా చుట్టూ చేర్చుకోవడం ఎందుకు? నేనేదో నిష్కర్షగా కర్కశంగా
మాట్లాడుతున్నానని-నిర్దయగా వ్యవహరిస్తున్నానని అనుకోకండి. కాని యిప్పుడు
మనం ఓ స్థితికి చేర్చుకున్నాం. పరిస్థితులను ఉన్నవి ఉన్నట్లుగా కనిపిస్తున్నవి కని
పిస్తున్నట్లుగా గమనించగలగాలి. పోయిన సంవత్సరమే మీకు చెప్పాను. నేను పరి
స్థితులతో రాజీపడటానికి, సంసిద్ధంగా లేనని. నా మాటను అతి స్వల్ప సంఖ్యలోనే
ఖాతరు చేశారు అప్పుడు. ఈ సంవత్సరం అదే విషయాన్ని మరింత నిర్ద్వంద్వంగా
చెబుతున్నాను. ఈ పద్దెనిమిది సంవత్సరాలుగా ప్రపంచ వ్యాప్తంగా ఎందరు
సభ్యులు నా కోసం—నా సందేశం, నిర్దేశనం కోసం ఎదురు చూస్తూ వున్నామని
అనుకుంటున్నారో నాకు తెలియదు తారక సంస్థలో సభ్యులు మీరంతా. అయితే
మీరందరూ బేషరతుగా, ఎలాంటి అరమరికలు లేకుండా నేను చెప్పేదంతా సంపూ
ర్ణంగా వినడానికి సిద్ధమయ్యిలేరు.



అటువంటి పరిస్థితిలో యీ వ్యవస్థ ఎందుకూ?

'మళ్ళీ చెబుతున్నాను: నా ప్రయోజనం,లక్ష్యం, ఉద్దేశ్యం ఒక్కటే ఒక్కటి:
అది మనుషులను యెలాంటి షరతులు లేకుండా— నిర్నిమిత్తంగా— విముక్తులను
చేయడం ఆధ్యాత్మికత అంటే నా దృష్టిలో ఒక్కటే ఒక్కటి: శాశ్వతం అయిన
ఆత్మను కలుషితం చేయకుండా వుండటం; తార్కికతకు—ప్రేమకు సమరసత
కూర్చడం. జీవితము - ప్రాణము- అన్నీ అయిన నికార్సు, బేషరతు 'సత్యం'
యిదే. అందుచేత—నేను మనిషిని బంధ విముక్తిడిని చేయాలనుకుంటున్నాను.
అతడు స్వేచ్ఛగా తిరుగాడగలగాలి. ఆకాశంలో పక్షి ప్రయాణం చేస్తున్నట్లుగా
హాయిగా ఎలాంటి బరువులు బాధ్యతలు లేకుండా స్వేచ్ఛలో మునిగి తేలుతూ నద
యాడుతూ వుండాలి.

'నాకోసం పద్దెనిమిది సంవత్సరాలుగా పనిచేస్తున్నాం అంటున్నారు మీరు.

నా ఉపదేశం కోసం ఆతురతగా యెదురు చూస్తున్నామంటున్నారు. మీరందరూ విముక్తులు అవాలని నా ఆకాంక్ష. మీమీ సంక్లిష్టతలు, బాదరబందీలు వొదిలించుకోవాలి. ఇదీ జరుగవలసిన పని.దీని కోసం ఒక వ్యవస్థ అవసరం లేదు. ఆధ్యాత్మిక నమ్మకాల మీద-ఆధారపడి నిలబడాలని మాడే సంస్థ అసలే అవసరం లేదు ప్రపంచంలో అయిదుగురో, పదిమందో వున్నారు—అర్థం చేసుకోగలవాళ్ళు, దానికోసం పరిశ్రమించగలవాళ్ళు. వాళ్ళ కోసం ప్రత్యేకంగా ఒక సంస్థ ఎందుకు? క్షుల్లనమయిన విషయాలను పక్కకు పెట్టి హాయిగా నిలబడగలవాళ్ళు బహు తక్కువ మంది వాళ్ళ కోసం యీ పటాటోపం అంతా ఎందుకు?పోతే, బలహీనులు-అశక్తులు వున్నారు. వాళ్ళ మాట యేమిటి అంటారా? వాళ్ళ కోసం సత్యశోధనకుగాను ఒక సంస్థ అనవసరం. ఎందుకంటే సత్యం అనేది అందరిలోనూ వుంది. అది ఎంతో దూరంలో లేదు కూడా. అందరిలో అంతర్లీనంగా, వుంది. దగ్గర-దూరం అనే మాటకాదు; అది శాశ్వతంగా వుంది.

—ఇలా వ్యవస్థ ఎందుకు నిష్ప్రయోజనమో, పనికిమాలిన పనో స్పష్టపరుస్తారు.

మరో విషయం కూడా యిక్కడ గమనించద అవసరం. దివ్యజ్ఞాన సమాజం వేరు,తారక సంస్థ వేరు. కృష్ణమూర్తిని దగ్గరకు తీసి ఆలంబన యిచ్చి పెంచి పెద్ద చేసినది డాక్టర్ అనిబెసెంట్. ఆమె దివ్యజ్ఞాన సమాజానికి అధ్యక్షురాలు—ఆ సమయంలో. దివ్యజ్ఞాన సమాజ కార్యకలాపాలకు కృష్ణమూర్తి పాలన పోషణ- వ్యవహారాలకు ఏమీ సంబంధం లేదు. ఇలా సంబంధం వుండగూడదనే ఉద్దేశ్యంతోనే ఆమె 'తారకసంస్థ'ను వేరుగా ఏర్పాటు చేయించి, కృష్ణమూర్తిని దానికి 'హెడ్'గా వుంచి; తాను పోషకురాలు [Patron]గా వుండింది. దివ్యజ్ఞాన సమాజంలో సభ్యులందరూ తారకసంస్థలో సభ్యులు అవలేదు. అలాగే తారకసంస్థలో సభ్యత్వం కావాలంటే దివ్యజ్ఞానసమాజం ద్వారా రావాలని ఏమీ నియమం లేదు తారకసంస్థలో సభ్యులు చాలమంది దివ్యజ్ఞాన సమాజ సభ్యులు కాదు. రెండూ వేరు వేరు సంస్థలు. అధికారికంగాఅనధికారంగా యెలాంటి సంబంధమూలేదు కాకపోతే దివ్యజ్ఞాన సమాజ అధ్యక్షురాలు కృష్ణమూర్తికి 'పోషకురాలు' [Guardian]— అతని బాగోగుల కోసం ఆమె సమయాన్ని డబ్బును శక్తినీ వినియోగించింది .దీనికి అధ్యక్ష పీఠానికి ఏమీ సంబంధం లేదు మళ్లీ. తన స్వంత హోదాలోనే, స్వకీయ కార్యకలాపంగానే చేసింది. ఒకే వ్యక్తి మూలాధారం అవడం వల్ల అన్ని సంస్థలకూ 'తాదాత్మ్యం' వున్నట్లుగా కనిపిస్తుంది.అందులోనూ యిన్ని సంవత్సరాల అనంతరం చారిత్రికంగా చూచినా రెండూ ఒకచేనేమో అనిపిస్తుంది. సమకాలీన సంవత్సరాలలో యీ 'తదాత్మ్యం' మరీ ఎక్కువగా అనిపిస్తుంది. ఇది కేవలం 'అనిపించేదే'గాని యదార్థంగా

వున్నది కాదని గమనించడం కోసమే యీ వివరణ. అప్పుడు, యిప్పుడు కూడా దివ్యజ్ఞాన సమాజంలో కృష్ణమూర్తి ఉపదేశాలు, ఆలోచనలను పరిగణనలోనికి తీసుకోకుండానే విడిగా చూచే సభ్యులు అనేకమంది వున్నారు. ఆయన ఆలోచన ధార దివ్యజ్ఞాన తత్త్వదర్శనం నుంచీ ఉబికి వచ్చిందనే విషయాన్ని గమనించటానికి నిరాకరించేవారు వేల కొద్దీ వున్నారు. దివ్యజ్ఞానంలో సూచితంగా వున్న తాత్త్విక అంశాలకే విస్తరణ యిచ్చి నొక్కి చెపుతున్నారు కృష్ణమూర్తి అనుకునే వారు వేల కొద్దీ వున్నారు.

తారకసంస్థను రద్దు చేయడంతోబాటు కొన్ని మాసాల తరువాత ఆయన దివ్యజ్ఞాన సమాజ సభ్యత్వం నుంచీ వైదొలగారు. అయినా దివ్యజ్ఞాన సమాజ సభ్యులలో వారికి వున్న మిత్రులతో, సన్నిహితులతో స్నేహం మానుకోలేదు. 1934 వరకు దివ్యజ్ఞాన సమాజ ఆవరణలోనే వున్నారు కూడా! తిరిగి 1980లో ఆయన దివ్యజ్ఞాన సమాజ కేంద్రస్థాన ఆవరణలో పునఃప్రవేశం చేశారు. అయితే అక్కడి ఉపన్యాస కార్యకలాపాలతో సంబంధం పెట్టుకోలేదు.

మనిషి ఆధ్యాత్మికతవయిపు దృష్టి మళ్ళించటానికీ, విముక్తుడు కావటానికీ సంస్థలు, వ్యవస్థలు అనవసరం- అన్న ఆయన అభిప్రాయం చివరి వరకూ అలాగే నిలచి వుండింది.

ఆయన యింకా ఏమనుకుంటున్నారో చూడండి!

'సంస్థలు, వ్యవస్థలు మిమ్మల్ని విముక్తులను చేయలేవు, బయటి మనిషి ఎవరూ మిమ్మల్ని విడుదల చేయలేరు. సామూహిక పూజా పునస్కారాలు గాని, ఏదో మహత్తర కార్యం కోసం ప్రాణత్యాగం చేసుకోవడం గాని మిమ్మల్ని రక్షించలేవు. కొత్త కొత్త సంఘాలు పెట్టటం, నిర్విరామంగా ఏవో పనుల్లో మునిగి ఉండడం ఇలాంటి చర్యలేవీ మిమ్మల్ని విముక్తులను చేయలేవు. వేళాకోళం అనుకోకుండా వినండి. మీరు ఉత్తర ప్రత్యుత్తరాలు వ్రాయడం కోసం ఒక టైప్‌రైటర్‌ను వాడుతూ వుంటారు. అయితే ఆ యంత్రాన్ని ఓ పెద్ద అంతస్తులో పెట్టి అలంకారాలు చేసి పూజలు పునస్కారాలు చేయరు దానికి. వ్యవస్థలు ప్రధానం అయిపోయినప్పుడు మీ కార్యకలాపం అంతా ఇటువంటి పూజా విధానంగానే రూపొందుతుంది.

'న్యూస్‌పేపర్ రిపోర్టర్లు నన్ను కలుసుకున్నప్పుడు వాళ్ళు వేసే మొదటి ప్రశ్న ఏమిటో తెలుసునా!

మీ సంస్థలో యెంతమంది సభ్యులు వున్నారు?- అని. అందరూ అడిగే మొట్టమొదటి ప్రశ్న యిదే

'మీ కెంతమంది అనుయాయులు, శిష్యులు వున్నారు? ఆ సంఖ్య చెప్ప

అప్పుడు మీ పలుకుబడి యేమిటి, మీరు చెబుతూవున్న విషయాలు నిజమా - అబద్ధమా అని మేం తేల్చుకుంటాం-' అంటారు.

—నిజానికి ఈ సంస్థలో ఎంతమంది సభ్యులువున్నారో నాకు తెలియదు. అంతే కాదు, ఈ సంఖ్యలతో, వివరాలతో నాకేం నిమిత్తం లేదు. నేను యింతకు ముందే చెప్పినట్లుగా, ఒకే ఒక మనిషి విముక్తుడు అయినా నాకు అంతేచాలు!

'ఆనంద సామ్రాజ్యానికి (Kingdom of Happiness) తాళపు చెవి కొంతమంది ఆధీనంలోనే వున్నదని మీ ఉద్దేశ్యం. ఆ తాళపు చెవిని ఎవరూ దాచిపెట్టుకోవడం లేదు అలా చేసే అధికారం ఎవరికీ లేదు. ఆ తాళపు చెవి వేరే ఎక్కడో వుందనుకుంటున్నారా? ఊహు ఆ తాళపు చెవి మీరే! మిమ్మల్ని మీరు వికాసపరుచు కోవడం, పవిత్ర పరుచుకోవడం,నిష్కల్మషంగా తయారవడం మీదనే శాశ్వతమయిన ఆనంద సామ్రాజ్య భూమిక నిలిచివుంది.

దివ్యజ్ఞాన సమాజ స్థాపకురాలు ఆధ్యాత్మికతను గురించి, సాధకుడు చేయగల పనులను గురించి వివరిస్తూ ఒకచోట సరిగ్గా ఇటువంటి మాటే ఉంటారు. 'The Aspirant is the key'అనేది ఆమె మాట. సాధకుడే-ముముక్షువే తాళపు చెవి అని దీవి అర్థం. దివ్యజ్ఞాన సమాజ సాధన ప్రవచనాలకు, కృష్ణమూర్తి వచనాలకు వున్న దగ్గరి సంబంధాన్ని వివరించటానికి ఈ సాదృశం చాలు.

తరువాత మళ్ళీ - సంస్థను రద్దు చేయడం గురించి మాట్లాడుతూ కృష్ణమూర్తి ఏమంటున్నారో చూడండి!

'మీరు నిర్మాణం చేసిన ఈ కట్టడం అంతా, ఈ సంస్థల పెరుగుదల అంతా ఎంత నిష్ప్రయోజనమయిందో మీరే చూడండి. బాహ్య ప్రపంచం నుంచి సహాయం కావాలని అర్రులుచాస్తున్నారు మీరు. మీ ఊరడి, ఓదార్పు, సౌకర్యం, సుఖం, బలం, తేజస్సుల కోసం ఇతరుల మీద ఆధారపడుతూ వున్నారు. అయితే అవన్నీ మీలోనే వున్నాయి. మీలోనే మీరు వెదికి వీటిని పైకి తెచ్చుకోవాలి.

'దీనికోసం ఒక సంస్థ, వ్యవస్థ అంటూ అవసరమా?'

'నిజంగా అవగాహన చేసుకోవాలని ప్రయత్నించేవాళ్ళు. శాశ్వతము-ఆద్యంత రహితము అయిన దానిని అన్వేషించాలనుకునేవాళ్ళు మరింత ఉత్తేజంతో కలిసి ముందుకు నడుస్తారు. వాళ్ళు క్షుల్లకము, అసంబద్ధము. అవాస్తవికము, నీడల జాడలు అయిన ప్రతి విషయానికి ప్రమాదకరంగా నిలుస్తారు. వాటిని చీల్చిచెండాడుతారు. వాటి అస్థిత్వాన్ని సమూలంగా పెరికివేస్తారు. వాళ్ళు అవగాహనను పెంచుకున్నారు గనుక మరింత చురుకుగా తయారవుతారు, అగ్నిశిఖలలా ప్రకాశిస్తారు. మనం అటువంటి వాళ్ళను తయారుచేయటానికి ప్రయత్నించాలి. నా ఉద్దేశ్యం అదే! సరయిన అవగాహన వున్నప్పుడు, నిజమయిన స్నేహం వర్ధిల్లుతుంది. నిజమైన

స్నేహం అంటే ఏమిటో తెలియదులాగ వుంది. అది ఉన్నప్పుడు సరైన సహకారం ఏర్పడుతుంది. అందరిలోనూ పరస్పర సహకారం, సానుభూతి మొలకలు వేస్తాయి. ఇది- అధికార ముద్రవల్ల జరిగేపనికాదు. ఎవరో విముక్తులను చేయడం వల్ల జరిగేది కాదు. ఒక ఉద్యమం కోసం ప్రాణాలు అర్పించడం వల్ల ఒనగూడేది కాదు. మీ కందరికీ సరయిన అవగాహన ఏర్పడింది గనుక, శాశ్వత స్థాయిలో జీవించే స్థాయి లభ్యం అయింది గనుక—యిది సుసాధ్యం అవుతుంది సుఖాలకంటె త్యాగాలకంటె ఇది ఉన్నతము, ఉత్తమము అయిన విషయం.

'నేను సంస్థను రద్దు చేయాలని తీసుకున్న నిర్ణయానికి కారణాలు-కొన్ని-యివి. నిర్ణయం జరిగిపోయింది రెండు సంవత్సరాలు నిదానంగా తాపీగా కూలంక షంగా ఆలోచించి ఈ నిర్ణయానికి వచ్చాను. ఇదేదో క్షణికావేశంలో తీసుకున్న నిర్ణ యం కాదు. దీని వెనక ఎవరి ఒత్తిడి, బలవంతము లేదు, ఇలాంటి విషయాలలో ఇతరుల ప్రోద్బలానికి లొంగిపోయే మనిషిని కాదు నేను. ఇందాక చెప్పినట్లుగా— రెండు సంవత్సరాలపాటు నిదానంగా జాగ్రత్తగా తాపీగా ఆలోచించి మరీ ఈ నిర్ణ యం తీసుకున్నాను.

'తారక సంస్థను రద్దు చేయాలని నిర్ణయించాను. నేనే దానికి (Head) నాయకుడిని గనుక ఈ నిర్ణయం నాదే; నేనే ప్రకటిస్తున్నాను. మీరు కావాలనుకుంటే ఇతర సంస్థలు వ్యవస్థలు నిర్మాణం చేసుకోండి. ఎవరేనా ఏమయినా చేయవచ్చు· కాని వాటితో నాకేమీ సంబంధం లేదు, వుండదు. కొత్త పంజరాలు తయారు చేయడం, ఆ పంజరాలకు కొత్త కొత్త అలంకారాలు చేయడంతో నాకేం నిమిత్తం లేదు. నాకున్న ఒకే ఒక నిమిత్తం యేమిటంటే :

మనిషిని సంపూర్ణంగా, నిర్నిబంధంగా విముక్తుడిని చేయాలి.

(**To Set Man Absolutely, Unconditionally Free**)

ఇదీ కృష్ణమూర్తి అప్పుడు చేసిన ప్రకటన. చివరి వరకు యీ ప్రకటన పాఠంలోని సూత్రాలకే నిలచి వున్నారు. ఏ రకమయిన రాజీలు, యే పరిస్థితి లోనూ—సందర్భంలోనూ చేయలేదు. ఇలాంటి ప్రకటన చేసినందుకు పరితపించలేదు.

ప్రారంభం నుంచి పరిసమాప్తి వరకు ఒకే వేగం, వాడితో స్రవించిన మహా నది కృష్ణమూర్తి. ఆయన ఆలోచనా స్రవంతిని అందుకోవటానికి 1929లో చేసిన యీ ప్రకటన ఒక ప్రవేశద్వారం. ఈ ప్రకటనకు ముందుగా ఆయన 1910 నుంచి గడిపిన జీవితం, అనుసరించిన ప్రక్రియలు, అందుకున్న ఆదేశాలు, సామూహికంగా చేసిన ఆలోచనలు ఎంత వివరంగా తెలుసుకుంటే అంత సులభంగా కృష్ణమూర్తి తత్త్వ దర్శనం మనసుకు ఆకళింపు అవుతుంది.

—0—

# బోధనల తోరణం

జె. కృష్ణమూర్తి (1895–1986) దాదాపు డెబ్బయి సంవత్సరాలు ఉప న్యాసాలు యిస్తూ గడిపారు. ఉపన్యాసాలు అన్నీ పుస్తక రూపంలో వచ్చాయి. అవి కాక, వారు రచించిన పుస్తకాలు కూడా వున్నాయి, వేరుగా విరివిగా.

వారిని గురించి ఎవరెవరో ప్రచురించిన పుస్తకాలు అనేకం వున్నాయి.

'నేను బోధకుడిని కాను, గురువును కాను' అని ఆయన పదే పదే చెప్పడం కనిపిస్తుంది ఈ ఉపన్యాసాలలోను, పుస్తకాలలోను.

'కృష్ణమూర్తి బోధన సారాంశం యేమిటంటే....నేను యిన్నాళ్ళు ఎఱుక పరుస్తున్న విషయాలు యేమిటంటే....' అని వారి స్వదస్తూరిలోనే కొన్ని పేజీల పాటు సాగిన వివరణలు ఉన్నాయి.

ఇంతకూ 'కృష్ణమూర్తి బోధనలు' అంటూ వున్నట్లా లేనట్లా అనేది చాలా మందికి ఎప్పటికప్పుడు మనసులో వేధించే ప్రశ్న.

ఆయన జీవిత కాలంలోనే కొందరు ఈ ప్రశ్నను ఆయన ముందుకు తీసుకు వచ్చారు

సంక్లిష్టంగానో, సుదీర్ఘంగానో ఆయన....సందర్భాన్ని పురస్కరించు కుని....సమాధానం చెప్పారు. అలా చెప్పినట్లు కనిపించినా, ప్రశ్న మటుకు కరిగి పోకుండా ఎప్పటికప్పుడు మనసు ముందు సాక్షాత్కరిస్తూనే వున్నది.

'మిమ్మల్ని మీరు చూచుకోండి.
అంతర్ముఖులై పరిశీలించుకోండి.
మీలో యేమేమి ఉన్నదో జాగ్రత్తగా గమనించండి.
దాని నంతనూ అర్థం చేసుకోండి.
దానిని అతిగమించి ముందుకు పోయేందుకు
ప్రయత్నం చేయండి—'

— ఈ రకంగా వుంటుంది ఆయన తన బోధనలకు 'సారాంశం' చెప్పిన తీరు.

అంటే యేమన్న మాట?
ఆయన బోధనలను మనం పరిశీలించడం కాదు అసలు విషయం.
అర్థం చేసుకోవడం కాదు అసలు సంగతి.
మనను మనమే పరిశీలించుకుంటున్నాము.

ఆయనను అద్దంగా ఉపయోగించుకుంటున్నాము.

అర్థం చేసుకునేందుకు ప్రయత్నిస్తున్నాము.

ఈ బోధనలు—మనను మనం చూచుకునేందుకు అనువయిన సాధనాలు, చూపుడు వేళ్ళు. అంతే.

ఆయన మాటలను అర్థం చేసుకొన్నట్లయితే మన పరిశీలనాంశాలు మరింత విపులంగా వివరంగా తోచవచ్చు.

ఇంతకూ పని చేయవలసినది మనమే, ఆ బోధనలు కాదు. అర్థం చేసుకున్న పరిధిలో మనను మనం పరిశీలించుకోవాలి. ఇందుకు మన మనస్సును ఆయత్తం చేసుకోవలసినదీ మనమే.

'ఉపన్యాసకుడు చెబుతున్నదానిని అర్థం చేసుకునేందుకు చూడకండి. అతడు చెబుతూ వున్నది ఒక అద్దంలాగ పనిచేస్తుంది. ఆ అద్దంలో మిమ్మల్ని మీరు చూచుకుంటున్నారు. ఈ చూచుకోవడంలో తగినంత జాగరూకత స్పష్టత వచ్చినప్పుడు, 'అద్దం' ముఖ్యమైన వస్తువు కానేకాదు. దాన్ని అవతల పారవేయవచ్చును. అందుకేమీ ఆక్షేపణ లేదు,' అంటారు ఆయన.

కృష్ణమూర్తి పోయిన తరువాత....

'ఆయన బోధనలన్నీ ఏమయిపోతాయి?' అనేది ఒక ప్రశ్నగా వారి జీవిత కాలంలోనే కొందరిని ఆలోచింపజేసింది.

'ఈ బోధనలను నిలుపుకోవడం ఎట్లా?' అన్న ప్రశ్నకు ఆయన ఒక మారు 'వాటిని జీవితంలోనికి అనువదించుకోవడం ద్వారానే' (**Live Them**) అని సమాధానం చెప్పారు.

బోధన అంటే కేవలం మాటలే అయేట్లయితే వీటికి అదే గతి పడుతుంది.

ప్రపంచంలో నాలుగుమూలలా — అయిదు ఖండాలలోను — ఎందరో మహాత్ములు అవతరించారు. ఎన్నో అపూర్వ విషయాలు చెప్పారు. ప్రజాప్రవాహాన్ని మార్చటానికి ప్రయత్నించారు. నాగరికతలు ఉద్భవింపచేశారు. జీవితం ఎన్నో ప్రక్రియలను ప్రయోగాలను చూచింది. ప్రవాహం నిరంతరంగా పరుగులు తీస్తూనే వుంది.

ఆ వెల్లువలలో ఒకటే అయినా, కృష్ణమూర్తి సమకాలిక చరిత్రలో భాగం. గతాన్ని చెప్పకుండా పెనవేసుకుని భవిష్యత్‌లోనికి దుముకే వర్తమాన వీచిక.

కాల విభజనతో సరిపోల్చిచూచి ఆశపడటానికి, నిరాశ పొందటానికి అవకాశం లేదు.

కేవలం మాటల మూటలు కాకుండా, 'బోధన' అంటే ఏదో లోతు,

ప్రగాఢత, అంతరికత వున్న సమాచారం అయితే అది భంగపడదు, విరూపం చెందదు.

బోధనలు నిలుస్తాయా–నిలువవా అని ప్రశ్న వేసుకుని సమాధానం కోసం వెదకడం కంటె, వీటి పర్యవసానంగా మనం మనలోని ప్రగాఢమైన లోతులకు అంతరంగ సీమలకు వెళ్లగలుగుతున్నామా లేదా అనేది అతి ముఖ్యమైన విషయం.

బోధనల తెలివిడిలో అనుసరణీయమైన జీవన విధానాన్ని మనం అందుకున్నామా లేదా అనేది ప్రముఖమైన ప్రస్తుతాంశం.

కృష్ణమూర్తి అనేక ప్రశ్నలకు సమాధానాలు యిచ్చారు, తమ ప్రసంగాల అనంతరం, విడి సమావేశాలలోనూ.

ఆయన సమాధాన సరళి అదో విచిత్రమైన తీరులో వుంటుంది. పృచ్ఛకుడు అనుకున్న సమాధానం రాదు. కనీసం ఊహించిన అంశాల ప్రస్తావన అయినా వుండదు. జీవితానికి సంబంధించిన అనేక మౌలిక అంశాలను ఆయన ప్రస్తావిస్తారు. కాని పృచ్ఛకుడు ఊహించేది ఒకటి, ఎదురయేది మరొకటి. సమాధానాన్ని ఊహించడం తప్పు అయిన మాట నిజమే కాని సమాధానం ప్రశ్నకు దగ్గరగా రావాలి గదా.

'భగవంతుడు ఉన్నాడంటారా?' అన్న ప్రశ్న వేసినప్పుడు ఆయన వద్ద నుంచి 'ఉన్నాడు' లేక 'లేడు' అన్న సమాధానం వస్తుందని అడిగిన మనిషి ఊహిస్తాడు. ఈ రెండూ కాకపోతే 'ఉన్నాడో లేడో తెలియదు' అనయినా చెబుతారని భావిస్తాడు.

కాని కృష్ణమూర్తి ఈ ప్రశ్నను స్పర్శించే పద్ధతి వేరుగా వుంటుంది. ఎవరూ ఊహించని కొత్త కోణాలు బయలుపడతాయి.

భగవంతుడు అంటే నీ ఉద్దేశ్యమేమిటి?

ఉన్నాడో లేడో తెలుసుకోవాలని నీవు ఎందుకు అనుకుంటున్నావు?

సమాధానం తెలుసుకున్నందువల్ల నీకు ఒరిగేది యేమిటి?

ఇటువంటి ప్రశ్నవేస్తున్న మనిషి యొక్క మానసిక అవస్థ ఏమిటి?

—ఇలాంటి పూర్వాపరాలన్నీ చర్చించి,

భగవంతుడిని నమ్ముకున్నవాళ్ళు ఎటువంటి అఘాయిత్యమైన కార్యాలు చేశారో వివరంగా చెబుతారు.

ఒక దశతో సామాన్య మానవుడికి 'ఈ ప్రశ్న ఎందుకు అడిగాంరా, బాబూ,' అనిపించినా ఆశ్చర్యం లేదు.

పరాధీనత అనేది లేకుండా ఎవరికివారు స్వతంత్రంగా, స్వప్రజ్ఞతో ఆలోచించుకోవడం నేర్చుకోవాలి—అన్న సూత్రానికి చేరువ అయిన సమాధానం దొరుకు

తుంది. అంతేకాని—అవును, కాదు అని ఒక్క ముక్కలో జవాబు రాదు.

మతం అంటే యేమిటి?

మతపరమైన మనస్సు, మతైకమైన మనస్సు ఎలా వుంటాయి? వాటిని సమకూర్చుకోవడం ఎలా?

కొత్తరకమైన మానవాళి ఎలా తయారవుతుంది?

మనిషికి నిజంగా వుండవలసిన మనస్సు లక్షణం యేమిటి?

దుఃఖము, దురాశ ఎందుకు జనావళిని పట్టి పల్లారుస్తున్నాయి? వాటిని వదిలించుకోవటానికి యుగయుగాలుగా జరుగుతున్న ప్రయత్నం ఎలాంటిది?

—ఇలాంటి అభేద్యమయిన ప్రశ్నలకు జవాబులు సంపాదించుకునేందుకు అనువయిన మనస్సు ఏర్పడుతుంది, కృష్ణమూర్తిని జాగ్రత్తగా పరిశీలించి చదువ గలిగితే.

బోధనలు వున్నాయి సరే. ఈ బోధనలు ఒక బోధకుడి నుండి వస్తాయి సహజంగా.

బోధకుడికి బోధనలకు సంబంధం ఏమిటి?

—ఈ ప్రశ్ననుగూడా కృష్ణమూర్తి ప్రస్తావిస్తారు.

బోధకుడిలో మనం అనుకున్న లక్షణాలన్నీ- మనకు ఆదర్శవంతం అని పించిన గుణాలన్నీ వుండాలను కోవడం కూడా మన పరిమిత పరిణతినే సూచిస్తుంది సుమా-అని మెత్తగా మందలిస్తారు ఒకసారి.

బోధనలు వాటి విలువలమీద అవి ఆధారపడి నిలుస్తాయి.

ఒక మనిషి చర్యలు సమగ్రంగా వున్నాయా, అసమగ్రంగా వున్నాయా అని ఎవరూ పరీక్షించి చూడటానికి- శోధించి కనుగొనటానికి ప్రయత్నించగూడదు, అంటారు ఆయన.

మతైక జీవనం గడపాలంటే ఏంచేయాలి, పరమహంస పదవిని పొందా లంటే ఏం చేయాలి, -ఇలాంటి అంశాలపైన సంప్రదాయిక సమాచారంలో మనసు కూరుకుపోయినందువల్లనే బోధకుని ప్రవర్తన గురించి అంచనాలు వేయడానికి ప్రయత్నిస్తాడు మనిషి-అంటారు ఆయన.

లక్షలమందిలో కోట్లమందిలో ఒక్కడే తరించ గలుగుతాడు, ఉత్తీర్ణుడవు తాడు-అనుకోవడం.

పూర్వజన్మ సంస్కారాలు తోడయిరావాలి, ఈ జన్మలో అనేక సాధకాలు చేయాలి-అనుకోవడం.

యోగధ్యానాలు ఆచరించాలి, వివాహబంధం వుండగూడదు, పక్కా బ్రహ్మ చర్యమే తప్పనిసరి- అనుకోవడం సంప్రదాయిక అలవాటు ధోరణి. ఈ పరిస్థితులు

లేకపోతే 'ఆధ్యాత్మ జీవనానికి' ఆస్కారం లేదనుకోవడం అలవాటు అయి పోయింది.

మనిషి యిదంతా యుగాల తరబడి చేస్తూనే వున్నాడు, అయినా ఏమీకా లేదు. ఎక్కడ వేసిన గొంగళి అక్కడే వుంది- అంటారు ఆయన. శరీరాలను హింస పెట్టుకున్నారు, మనసును చంపుకున్నారు. అయినా అనుకున్నది ఆలవాలం కాలేదు.

కృష్ణమూర్తి ప్రయత్నం ధార్మికతను గురించి, నైతిక జీవనాన్ని గురించి అభిప్రాయాలు గుమ్మరిస్తూ మాట్లాడడం కాదు.

సామాన్య మానవుడిని గురించి ఆయన ఆలోచిస్తారు.

ఆటువంటివాడు ఏంచేస్తాడు? రోజుగడపడం కోసం శ్రమిస్తాడు. దైనందిన జీవితంలో తాను ఏంచేయాలో తెలుసుకోవడం అతనికి ముఖ్యంగాని-మతస్వాములు ఎలా వున్నారు, కృష్ణమూర్తి ఎలా జీవిస్తున్నాడు అన్నవి సాధించి తెలుసుకోవడం అవసరం కాదు.

తాము ఎదుర్కొంటున్న పరిస్థితి నుంచి తప్పించుకు పోవడం కోసం ప్రతి దానికీ సంక్లిష్టం, సంకీర్ణం చేయడం మనిషికి అలవాటు అయిపోయింది.

'మనలాంటివాడు- సామాన్యుడు- ఏం ఆలోచిస్తాడో చూడండి: బుద్ధుడో మరెవరో జీవిత కాలం ఏంచేశాడు అనేది నాకు ముఖ్యం కాదు. అతని యవ్వనం ఎలా గడిచింది, లైంగిక వ్యాపారంలో పాల్గొన్నాడా లేదా- మందులు మాకులు వాడాడా.... ఇదంతా నాకేమీ అవసరం లేదు. ఈ విషయాలు తెలుసుకోవలసిన అగత్యం నాకేం లేదు. నాకు నిజంగా అభిరుచి దాయకం అయింది ఏమిటంటే- బుద్ధుడో మరో మహాపురుషుడో ఏం చెబుతున్నాడు? ఏమిటి అతని బోధన? అది చెప్పండి చాలు. ఆ బోధన నేను అర్థం చేసుకునేందుకు సహాయపడగలిగితే నాకు సాయం చేయండి. అప్పుడు నా జీవితం మరో మంచి మార్గాన్ని నడుస్తుంది.... అంటాడు.'

బోధనల గురించే మనం పట్టించుకోవాలి.

అవి చెప్పిన మనిషిని గురించి మరచిపోగలగాలి.

బోధకుని జీవితం సమగ్రం అయినదో కాదో మనకు తెలియదు. తెలుసు కునే పడికట్టు రాళ్ళు మన దగ్గర లేవు. ఆ సమగ్ర జీవితం గురించి తెలుసుకుని అప్పుడు 'బోధనలపై మక్కువ వుంచుతాను' అనుకోవడం తప్పు అంటారు ఆయన.

'మీరు నిజమా? మీరు నిజాయితీగా వున్నారా?- ఇదంతా నాకేం పనిలేదు. నా జీవితం నాది. నా జీవితాన్ని గురించే నాకు తపన. కాని, మరొకరి జీవితాన్ని

గురించి శోధన అవసరం లేదు-' అంటాడు మామూలుగా ప్రతి మనిషి అంటారు ఆయన.

వ్యక్తిత్వాన్ని వంటరిగా వదిలేసి బోధనల గురించే ఆకాంక్షగా పట్టించుకుని జాగ్రత్తపడాలని ఆయన సూచన.

'మరో ఆదర్శవ్యక్తి, మాదిరి మనిషి కావాలనుకోవడం ఎందుకు? ఉదాహరణలకోసం, మాదిరుల కోసం వెనుకకు- అంటోంది బోధన'

బోధన, బోధకుడి జీవితం ఒకే తానులోగుడ్డ మాదిరి వుండాలని కూడా కృష్ణమూర్తి అనరు. 'గుడ్డసంగతి నీకు ఎందుకు? నీ పరిమితి, నిబద్ధతలను గమనించుకో' అంటారు.

'మిమ్మల్ని ఆదర్శంగా తీసుకుంటాం' మేమేం చేయాలో మీరే మాకు చెప్పండి- అని శ్రోతలు అడిగినప్పుడు కృష్ణమూర్తి యేం అంటున్నారో చూడండి:

'నా వంక చూస్తున్నారా? మీరు ఏంచేయాలో ఏం చేయగూడదో నేను చెప్పాలా? వివాహం చేసుకోమనీ-చేసుకోవద్దనీ నేను చెప్పాలని ఆశిస్తున్నారా? నిజంగా మతైక వ్యక్తి లైంగిక జీవనంలో కాలం గడపవచ్చునా లేదా అనేది నేను చెప్పాలా మీకు? నేను చెబుతాననుకోండి, నా అంత అవివేకి వుండదు. నా మాటలు మీరు విన్నట్లయితే మీరూ అవివేకులు అవుతారు. మీమటుకు మీకు ఏమీ భావనలు, రాగ పీచికలు లేవా?

'విరాగం- అరిటే జీవితంలోని సుందరతకు కళ్ళు మూసుకు కూర్చోవడం కాదు. ఒక చెట్టువంక చూచారా ఎప్పుడయినా? అలాగే ఒక వికసించిన పువ్వువంక, అందమైన స్త్రీనో పురుషుడినో చూచారా? ఈ సౌందర్యంతో కొంతసేపు కాలం గడపాలనుకున్నారా? సౌందర్యాన్ని చూస్తూవుండిపోయారా? పర్వతాలు....చెట్లు.... పువ్వులు....ముఖాలు....నవ్వులు....ఊహు. మీరు ఈ పని ఏమీ చేయలేదు. అందు చేతనే మీకు సౌందర్యం అంటే ఏమిటో, ప్రేమ అంటే ఏమిటో తెలియదు. మీకు తెలిసిందల్లా- ఇలా చేయగూడదు, ఇలాగే చేయాలి అనే సూత్రాలు మటుకే. మనస్సును హృదయాన్ని ఎండగట్టుకున్నారు, మీలో ఆర్ద్రత అనేది ఏ కోశానా లేదు.... ముందుగా.... దేనినీ నిరసించకుండా వుండడం నేర్చుకోండి. అప్పుడు ప్రేమ అంటే ఏమో తెలుస్తుంది' అంటారు ఆయన.

ప్రతి సుకుమారమైన విషయాన్ని ఒక సమస్యగా మార్చి బాధపడుతూ వుంటాం మనం, అంటారు.

'ప్రేమ విలసిల్లటానికి స్వేచ్ఛ, స్వాతంత్ర్యం అవసరం. తిరుగుబాటు చేయటానికి కావలసిన స్వేచ్ఛకాదు. ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించటానికి వీలు యిచ్చే

స్వాతంత్ర్యం కాదు. రహస్యంగాను, బాహాటంగాను లోలత్వంలో పడిపోవడం కాదు. స్వరూప స్వభావాలను అన్నిటినీ ఏకంగా అర్థం చేసుకున్న స్వేచ్ఛ. అటువంటి స్వేచ్ఛనే 'ప్రేమ' అనవచ్చు;

అధ్యాత్మికత సాధించటానికి (ఇక్కడ సాధించేది అంటూ ఏమీ లేదు. ఆ సున్నిత సుకుమార లాలిత్య సీమను స్పర్శించడమే) ఒక పద్ధతి, ప్రక్రియ అంటూ ఏమీ లేవు. ఎవరో తయారుచేసిన రహదారులు లేవు, మనస్సు నిర్మాణం చేసిన అన్ని రూపాలను, పద్ధతులను, పరిణామాలను త్రోసిపుచ్చగలగడమే మొదట చేయవలసిన పని. మనస్సు నిర్మించే ఆవరణలు, విక్షేపాలు (ఉన్నదానిని లేనట్లుగా చూపించడం, లేని దానిని ఉన్నట్లుగా చూపించడం) దాటగలగాలి. అప్పుడే నిజాయితీగా ఉన్నదానిని ఉన్నట్లుగా చూడడం సాధ్యమవుతుంది.

నిజమైన బోధకులు ఈ స్థితిని పొందారు. దానిని మాటలలో ముసుగులలో పెట్టలేదు. వాళ్లు అలాంటి స్థితి, సీమ వున్నదంటున్నారు. నేనూ చెబుతున్నాను — అవునని. అలాంటి వాతావరణం వున్నది. మనం చూడగలిగితే, ఎంతో సుందరతతో ఓలలాడుతూ విలసిల్లుతూ వున్న భూమి కనిపిస్తుంది. అది మీకేం యివ్వదు. ఇవ్వడం కోసం లేదు. ఊరికే దానివంక చూడండి మీరు చూడడం కోసరమే దర్శించడం కొరకే—అది వుంది. వినడానికి చెవులు వుంటే వినండి. కళ్లు వుంటే చూడండి—అది ఉంది. అక్కడే వుంది—ఇదీ కృష్ణమూర్తి వచోధోరణి.

ఎటువంటి తికమకలు లేకుండా దీనిని అర్థం చేసుకునేందుకు ప్రయత్నించాలి. అర్థం చేసుకున్నకొద్దీ ఈ బోధనల 'లాలిత్యం' అవగతం అవుతుంది ఈ బోధన తప్ప జీవితంలో మరో 'ప్రేరణ' లేదని నిర్ధారణ అవుతుంది.

*  *  *

తన బోధనం సారాంశం (Core of Teaching) అంటూ కృష్ణమూర్తి అక్టోబర్ 21, 1980న ఒక ప్రకటన తయారుచేశారు ఇది బహుక్లుప్తంగా, సూటిగా, సిద్ధాంత పరంగా, వివరంగా వుంటుంది.

ఈ సారాంశాన్ని ఏడు విభాగాలుగా పరిశీలించడం సాధ్యం.

'సత్యం అనేది ఒక దుర్గమ క్షేత్రం', అంటూ ప్రారంభించి వివరణలు యిస్తారు.

ఇక్కడ సత్యం అనేది ఒక వస్తువు, ఒక పదార్థం—కాదు, అది ఒక క్షేత్రం (Land), దానికి రహదారులు లేవు (Pathless) అనేవి ముఖ్యాంశాలు. ఇతరులు వేసిన రహదారులు నీకు పనికిరావు. ఎవరికివారు తమ స్వంత దారి ఏర్పరచుకోవాలి.

1. మనిషి ఈ క్షేత్రానికి ఒక సంస్థ ద్వారా—వ్యవస్థ ద్వారా—సిద్ధాంతం

ద్వారా—పురోహితులు, క్రతువుల ద్వారా—యేదో తాత్త్విక చింతనల ద్వారా లేక మానసిక వర్తనలు, వైఖరుల ద్వారా చేరుకోవడం అసాధ్యం. తన సంబంధ బాంధవ్యాల దర్పణం ద్వారా, మనస్సు అంతర్ వర్తనల అవగాహన ద్వారా, విశ్లేషణం కాకుండా పరిశీలన ద్వారా ఈ క్షేత్రాన్ని అందుకోవటానికి వీలుంది.

ఇక్కడ గమనించవలసిన విషయం యేమిటంటే, మనస్సును ముక్కలు ముక్కలు చేసి విశ్లేషించుకోవడం కంటె సమగ్రంగా—ఒకటిగా పరిశీలించగలగడమే మార్గం అనేది.

2. మనిషి తనలో ఎన్నో సంకేతాలు, రూపాలు తయారు చేసుకున్నాడు. భద్రత కోసమని, మతపరంగా—రాజకీయ పరంగా—వ్యక్తి పరంగా ఎన్నో రూపాలు సిద్ధం చేసుకున్నాడు. రూపాలు—అభిప్రాయాలు—విశ్వాసాలు తయారుచేసుకున్నాడు. వీటి బరువు అతని మానసిక వాతావరణాన్ని కుంగదీస్తోంది. అతని సంబంధ బాంధవ్యాలను దైనందిన జీవనాన్ని భారం చేస్తోంది. ఇదే మన సమస్యలన్నిటికీ మూల కారణం. మనిషి మనిషినీ వేరుచేసేవి యివే. మనస్సులో యేర్పరచుకున్న ఆలోచనల వల్ల అతని జీవన దర్శనం ప్రభావితం అవుతోంది.

ఇక్కడ ముఖ్యగమనిక యేమంటే—మనస్సు తన అభిప్రాయాలు ఆలోచనల బరువులతో మనిషిని కుంగదీస్తోంది, అవిభాజ్యమయిన మనిషిని విభజించి పారేస్తోంది.

3. మనిషి చిత్తం (Consciousness)లో వున్న సరంజామా అంతా కలిసి మనిషిని రూపొందిస్తూంది, అతనికి అస్తిత్వాన్ని యిస్తోంది. ఈ సరంజామా అందరికీ సామాన్య వస్తువే. మానవాళి అంతటికీ యీ సరంజామా సర్వసామాన్యం. పేరు, రూపం, సంప్రదాయం—వాతావరణ పర్యావరణాల వల్ల యేర్పడిన బాహ్యంగా యేర్పడిన సంస్కారం....యిదంతా కలిపి మనిషి వ్యక్తిత్వం (Individuality)గా భాసిస్తోంది. ఈ ప్రత్యేకత కేవలం బాహ్యమైనది కాదు, చేతనంలోని సరంజామా అంతటితోనూ ప్రభావితుడు కాకుండా విముక్తుడుగా వుండడంలోనే ప్రత్యేకత (Uniqueness) వుంది. సరంజామా సర్వసామాన్యమయిన వస్తువు అయినందువల్ల ప్రతి మనిషీ యీ సరంజామాలో కలిసిపోయి ప్రత్యేకత లోపించినవాడు అవుతున్నాడు.

ఇక్కడ గమనార్హం అయిన అంశం : మానవాళి అందరికీ సామాన్య వస్తువు అయిన చేతనం నుంచి, ఎవరికివారు తమ స్వేచ్ఛను—విముక్తతను పొంది ప్రత్యేకత నిలుపుకోవడం. మనిషి తన మానసిక వర్తనాన్ని రూపొందించుకోవడంలో కృష్ణమూర్తి ప్రత్యేక సూచన యిక్కడ ప్రస్ఫుటం అవుతుంది.

4. స్వేచ్ఛ—విముక్తత (Freedom) అనేది ఒక ప్రతిచర్య (Reaction) కాదు. ఇది అతని వర్తన రీతి. విముక్తుడుగా వుండటానికి అతనికి ఆలంబన (Choice) వుంది. ఈ ఆలంబన వల్లనే అతడు విముక్తుడు అవుతున్నాడు. ఏ దృక్కోణము లేకుండా జీవిత పరిశీలన చేసుకోవడమే స్వేచ్ఛ. పారితోషికం, ప్రతిఫలం, పరిశిక్షల పట్ల దృక్కోణాం భయావహంగా తయారు కాకూడదు. స్వేచ్ఛ అనేది నిరుద్దేశపూర్వకమైనది. ఇది మానవుని పరిణామంలో అంతిమ స్థాయి కాదు. అతని అస్తిత్వానికి మొదటి మెట్టు మటుకే. జీవిత పరిశీలన చేసుకున్నకొద్దీ తనకు ఎంత స్వేచ్ఛ లేదో మనిషికి తెలిసివస్తుంది. మన దైనందిన కార్యకలాపాలలో యే మాత్రం అరమరికలు లేని స్వేచ్ఛ వుండడం అవసరం. ఇదే ముఖ్యమైనది.

జీవన వర్తనంలో అతిముఖ్యమైన అంశం యిక్కడ ప్రస్తాపితం అయింది· 'అరమరికలు లేని ఎఱుక'తో [Choiceless Awareness] నిండిన స్వేచ్ఛ.... కృష్ణమూర్తి ఆదేశ సూత్రాలలో అతిప్రధానమైనది.

5. ఆలోచన, భావన కూడా సమయం [Time]లో అంతర్గతమే. సమయం నుంచి గతం నుంచి ఉద్భవించేదే అనుభవము,జ్ఞానమును. భావన కూడా యీ అనుభవ జ్ఞానం నుంచే ఉత్పన్నం అవుతుంది. అందుకనే—సమయం అనేది మనిషికి మానసిక విరోధిగా తయారవుతుంది. మన పనులన్నీ అనుభవం నుంచి - సమయం నుంచి పుడుతున్నాయి. అందువల్లనే మనిషి ఎప్పటికప్పుడు గతానికి బానిసగా తయారవుతున్నాడు. భావన పరిమితమైనది, సంక్షిప్తం అయినది. కనుకనే మనం ప్రతి మారూ సంఘర్షణకు వైరుధ్యాలకు లోనయి పోతున్నాము. మానసిక పరిణతి అనేది ఏర్పడకుండా పోతోంది.

మనస్సును, ఆలోచనలను మన పనులమీద ప్రభావం చూపకుండా జాగ్రత్త పడగల అవకాశం యిక్కడ ప్రస్తావన అయింది ఎప్పటికప్పుడు 'విముక్తుడు'గా పని చేయగలగడం సహజప్రవృత్తిగా తయారయిపోవాలి. ఈ స్థితిని అర్థం చేసుకుని ఆచరణలోనికి తీసుకురాగల 'భూమిక'ను యిక్కడ కృష్ణమూర్తి సమాయత్తం చేస్తున్నారు.

6. మనిషి తన ఆలోచనలు—భావనలు కదలాడుతూవుండే ధోరణిని గమనించినందువల్ల, పరిశీలనాత్మకంగా చూచుకున్నందువల్ల—భావకునికి [Thinker], భావనకు [Thought] మధ్యవున్న అంతరాన్ని గుర్తించగలుగుతాడు. పరిశీలకుడు—పరిశీలన వస్తువుల వ్యత్యాసాన్ని, అనుభవాన్ని— అనుభవించేవాడి స్థితిని వేరు వేరుగా గమనించగలుగుతాడు. వేరువేరుగా గమనించడం వల్ల, యీ విభాగమే 'కృతమైనది' అనే స్పృహ కూడా కలుగుతుంది. అప్పుడు కేవలం 'పరిశీలన'మటుకే మిగులుతుంది. అదే అంతఃస్ఫూర్తి. దానిమీద గతం యొక్క, సమయం యొక్క

నీడలు ప్రభావాలు పడవు. సమయానికి-కాలానికి అంటిపట్టుకొని యీ అంతఃస్ఫూర్తి వల్ల మనసుకు అవసరం అయిన ప్రగాఢమైన ముందడుగు [Mntation] కుదురుతుంది:

పై భూమిక విస్తరింపచేసి మనిషికి అవిభజన స్థితి [Indivisible Stage] సంప్రాప్తం చేయడం, తద్వారా అంతఃస్ఫూర్తి విస్తరింపచేయడం యిక్కడ ఆదరణ సూత్రం.

7. పరిపూర్ణంగా కదనడమే [Total Negation], ఉన్నదని [Positive] సారాంశం భావన మానసికంగా తీసుకువచ్చిన అన్ని రూపాలు - ప్రతిరూపాలను త్రోసి రాజు అనడంవల్ల,మానసికవాతావరణాన్ని నిష్కల్మషం చేయడం అవుతుంది. అప్పుడే 'ప్రేమ' అంకురిస్తుంది. అదే కారుణ్యం, అదే వివేకం [Compassion; Intelligence].

ఈ ఏడు అంశాలనూ నిష్కర్షగా అలోచించుకుని, ఆదరణ స్థాయి ఇందులో సంపూర్ణంగా మునిగి పోయేట్లు చేసుకోవడం వల్లనే చివరిమెట్టు సాధ్యం అవుతుంది.

చివరిమెట్టు 'ప్రేమ' [Love].

మనస్సును పూర్తిగా 'ప్రేమ'తో నింపుకో. ఆ తరువాత ఏమయినా చేయి—అంటారు మరోచోట కృష్ణమూర్తి.

మనసు, హృదయము ప్రేమతో నిండిన తర్వాత మనిషి ఏమీ 'కానికార్యం' చేయలేడు. చెడు చేయడం చేతకాకుండా పోతుంది. మంచి చేయడం తప్ప ఇంకేమీ అందుబాటుకు రాదు. ఆ 'మంచితనం' [Goodness] అనే దానిని ఎలా పుష్పించి పల్లవింప చేసుకోవచ్చునో కృష్ణమూర్తి తన బోధనలలో అనేకమార్లు అనేకచోట్ల సవివరంగా చెబుతారు. ఈ 'సారాంశం'లో ఆ మాటను ఉపయోగించకపోయినా 'ప్రేమ' అనే [Abstract Virtue] ను మాత్రమే ప్రస్తావించి దీనివల్లనే మనిషి ఆదరణకు ఆలంబన, స్థాయి, ఉన్నతి తీసుకువస్తారు.

ఈ 'సారాంశాన్ని' ఎవరికి వారు పదే పదే చింతనం చేసుకుని అవగాహనకు తెచ్చుకోవాలి. బహుతేలికగా కనిపిస్తూ, అర్థం అయినట్లే వుండి—ఆచరణకు అందని అనేక ఆధ్యాత్మ సూత్రాలలో యిది మిన్న అయినది. ఈ [Paradox] నుంచి మనిషి తన మనస్సును పైకి తెచ్చుకోవాలి. ఉత్థానం చేసుకోవాలి. దీనికోసం వారివంక, వీరివంక, యీ సంస్థ వయిపు, మరో సంస్థ వయిపు కాకుండా ఎవరికి వారు తమ 'స్వప్రజ్ఞ'ను పరిశీలనాత్మకంగా గమనించి పొందడం అవసరం-అనీ, దీనికి అవకాశం వున్నదనీ కృష్ణమూర్తి చెబుతారు.

ఇదంతా వినడానికి, చదవటానికి బాగానే వుంది గాని, ఆచరణలో సాధ్యమా?—అని ప్రశ్నలు వేసేవారికి కృష్ణమూర్తి సమాధానం ఒక్కటే:

'నాకు సాధ్యం అయింది, మీకు మాత్రం ఎందుకు సాధ్యపడదు? నేనూ మీలాంటి సామాన్య మానవుడినే. గమనంతో పరిశీలించి వర్తించండి. క్షణమయినా ఏమరుపాటు లేకుండా ప్రయత్నం చేయండి. అలా ప్రయత్నం చేయడమే—అప్ర యత్న పూర్వకంగా జరిగే స్థితికి రండి. అంతా సాధ్యమే!"

కృష్ణమూర్తికి అవగాహన చేసుకోవడంలో యీ మౌలిక విషయాల గమనం ఎంతయినా ముఖ్యం. వీటిని మనకు కావలసిన పద్ధతిలో మళ్ళించుకోవడం కాకుండా యదార్థరూపంలో చూచుటానికి కృషి జరగాలి.

  

'జ్ఞాన సరోవరంలోనికి లోతుగా బహులోతుగా చూచాను. అక్కడ ఎన్నో పరివర్తన రూపాలు అగుపించాయి; పరిణమించిన దృశ్యాలు గోచరించాయి.

"పవిత్ర దేవాలయంలో శిలను నేను.
పదుగురూ తొక్కి నడయాడే పచ్చిక బయలులో ఒక గడ్డిపరకను నేను.
స్వర్గసీమలను తాకటానికి పైకి ఎగబాకుతూ ఎదుగుతూవున్న నిటారు వృక్షాన్ని నేను.
మీరు వేటాడుతున్న మృగాన్ని నేను.
మీరందరూ అసహ్యించుకుంటూ, హీనంగా, దుస్సహంగా చూస్తున్న నేరస్థుడిని నేను.
మహారాజ మర్యాదలతో మీ అందరిచేత మన్ననలు, సన్నుతులు పొందుతున్న సార్వభౌముడిని నేను.
దుఃఖము, బాధ, గడచిపోయే సుఖసంపదలు, ఆశాపాశాలు, పారి తోషికాలు నేను.
కర్కశమైన కోపం, అనంతమైన కారుణ్యం నేను.
మహాపాపాన్ని, పాప పంకిలుడినీ నేను.
ప్రేమికుడినీ, ప్రేమనే ప్రేమించేవాడినీ నేను.
నేనే పరమహంసను.
నేనే కీర్తనకారుడిని, నేనే పూజారిని.
నేనే అనుయాయుడిని.
నేనే భగవంతుడిని—"

—అంటూ తాము చూచిన పరివర్తిత రూపాలను వివిధ పదజాలంతో వర్ణించి చెబుతారు ఒక గీతికలో కృష్ణమూర్తి. ప్రపంచంలో- సృష్టిలో- వున్న అనేకానేక విషయాలను, వస్తువులను వేరువేరుగా చూడడం కాకుండా ఒక్కటిగానే- సమగ్రం గానే చూడగల స్థాయి పెంపొందించుకోవడం అవసరం అనీ, అన్నిటికీ అంతర్గ

యగా అంతఃస్రవంతిగా నడిచే పద్ధతి గమనించడం ముఖ్యమనీ మనం యిక్కడ గమనించగలగాలి.

నేనెవరు?

నా మార్గం ఏమిటి?

—అనేవి అనాదిగా ఆధ్యాత్మ ప్రశ్నలు.

ఈ ప్రశ్నలకు రకరకాలుగా సమాధానాలు చెబుతూ అనేక సంప్రదాయాలు తయారయ్యాయి.

సంప్రదాయాలు వేరయినా సంవిధానాలు ఒక్కటే అనే ఆలోచనలు కూడా బయలుదేరాయి.

మార్గం .... పథం .... యోగం .... యిలా అనేక పేర్లు రహదార్లకు.

నీ మార్గాన్ని నీవు కనుక్కున్నావా?

నీ 'దారి'ని నీవు తెలుసుకున్నావా?

మార్గంతోను, దారితోను ఒకటి అయిపోయినావా?.... ఈ రకం ప్రశ్నలు అనేకం ఎదురవుతూ ఉంటాయి ఆలోచనా పరులకు.

'దారి' అంటే వేరే ఎక్కడో లేదనీ, అది "మనమే"నని గ్రహించాలని తరచు గుర్తుచేస్తూ వుంటారు కృష్ణమూర్తి.

'ఒకమారు సుందరమైన చిత్తరువు ముందు కూర్చున్నాను. తదేకంగా దానినే చూస్తూ వుండిపోయాను. ఆ చిత్తరువు కళ్ళలోనికే గుచ్చి గుచ్చి చూస్తున్నాను. ఆ కళ్ళలోంచే దారి ఏర్పడి కనిపించసాగింది. బహుదూరంగా విస్తారంగా పరుచుకు వుంది ఆ దారి. అనంతమైన మార్గం. పొడుగునా ఎన్నో నీడలు.... జాడలు....! ఈ మార్గాన్ని గురించే ఎన్నో ఆలోచనలు, ఎన్నో ఆకారాలు. ఇదే సుఖం, ఇదే ఖేదం. శీలం–సంపద యిదే. గౌరవం-మర్యాద యిదే. సుందరత-ప్రేమాతిశయం యిదే. మనిషికి సంబంధించిన ప్రతి ఉదాత్త అంశమూ యిదే. అన్నింటి సారాంశము యిదే. ఎన్ని పుస్తకాలయినా చదవవచ్చు. ఎందరు గురువులనయినా ఆశ్రయించవచ్చు. అయితే మార్గాన్ని గురించి వివరాలన్నీ సేకరించగలిగాం అనుకోవటానికి వీల్లేదు.

'నీ ముందు బహుదూరంలో పెడుతూ ఓ మనిషి వున్నాడు. అలాగే నీకు వెనకగా బాగా దూరంగా మరో మనిషి నడచి వస్తున్నాడు. మీరు ముగ్గురూ ఒకే బాటలో— దారిలో, మార్గంలో— నడుస్తున్నారు. దూరంలోమటుకు ముందు వెనుకలు, అంతే. దారిమటుకు ఒక్కటే. అందరమూ ఒకే బాటలో ప్రయాణం చేస్తున్న బాటసారులం. ఎప్పటికీ అంతంకాని బాట. ఎప్పుడూ మెలికలు తిరుగుతూ మారిపోతూవుండే బాట. ప్రపంచంలోని అందరికీ యీ విషయం అర్థం అవాలి. ఈ బాట

యొక్క వైభవం అందరికీ అవగాహన కావాలి. సహాయం చేయడం కోసం, సహకరించడం కోసం, సుఖంగా వుండడం కోసం—పోరాటం, వెంపర్లాడ పడకూడదు. హైరాణ వుండగూడదు.మీరు అతి సహజంగా మామూలుగా సామాన్యంగా వుండాలి. మీ భావనలు ఆలోచనలు అలాగే వుండాలి. ఉత్సాహము ఆసక్తి అదే రీతిగా వుండాలి. అప్పుడు ఆ వైభవాన్ని అందుకోగలుగుతారు, ఆ వికాసాన్ని అర్థం చేసుకోగలుగుతారు.

'బాటను గురించి నేను వర్ణించి చెప్పిందే సర్వమూ— దీనిమీద మరో అక్షరం పైన చేర్చటానికి వీలులేదు, అనను. ఇప్పటి అవగాహన యిది. మరో పది సంవత్సరాల తరువాత, పది రోజుల తరువాత నా అవగాహన మరో రకంగా వుండవచ్చును. దేనినీ సంకుచితపరచి పరిమితులకు లోనుచేయగూడదు. కొత్తగా యేదో సిద్ధాంతాలు రాద్ధాంతాలు రూపొందించి రుద్దగూడదు. ఈ బాట.... మార్గం.... రహదారి.... ఎప్పుడూ తెరిచే వుంటుంది. దీన్ని మూసివేయడం, తలుపులు బిగించివేయడం అసాధ్యం అయిన విషయం.

'మనస్సు ఎప్పుడు తనకు బయటవున్న దానిని- బాహ్యం అయిన దానిని రూపకల్పన చేసుకోవాలనీ, దానికి అంటిపట్టుకు వుండాలనీ అనుకుంటుంది.

గురువు అంటే ఎవరు? నేనే!.... నా లక్షణాలన్నీ సక్రమపడి నేను ఆదర్శవంతంగా పరిపూర్ణంగా తయారయితే, నేను గురువు కాక మరేమిటి? ఆయన నాలో భాగం....నా అవగాహనలో భాగస్వామి; నా అనుభవంలో భోక్త; నా ఊపిరిలో ఊపిరి. ఆయన దగ్గరకు నేను బేషరతుగా వెళ్ళవచ్చును నా విచారాలు, కుదులాటలు, అసూయలు... లేదా సుఖాలు, కీర్తనలు, వైభవాలు అన్నీ తీసుకుపోవచ్చును. ఆయనే నాకు తండ్రి; తల్లి; కొడుకు; కూతురు; భార్య.... అన్నీని. ఈ అభిప్రాయాన్ని మన మనస్సులకు బాగా రంగరించి చెప్పకోగలగాలి. ఎందుకంటే....యిందాక చెప్పకున్నట్లుగా....మనస్సు ఎప్పుడూ బాహ్యామైన "ఊతకర్ర"ను కోరుకుంటుంది. దానిలో భాగమే మనం అయినప్పుడు యింక దానిమీద ఆధారపడివుండడం ఎలా సాధ్యం? అదే మనం! మన ఒంటరితనం,యేకాంతం వేరు అయిన భావం సమసిపోతాయి. ఆకు తాను వంటరిదానిని అనుకుంటుందా?—అది చెట్టులో భాగం కదూ? దట్టంగా గాలి వీచినప్పుడు ఆకు రాలి పోతుంది. అయితే చెట్టు మాత్రం నిశ్చలంగా నిలచివుంటుంది. ఆకుకు తాను వేరయిపోయినందుకు ఎంతో గర్వం అనిపించవచ్చును. తతిమ్మా ఆకులు రాలలేదు; నేనే విడిపోయి వేరయినాను— అనిపించవచ్చును. మనలో ప్రతి ఒక్కరి స్థితీ యిదే.

"మనం వేరు, మనం వేరు.... అనే పృథక్ భావన మనకు వుండవచ్చును. కాని మానవాళి అంతా ఒకే కుదురు కదూ? ఒకే జీవనాళం అయిన మనమందరం

కలిసికట్టుగా వుండలేమా? మనలోనే ఎందరో హీనులు, దీనులు; ఎందరో ఉన్నతులు, అతిశయపరులు. శిలలు, భగవంతుళ్ళు మనమే. తతిమ్మా మనుషుల నుంచి సృష్టిజాల నుంచి విడిపడిపోయి వేరయిన వాళ్ళం మటుకు కాదు మనం.

"మనలో ఎన్నో వ్యత్యాసాలు; వైరుధ్యాలు. అంతమాత్రంచేత మనమంతా వేరువేరు అయిపోతామా? మన వైఖరులు వేరువేరు కావచ్చును. ఆశాపాశాలు వేరు రీతులుగా వుండవచ్చును. మన ప్రత్యేక బాటలను— రహదారులను—మార్గాలను మనం అనుసరించవలసివుంటుంది. కాని అవన్నీ ఒకే గమ్యానికి తీసుకుపోతాయి. ఒకే శిఖరానికి చేరుస్తాయి. జీవిత గమనాన్ని అంతటినీ యీ రకంగా ఆలోచించుకు చూచుకోవడం ఎంతో ఆసక్తి దాయకంగా, సుకుమారంగా, లలిత కోమలంగా వుంటుంది...." అంటారు కృష్ణమూర్తి.

మేడం బ్లావట్స్కీ తమ గ్రంథం "ది వాయిస్ ఆఫ్ ది సైలెన్స్" **The Voice of the Silence**లో యిలా అంటారు:

మీ అంతిమ విమోచనానికి మార్గం మీలోనే ఉంది.

**(Within your Self)**

ఆ మార్గం మీ వెలుపలనే ప్రారంభమై కొనసాగుతుంది.

**(Outside your Self)**

'సత్యం' అనేది ఒక వస్తువు కాదు, ఒక పదార్థం కాదు—అది ఒక క్షేత్రం, సీమ [**Field; Land**] అనే ఆలోచనతో ప్రారంభమై దానిని చేరుకునే మార్గాల వైవిధ్యం, అంతర్లీనమైన ఏకత గమనానికి తెచ్చుకోవడం అత్యవసరం.

మన భూమండలానికి చెందిన ప్రకృతి అంతా యేడు వర్గాలుగా లోకాలుగా తలాలుగా విభాగం అయివున్నదని సంప్రదాయ సూచన గమనించగలగాలి.

భూలోకం....భువర్లోకం.... సువర్లోకం ... యిలా పేర్లు పెట్టుకుంటూపోయి ఏడో ఊర్ధ్వ లోకానికి 'సత్య' లోకం అని పేరు పెట్టుకున్నాడు సంప్రదాయ; ఉపనిషత్కారుడు. సత్యం అనేది ఈ లోక పదార్థం; యీ లోకతత్త్వం. దీన్ని స్పృశించగలగడం భూమండలంలోవున్న అందరికీ సాధ్యమే, కాకపోతే ఆ సీమకు తనంతదారిని తానే తయారుచేసుకోవాలి ప్రతి మనిషి.

భూమండల తోరణంలో అత్యున్నత—కిరీట స్థాయి-మకుటం సత్యం.

—0—

# జీవన నూతనాధ్యాయాలు

## జీవన విధానం

కొత్తరకం ఆలోచన ధోరణిని ప్రవేశపెట్టిన వ్యక్తి జె కృష్ణమూర్తి. ఏ విషయాన్ని గురించి అయినా అలవాటు అయిన పద్ధతిలో సమాధానాలు, సమాచారాలు చెప్పుకోవడం కాకుండా ఆ విషయం 'మూలం' లోనికి వెళ్ళి సమూలంగా అర్థం చేసుకుని వివరణలు చేయడం ఆయన పద్ధతిగా కనిపిస్తుంది.

జీవిన విధానంలో ఎన్నో మార్పులు రావాలి.

ఈ మార్పులు ఎక్కడినుంచో ఆకాశం మీదనుంచి మన మీదకు దుమికి రావు. వీటిని మన ఆలోచన పరిధిలోనే ప్రవేశపెట్టుకోవాలి. క్రమంగా ఆ పరిధికి అతీతంగా అతిగమించి ప్రవర్తించడం అవలంభించాలి-అని ఆయన సూచిస్తున్నట్లు కనిపిస్తుంది.

వ్యక్తిగత సంబంధాలలో అయినా—

సమిష్టి వ్యవహారాలలోనయినా—

ప్రవర్తన రీతులు యేదో 'మూస'లో పోసినట్లు వుండకుండా ప్రతిమారు కొత్తగా, వికాసమయంగా వుండాలి.

ఏమాత్రం 'కృతజ్ఞత' లేకుండా ప్రతిదీ సహజంగా, సరళంగా భాసించాలి.

ఆయన ప్రతి ప్రసంగంలోను, సంభాషణలోను ఈ రకమైన ధోరణికి స్వాగతం పలికారు.

మనం గెలుపు-విజయం-పొందినప్పుడు ఎందుకు గర్వాతిశయంతో పొంగి పోతాం?-అని ఒక శ్రోత అడిగినప్పుడు ఆయన చెప్పిన సమాధానం ఎలావుందో చూడండి :

'గెలుపు అంటే ఏమిటి?

'ఒక రచయితగా, కవిగా, చిత్రకారుడుగా, వ్యాపారస్తుడిగా, లేక రాజకీయ వేత్తగా గెలుపు లేక విజయం సాధించడం అంటే యేమిటో ఎప్పుడయినా ఆలోచిందారా మీరు?

'అంతరికంగా మీరు-ఇతరులు యింతవరకు సాధించని ఒక స్థితిని పొంద

గలిగానని, నన్ను నేను నిగ్రహించుకుని ఈ స్థితిని పొందడం జరిగిందని భావించారా?

'ఇతరులు ఓడిపోయిన రంగంలో నేను విజయం సాధించాను-అనుకున్నారా?

'ఇతరుల కంటె నేను మిన్న అయినవాడిని, విజయసాధకుడిని, నేనంటే అందరికీ గౌరవం, మర్యాద. నన్ను అందరూ ఒక మాదిరిగా ఆదర్శంగా చూస్తారు....ఇటువంటి ఆలోచనలు మీ మనస్సులో మెదిలాయా?

'ఈ ఆలోచనలు మీకు కలిగినాయంటే, మీరు గర్వం, అతిశయం వంటి భావోద్రేకంతో నిండిపోయినారన్నమాట.

'నేను ఇది సాధించాను, నేను ముఖ్యమైన మనిషిని. ఇలా "నేను" అనేది గర్వం, అతిశయం లక్షణాలకు కేంద్రస్థానం. విజయంతో పాటు ఈ భావం కూడా గట్టిపడుతుంది.

'ఇతరులతో పోల్చి చూచుకోవడము, ఏదో ఆదర్శం ఊహించుకుని దానితో మిమ్మల్ని మీరు బేరీజు వేసుకోవడము జరుగుతుంది. దీనివల్ల ఎంతో ఆశ, బలం, ఉత్సాహం, అర్థవంతం అయిన స్థితి ఏర్పడుతుంది. ఇవన్నీ "నేను"....ను దృఢపరుస్తాయి, బలపరుస్తాయి. ఇది చాల సుఖకరమైన ధోరణి. ఈ ధోరణి గర్వానికి నాంది.

'దీనితో పాటు "అతిశయం" వస్తుంది. నన్ను గురించి నాకు గొప్ప భావన. పెద్ద పెద్ద వాళ్లతోను, మీలోను ఈ రకమైన ధోరణి మీరు పసిగట్టవచ్చు. మీరు ఒక పరీక్షలో కృతార్థులు అవుతారు. ఇతరుల కంటె తెలివికల వాళ్లం-అనే భావన మీలో అంకురిస్తుంది. ఇతరులను వాదంలో ఓడించారనుకోండి, అప్పుడూ అదే భావన. ఇతరుల కంటే బలశాలురమనీ, సుందరులమనీ అనుకున్నప్పుడు కూడ యిటువంటి ధోరణే. నాకు నేను ...ముఖ్యం, ప్రధానం....అనే భావన పెరిగిపోతుంది.

'ఇది పెరిగినకొద్దీ సంఘర్షణ, పోరాటం, బాధ-యిలాంటి లక్షణాలన్నీ వెనుకనే వస్తాయి. ఎందుకంటే కష్టపడి సాధించిన గెలుపును, విజయాన్ని నిలబెట్టుకోవాలి గదా, సర్వకాలాలకు మన ప్రాముఖ్యత తగ్గిపోకుండా చూచుకోవాలి గదా.

గర్వం నుంచి బయట పడడం ఎలా?-అన్న ప్రశ్నకు ఆయన సమాధానం యేమిటో యిందుతో పాటే పరికించి చూచుకోవడం బాగుంటుంది.

నిజానికి పై ప్రశ్నకు సమాధానం జాగ్రత్తగా వింటే, గమనిస్తే, తరువాతి ప్రశ్నే ఉదయించదు.

కాని మనిషి మనస్సు ఎప్పుడూ 'ప్రశ్నలు అడగడంలో తనకు ఉన్న చాక చక్యాన్ని' తప్పనిసరిగా ఉపయోగించుకోవాలనే ప్రయత్నిస్తుంది.

'సరే. నేను గర్విని. నిగర్విని కావాలని అనుకుంటున్నాను, నేను "ప్రిన్సిపల్" అయినాను. ఏ ఇంగ్లడ్‌కో, అమెరికాకో వెళ్లి వచ్చాను, ఎన్నో గొప్ప గొప్ప కార్యాలు చేశాను. నా ఫోటోలు వార్తాపత్రికలలో, పుస్తకాలలో వచ్చాయి. ఇవన్నీ నాకు గర్వకారణాలు.

....అప్పుడు ఇంకా ఆలోచిస్తున్నానన్నమాట, ఈ గర్వం అనే చక్రం నుంచి బయటపడడం ఎలా? అని.

'అసలు ఎందుకు నిగర్విని కావాలని ఆలోచిస్తున్నాను? గర్వం నాకు అపకారం చేస్తుంది గనుకనా? మానసికంగా, ఆధ్యాత్మికంగా గర్వం వుండకూడదని ఎప్పుడో చదువుకున్నాను గనుకనా?

'—ఈ కారణాల వల్ల నిగర్విని కావాలని అనుకుంటే, "గెలుపు సాధించాలి" అనుకున్న సంకల్పం కంటె ఇది మిన్న అయినది కాదు.

'నన్ను నేను అర్థం చేసుకోవడం తప్ప, ఇందుకు సులభోపాయం మరేమీ లేదు. నాలో కేంద్రంగా వున్న "నేను" ఎప్పుడూ కొత్త ఉడుపులు ధరిస్తూ వుంటుంది. ఉడుపులు ఎలాంటివి అయినా, అసలు "నేను" అనే కేంద్రం సమ స్థాయిలో వుండాలి. మీ ఆలోచనాక్రమం ఏమిటో మీకు తెలిసి వుండాలి. మీ క్రింది ఉద్యోగస్థులను, నౌకర్లను ఎలా పలుకరించాలో మీరు ఎరిగి వుండాలి. తల్లిదండ్రు లతో, టీచర్లతో, పైవాళ్లతో, కింది వాళ్లతో వ్యవహరించటం యే రీతిగా వుండాలో....యిదంతా శాసించేది "నేను" అనే కేంద్రమే. దీని ప్రవర్తనా రీతిని తెలుసుకుంటే, అప్పుడు ఈ "నేను" నుంచి మీకు స్వేచ్ఛ, విడుదల.

'అదే ముఖ్యవిషయం. అంతేకాని, గర్వం నుంచి బయట పడడం ఎలా అనేది-ప్రధాన విషయం కానేకాదు.'

ఈ రకంగా జీవన విధానంలో మనసును ఆవరించే అన్ని ప్రవృత్తులను సరి చూచుకునే ప్రక్రియ సూచిస్తారు, కృష్ణమూర్తి. అర్థం కానట్లుగా, అభేద్యంగా వుండే వీరి ఆలోచన పద్ధతిని-దీనిని ఒక "పద్ధతి" అనడం కూడ యిష్టం వుండదు-కొంతలో కొంత అవగాహన చేసుకోవడం ప్రతి ఆలోచనాపరుడికీ అవసరం.

మనం అనేక సంగతులు మనకు తెలుసును అనుకుంటాం. తెలుసును అను కోవటానికి పూర్వరంగం యేమిటి?

ఒక మనిషి మనకు తెలుసును అనుకుంటాం. నిజంగా మనకు తెలిసినది ఆ మనిషా లేక ఆ మనిషిని గురించి మనం యేర్పాటు చేసుకున్న అంచనాలా? మనకు తెలుసుననుకున్నదంతా 'గతం', పాతరోజులకు సంబంధించినదే. గతానికి

సంబంధించిన జ్ఞానంతో మనం వర్తమానంలో వర్తిస్తున్నాం, ఇది ఎంతవరకు సమంజసం? ఎంత సబబు-అన్న విషయం సంపూర్ణంగా ఆలోచించాలంటారు కృష్ణమూర్తి.

నన్ను నేను తెలుసుకోవాలి, అర్థం చేసుకోవాలి-అని కూర్చున్నప్పుడు ఎన్ని యిబ్బందులు వచ్చి పడతాయో చూడండి.

నేను సజీవ పదార్థాన్ని.

అనుక్షణము మారిపోతున్నాను.

ఎన్నో కొత్త విషయాలు నాలో కలుస్తున్నాయి.

పాత సంగతులు రాలిపోతున్నాయి.

ప్రతి విషయాన్నీ ఎప్పటికప్పుడు కొత్తగా అప్పుడే మొదటి మారుగా పరిశీలిస్తున్నట్లు గమనించడం అవసరం. లేకపోతే పాత ముద్రలు దాని మీద పడిపోతాయి.

అప్పుడు ఆ ముద్రను చూడడమే అవుతుంది గాని అసలు వస్తువును చూచినట్లు కాదు.

'నాకు తెలుసును అన్న మనిషిని నమ్మకండి. అతనికి యేమీ తెలియదు'—అని ఒక నానుడి.

ఈ విషయాన్ని వివరిస్తూ కృష్ణమూర్తి ఒక సందర్భంలో యేం అన్నారో చూడండి.

'నేను భగవదనుభూతి పొందాను, ఆధ్యాత్మ వికాసం అంటే యేమిటో నాకు తెలుసును-అని ఒక మనిషి అన్నాడంటే దాని అర్థం 'స్టేషన్‌కు వెళ్లటానికి నాకు దారి తెలుసును సుమా' అని మాత్రమే.

స్టేషన్ ఒక స్థిర ప్రదేశం.

దీన్ని చేరుకోవటానికి అనేక మార్గాలు వున్నాయి.

ఒక్కొక్క మార్గానికీ ఒక గురువు వుంటాడు.

అతడు 'నాకు తెలుసు, నేను చూశాను' అంటాడు. అంటే యేమన్నమాట? వాళ్లు యేదో చూచారు, ఆ చూచిన దాని అనుభవానికి-కట్టుబడి వున్నారు. గతంలోనే వున్నారు.

సత్యానికి దారిలేదు.

ఎందుకంటే అది సజీవమైనది.

స్థిరమైన ప్రదేశం కాదు.

మృత వస్తువు అంతకన్నా కాదు.

మనమందరం అనుక్షణం మారుతూ వున్నాం. అంతేకాని కదలక మెదలక

జడంగా ఒక ప్రదేశానికి-ఆలోచనకు-కూరుకుపోయి లేంగదా. అందుచేత మనం ఒకళ్లనొకళ్లం బాగా ఎరుగుదుం అనుకోవటానికి కూడా సాధ్యత లేదు.

నాకు తెలుసును-అనుకోవటం కంటే తెలివితక్కువ మాట మరొకటి లేదు. ఏదో ఊరడింపు కోసమో, భద్రతా భావంతోనో యిలా అనుకుంటాం, అంతే.

ఈ విషయం స్పష్టంగా అర్థం అయితే, జీవితంలో ఎన్నో సంగతులు తెలిసినంత.

—అంటారు కృష్ణమూర్తి.

సత్యం కాలానికి, అనుభవానికి అతీతం అయినది. కాలం ద్వారా అనుభవం ద్వారా దాని చెంతకు చేరలేము.

గతంలో కుందిపోయే, మురిసిపోయే, 'మనస్సు' నిత్యనూతనంగా వుండలేదు. ప్రతిక్షణము వికసిస్తూ వుండాలి మన మనస్సు.

మన జీవితం ఏమిటో మనం సూటిగా స్పష్టంగా చూచుకోగలగాలి.

'మీకు జీవితాలలో ప్రేమ లేదు: సుఖం మటుకు వుంది. ఈ సుఖం ఎప్పుడు ఎటు మాయం అయిపోతుందోననే భయం వుంది. అందుచేత మీరు ఒక్క క్షణం కూడా స్వేచ్ఛగా వుండలేక పోతున్నారు. స్వేచ్ఛను గురించి వేల కొద్దీ పేజీలు వ్రాయడం మీకు చేతనయి వుండవచ్చు. కాని అది మీకు స్వేచ్ఛను యివ్వలేదు. కేవలం మాటలుగా కాకుండా నిత్య జీవితంలో మీకు స్వేచ్ఛ వుంటే అప్పుడు జీవన విధానం మరో రకంగా వుంటుంది. ఆ విధానం వెనక బాధ, దుఃఖం రావు.'

* * *

## వ్యక్తి - వ్యవస్థ

వ్యక్తి ప్రధానమా? వ్యవస్థ ప్రధానమా?

....ఇది అనాదిగా వున్న ప్రశ్న.

వ్యక్తికి వ్యవస్థకు ఏమిటి సంబంధం?

దేని కోసం ఏది?

ఒకటి మరొకదానిని ఎంతవరకు పరిమితం చేస్తున్నది?

—ఈ రకమయిన ప్రశ్నలను విశదపరచటానికి, విపులీకరించటానికి ఎందరో ఎన్ని రకాలుగానో ప్రయత్నం చేశారు.

మతాలు, రాజకీయ శాస్త్రాలు, సాంఘిక శాస్త్రవేత్తలు.... ఒకరేమిటి మనిషికి

సంబంధించిన అన్నిరంగాలలోను ఈ ప్రశ్నలను చర్చించటానికి మేధస్సు ఉబలాట పడింది.

ఆయినా యేకాభిప్రాయం కుదరలేదు. అనేకాభిప్రాయిల మధ్య సంఘర్షణ, వైరుధ్యం తప్పటం లేదు.

ప్రపంచ చరిత్ర అంతా పరిశీలించినా, నాగరికతల పురోగమనాన్ని పరికించినా ఇవి రెండూ ఒకదాని కొకటి విరుద్ధమైనవనే ధోరణి, విభిన్నమయినవన్న ఆలోచన అగుపిస్తుంది. ఒకదానితో మరొకటి పరస్పర ఆశ్రయం కలిగివున్నాయని సమాధాన పడదలుచుకున్నా, మొదటి పంక్తిలోనే చూపినట్లుగా ఏది ఎక్కువ ప్రధానం, ఏది రెండవ అంశం అన్న ప్రశ్న మిగిలిపోతూనే వుంది.

సంఘం, సాంఘిక వ్యవస్థలు మనిషిని అణగణదొక్కటానికి ప్రయత్నిస్తాయి, అందరూ కలిసి నిర్ణయించి, నిశ్చయించిన చౌకట్టులోనే మనిషిని బిగించటానికి అనవరతం ప్రయత్నం జరుగుతూ వున్నది.

ఈ నిబంధనలో, పరిమితులను బద్దలు కొట్టుకు పైకి రావాలని, వెలికి వచ్చి స్వేచ్ఛగా మనగలగాలనీ మనిషి నిరంతరము ప్రయత్నం చేస్తూనే వున్నాడు.

మతాలు 'జీవాత్మ' అనే పదాన్ని, దానికి పోషక పదార్థం అయిన, 'పరమాత్మ' అనే పదాన్ని ప్రచారం లోనికి తీసుకువచ్చి మనిషి 'కించిజ్ఞత'ను గుర్తు చేస్తున్నాయి.

ఆధునిక యుగంలో 'వ్యక్తి' తన హద్దులను బద్దలు చేసుకు బయట పడాలని తీవ్రకృషి చేస్తున్నాడు. ప్రత్యేక గుర్తింపు కోసం, చెలామణి, పరిగణనల కోసం అంగలారుస్తున్నాడు. ఇలా పోరాటం సాగిపోతూనే వుంది, రెండు పక్షాల మధ్య. దీని కంతటికీ ఏమయినా అర్థం, అవసరం వున్నదా?—అనిపిస్తుంది ఒక్కొక్క మారు.

కృష్ణమూర్తి ఈ ప్రశ్న పరంపరలను కొత్త దృష్టితో చూసేవారు. ఆయన సమాధానాలు ఆకుకు అందక, పోకకు పొందక వున్నట్టు అనిపించినా లోతుగా ఆలోచించి తెలుసుకోవలసిన సంగతులు ఎన్నో వున్నాయనేమాట మటుకు విదితం అవుతుంది.

'ఈ ప్రశ్నలన్నింటికీ ముందు— ప్రధానంగా గమనంలో వుంచుకోవలసిన విషయం ఏమిటంటే—అంటూ ప్రారంభించి కృష్ణమూర్తి ఇలా ముందుకు సాగి పోయారు ఒకమారు:

'జీవన విధానాలలో సరళిలో మంచితనం, వివేకం, ప్రేమ ప్రవర్తిల్లాలి. మంచితనం అనేది వ్యక్తి గతమైనదా, సంఘు (వ్యవస్థ) పరమయినదా?

అలాగే ప్రేమ—వ్యక్తికి పరిమితమా, అవ్యక్తమా?

'వివేకం, అనేది—నీది, నాది, అతనిది, ఆమెది అని విభాగాలు చేయటానికి వీలయినదా? అది మీకు, నాకు మటుకే సంబంధించిన విషయం అయితే 'వివేకం' అనే పేర్లు దానికి నప్పదు. దండుగ అయిపోతుంది. మంచితనం, ప్రేమ అనే మాటలు కూడా ఇటువంటివే.

'మంచితనం అనేది కేవలం ఒక మనిషికి, ఒక సముదాయానికి మాత్రమే పరిమితం అయివుండేట్లయితే అది మంచితనం కానేకాదు. మంచితనం అనేది ఒక మనిషి పెరటి వస్తువు కాదు, అలాగే ఒక సమాజం తాలూకు బహిఃక్షేత్రము కాదు. మంచితనం అన్నది స్వేచ్ఛలోనే ప్రభవిస్తుంది. ఈ రెంటి నుంచి స్వేచ్ఛ వున్నప్పుడే అది వికసిస్తుంది. ఇటువంటి మంచితనం, ప్రేమ, వివేకం పుష్కలంగా వున్నప్పుడు కార్యాచరణ కేవలం ఒక వ్యక్తికో, ఒక సముదాయానికో పరిమితమై వుండదు. ప్రాథమికమైన ఈ మంచితనం లేకుండా పోయినప్పుడే మనం ఈ ప్రపంచాన్ని వ్యక్తి—వ్యవస్థ అని రెండు భాగాలుగా చీలుస్తున్నాము.

మతం-జాతీయత—ఆర్థిక వసతి....యిలా యేవేవో ప్రమాణాలతో ప్రపంచాన్ని ఛిన్నాభిన్నం చేస్తున్నాము. అనేక ముక్కలుగా చీలుస్తున్నాం, ఖండిస్తున్నాం. ఇలా విభజించి ఊరుకోకుండా. వీటన్నిటినీ మళ్ళీ కలిపి ఒక్కటే చేయాలని సంకల్పించి అందుకోసం క్రొత్త క్రొత్త గుంపులు తయారు చేస్తున్నాం. ఈ గుంపులు మళ్ళీ ఒకదానికొకటి విరోధంగా తయారవుతున్నాయి. ప్రపంచంలో వచ్చిన మత సముదాయాలు చూడండి, మళ్ళీ.

ప్రతి మతము మానవుడు సోదరభావంతో మెలగ వలసిన అవసరాన్ని వక్కాణించటానికే ఏర్పడింది. కాని నిజానికి మతం ఈ "సోదర భావాన్ని" ఆటంక పరుస్తున్నది. ఆచరణ తీరులు, రీతులు అలా వున్నాయి మరి. భ్రష్టుపట్టి పోయిన దానిని పునర్నిర్మించాలని, వ్యవస్థీకరించాలని సంస్కరించాలని ప్రయత్నం చేస్తున్నాం మనం. అంతేకాని, భ్రష్టతను సమూలంగా తొలిగించటానికి ప్రయత్నించడం లేదు. దానినే పునర్వ్యవస్థీకరణ చేస్తూపోతాం ఎంతసేపూ.

'ఇంతకూ—అసలు ప్రశ్న ఏమిటంటే:

'మంచితనం-ప్రేమ -వివేకం-ఇవి ప్రపంచంలో ప్రవర్తించే రీతినీతులు యేమిటి?

'ఇవి సంఘటనలు, సన్నివేశాలు, వ్యక్తులు....వీటి సంబంధ బాంధవ్యాలలో, వాటి పరిధులలో ప్రవర్తించగలవు.

'సృష్టి అంతా-ప్రపంచంలో జరుగుతున్న దంతా-ఈ సంబంధ బాంధవ్యాల మీదనే ఆధారపడి వుంది.

'అందుచేత ప్రధాన కర్తవ్యం యేమిటంటే:

ప్రతిదానితోను మనకు వున్న సంబంధం ఎలాంటిది—అని గమనించగల గడం.

ఈ సంబంధం భూమికలోనే 'నేను' 'నాది' అనేది ఎలా పుడుతున్నదో, పెరుగుతున్నదో గమనించగలగడం.

ఈ 'నాది' అనేది వ్యక్తిగతం, సముదాయపరం-అనే సంగతిని గుర్తించడం.

ఈ విషయాన్ని స్పష్టంగా, క్షుణ్ణంగా అర్థం చేసుకోవడమే దాన్ని అంత మొందించడం కూడా అవుతుంది.

అది అంతం అయిపోయిందంటే' అప్పుడు మంచితనం, ప్రేమ, వివేకం, వాటంతట అవి వుంటాయి.

ఇన్నాళ్ళూ తెచ్చిపెట్టుకున్న వైరుధ్యం, సంఘర్షణ ఉండవు.

ఏదో ఒక విశ్వాసం కానీ, ఒక వ్యవస్థ కానీ మనిషిని ఈ రకమైన 'స్వేచ్ఛ' వయిపు నడిపించలేవు.

ప్రతి వ్యక్తీ తన అవగాహనను, పరిశీలన పరిధిలో పెంచుకుంటూపోయి పరిమితులకు అతీతంగా తయారు అవడమే శ్రేయోమార్గం అని కృష్ణమూర్తి అనేక మాటలలో చెప్పారు.

'మీరే ఈ ప్రపంచం ఈ ప్రపంచం మీరే. మీరే ఈ సంఘం. మీరు పుట్టి పెరిగిన సంస్కృతి యిదే. ఈ సంస్కృతి, యీ సంఘం (సమాజం) మీ కృషి ఫలితమే. మీ అసూయలు, కార్పణ్యాలు, దౌర్జన్యాలు ఇందులో భాగంగా చేరి పోయాయి. ఈ విషయం గుర్తించడం చాల అవసరం—అంటారు ఆయన.

దీనిని మార్చడం అవసరం.

మార్చడం అంటే ఏదో పైపైన బాహ్యంగా, రంగులు పులిమినందువల్ల జరగదు. సమూలమైన మార్పు కావాలి.

అంతరికంగా మార్పు కావాలి.

అంతరికమైన మార్పు అయినప్పుడే అది బాహ్యంలో కూడా రూపు కట్టుకుని పదిలంగా వుంటుంది.

'దౌర్జన్యం వల్ల త్వరగా మార్పులు తీసుకు రావచ్చునని' కొంతకాలం విశ్వ సించారు, కాని యిది ప్రయోజనకారి కాదని తెలిసిపోయింది.

ఆలోచించటానికి అవసరమైన స్వేచ్ఛను సంపాదించటం ద్వారా అన్ని సమ స్యలను కరిగించి వేయవచ్చునని కృష్ణమూర్తి సూచన.

....o....

# సమస్యలు-సృజనశీలత

ప్రపంచంలో అనేక సమస్యలు ఉన్నాయి. హిమాలయం అంత పెద్దవి. మహోదధి అంత లోతయినవి. వీటిని అర్థం చేసుకోవటానికి, తరువాత పరిష్కార మార్గం కనుగొనటానికి ఈ సమస్యలను సరళంగా సూటిగా నేరుగా దర్శించవలసిన అవసరం ఉన్నది.

'సరళత, సూటితనం అనేవి బాహ్యపరిస్థితుల మీద ఆధారపడి వుండవు. మన దురూహలు, వికారాల మీద అంతకన్నా ఆధారపడి వుండవు.

'సమస్యలకు పరిష్కారాలు, సమావేశాల వల్ల-సమారంభాల వల్ల-నాయకులను మారుస్తూ వుండడం వల్ల దొరకవు.

పరిష్కారం సమస్యను సృష్టించిన వానిలోనే వుంటుంది. అల్లరి, ఆగం, అసహ్యం, అపార్థం—యిలాంటివన్నీ మనుషుల మధ్యన వున్నాయి. వీటన్నిటినీ సృష్టించినది మనుషులే. అంటే, మీరు, నేను. అంతేగాని ప్రపంచంలో ఈ సమస్యలు వాటంతట అవి స్వతస్సిద్ధంగా వున్నాయని అనుకోగూడదు,

—అంటారు కృష్ణమూర్తి.

ప్రపంచం అంటే యేమిటి?

మీరు, నేను కలిసి తయారు చేసినదే.

అందుచేత ప్రపంచాన్ని అర్థం చేసుకోవాలంటే—

ముందుగా మనను మనం అర్థంచేసుకోవాలి.

ప్రపంచం మన నుంచి వేరుగా లేదు.

మనమే ప్రపంచం, ప్రపంచమే మనం.

ప్రపంచ సమస్యలే మన సమస్యలు.

ప్రపంచ సమస్యలకు, మనకు యేమీ సంబంధం లేదను కుంటాం చాలా మార్లు. ఇందుకు కారణం బాధ్యత స్వీకరించడంలో చెలామణీ అవుతున్న సోమరితనమే.

ప్రపంచ సమస్యలు యే యునైటెడ్ నేషన్స్ వారో ఇతర ప్రపంచ సంస్థలో తీర్చాలని మన ఉద్దేశ్యం.

ప్రపంచంలో యిన్ని ఇరుకులు, ఇరకాటాలు, యుద్ధాలు వుండటానికి కారణం మనమే దీనికి పూర్తి బాధ్యత మనదే.

ప్రపంచాన్ని మారుస్తానని ప్రతి మనిషీ ప్రయత్నిస్తాడు.

కాని ప్రపంచాన్ని మార్చడం అనేది 'ఏ మనిషికి ఆ మనిషి'తో ఆరంభం కావాలి. మనతో ప్రారంభం కావడంలో స్పష్టమైన సంకల్పం వుండాలి.

మనసు మనం అర్థం చేసుకోవాలి.

ఎవరో మరమ్మత్తుదారులను వెదకడం, విప్లవాలు తీసుకురావడం మార్గం కానేకాదు.

ఇదంతా మన బాధ్యత.

మనదే కర్తవ్యం-అని స్పష్టంగా అర్థం చేసుకోవాలి.

మనం వుంటున్నది ఎంతచిన్న ప్రపంచం అయినా, ఈ ప్రపంచంలో మనదే అనుకుంటున్నది ఎంతపరిమితమైన జాగాఅయినా—మనసు మనం 'మార్పాటు' చేసుకోగలిగినట్లయితే, మన నిత్యనైమిత్తిక వ్యవహారాలలో సరికొత్త దృక్కోణాన్ని, దృక్పథాన్ని అవలంబించ గలిగితే, మనం ప్రపంచాన్ని మార్చగలుగుతాం. ఇతరులతో సంబంధ బాంధవ్యాలలో మెరుగులు తీసుకు రాగలుగుతాం.

అర్థం చేసుకుందాం-అనే ఆలోచన వుండాలి ముందు· ఇక్కడే చాలమందికి కష్టదశ ప్రారంభం అవుతుంది.

ఎందుకంటే, ఏ మనిషికి ఆ మనిషి తనే ప్రామాణికమనీ, ఇతరులే మారాలి గాని తనలో మారవలసినది యేమీ లేదనీ అనుకుంటూ వుంటాడు.

అర్థంచేసుకోవడం అనేది-ఒకళ్ళకు మరొకళ్ళు ఇవ్వగలది కాదు. దావిక్రనయాలకు లొంగేది కాదు-ఈ లక్షణం.

అన్వేషణ చేసి చూచుకోవాలి.

ఇలా అన్వేషణ చేయాలంటే-ముందుగా నికార్సయిన సంకల్పం—ఇలా చేద్దాం అనే ఆలోచన, ఆచరణ శీలత ఉండి తీరాలి.

ఏ మనిషికి ఆమనిషి మాదినందువల్ల ప్రపంచం మారిపోతుంది.

ఆత్మ స్వరూపజ్ఞానం వుండాలి. నేను యేమిటో నాకు తెలియకపోతే సక్రమమైన ఆలోచనకు భూమిక ఉండదు. నన్ను నేను ఎరుగక పోతే మార్పు అనేది నాకు అవగతం కానేకాదు.

నేను 'ఉన్నవాడిని ఉన్నట్లుగా' ముందు అర్థం చేసుకోవాలి. అంతేగాని 'ఉందాం' అనుకున్న విధంగా అర్థం చేసుకోవడం కాదు. నా మనసులో వున్న ఆదర్శం, గమ్యం——కేవలం కల్పితమే కదూ. నా అస్తిత్వం నాకు తెలియటానికి నాలో ఎంతో పూనిక, ఉత్సాహం. మెలుకువకావాలి.

విశ్వాసాల నుంచి సుదూరంలో వుండాలి నేను.

ఆదర్శాలనుంచి ఆమడ దూరంలో వుండాలి.

ఎందుకంటే——

ఆదర్శాలు, విశ్వాసాలు 'నేనే' అనుకుంటాను. కాని ప్రస్తుతానికి కాదు గదా.

నేను అసూయాపరుడిని. హింసావాదిని. అప్పుడు అసూయ గురించి అహింస గురించి ఆదర్శవాదంతో ఉత్తేజితుడినై మాట్లాడి ప్రయోజనం లేదు.

అందుచేత నాకు ముందుగా నిజాయితీ, స్పష్టత ఉండాలి. ఫలాయన వాదంతో ఆదర్శాలను స్తుతించడం కాకుండా నిష్కర్షగా నేను విషయాలను ఉన్నవి ఉన్నట్లుగా తెలుసుకో గలగాలి.

ఉన్నది ఉన్నట్లుగా తెలుసుకోగలగడం ఒక ప్రారంభ సుగుణం.

ఈ సుగుణం స్వేచ్ఛను తీసుకు వస్తుంది.

ఈ సుగుణంలోనే పాదుకుని పోయివుండాలి.

ఇది నేర్చుకుంటే వచ్చేది కాదు. పులుముకుంటే అంటుకునేది కాదు. సహజంగా సిద్ధించాలి.

కొత్త గురువులు—

కొత్త పద్ధతులు—

ఇలాంటివి ప్రపంచ సమస్యలను పరిష్కరిస్తాయనీ పరిహరిస్తాయనీ అనుకోలేము.

అనుక్షణము మనను మనం అవగతం చేసుకోవాలి. అనుభవాలు, స్మృతులు బరువులు మనను కృంగదీయకుండా జాగ్రత్త పడాలి.

అప్పుడు-

ప్రశాంతత, నిశ్చలత స్థావరించుకుంటాయి.

ఇవి మానసిక పరిణామాలు కాదు. ఊహాజనితమైన పరిస్థితి కాదు. కఠోర నియమాలవల్ల సాధించినదీ కాదు.

అటువంటి ప్రశాంతతలోనే సృజనశీలత వుంటుంది.

అప్పుడు యింక సమస్యలు ఎక్కడ వున్నాయి?

—అంటారు కృష్ణమూర్తి.



# ప్రచార పరిమితులు-విశ్వాసానికి విధేయతలు

జె. కృష్ణమూర్తి జీవితం గురించి, 'సత్యం' అనే అమూర్తము, అరూపము అయిన విషయాన్ని గురించి, మనుషుల మధ్య ఉండవలసిన సదవగాహన గురించి, మనిషికీ ఇతర జీవరాశులకూ నెలకొన్న ఆత్మీయత గురించి,...ఇంకా ఎన్నో ప్రధానమైన అంశాలను గురించి ప్రస్తావిస్తారు.

ఎంతో విడమరచి, విపులీకరించి చెబుతున్నాను-అని ఆయన పదే పదే చెప్పి నప్పటికీ ఈ విషయం సామాన్య జనానికి, ఆలోచనా పరులకు ఎప్పటికప్పుడు అసం దిగ్ధంగాను, వ్యాఖ్యాన పరులు లేకుండా తెలుసుకుందుకు జటిలంగాను అనిపిస్తూ వుంటుంది.

అనేకులు ఆయనను యిలా అడుగుతూ వుండేవారు:

'మీరు చెపుతున్న విషయాలు అర్థం చేసుకోవడం కష్టం. మీ బోధనలు క్షుణ్ణంగా తెలుసుకుని వాటిని యితరులకు తెలియచెప్పగలవారు కొందరు ఉన్నారు. వారు చెబుతూ వుంటే, వారి మాటలు వింటూవుంటే మీరు చెబుతున్నది మరింత స్పష్టంగా అర్థం అవుతుంది మాకు. అలాంటి మనుషులు దేశంలో నాలుగు మూలల తిరిగి మీ అభిప్రాయాలను ప్రచారం చేయడం అవసరం. ఇలాంటి ప్రచారకుల అవ సరం ఎంతయినా వుంది. కాని....మీరు మాత్రం ప్రచారం, బోధన, వ్యాఖ్యానం ఇటువంటి మాటలకు బద్ధవిరోధంగా వుంటున్నారు. వాటిని మీరు యేమాత్రం సహించలేకపోతున్నారు. మాకు సహాయంగా వుండే విశ్వాసాలను, కరదీపికలను మీరు అసహిష్ణుతతో నెట్టిపారవేస్తున్నారు.'

ఇలాంటి ప్రశ్నలకు కృష్ణమూర్తి పలు రకాలుగా సమాధానం చెబుతూ వచ్చారు.

'జనం-ఇతరులను అనుసరించడమే శ్రేయోమార్గం అనుకునేంత వరకు ఎవరో ఒకరు యిలా 'దారి చూపేవారు' అంటూ వుంటూనే వుంటారు. అయితే విషయం ఏమిటంటే ఒకరిని అనుసరించడం అనేది ఎవరికి వారు స్వతహాగా పరిశీలించి అన్వే షించి తెలుసుకోవడం అనే 'ప్రక్రియ'ను నాశనం చేస్తుంది. సృజనాత్మకతను 'లుప్తం' చేస్తుంది. నిజం అనేది ఏమిటో ఎవరికి వారు తెలుసుకోవడమే ముఖ్యం. ఎవరినో అనుసరిస్తున్నాం అంటే మనసుకు ఆ వ్యక్తే యిష్టం గాని, స్వతహాగా ఆలో చించి తెలుసుకుందామనే ధ్యాస, పూనిక లేదన్నమాట. నేను మీ మనస్సు ప్రవ ర్తించే తీరులను విశదపరుస్తున్నాను. నేను చెబుతున్న మాటలను మీరు అనుసరిస్తూ ఉన్నట్లయితే అది నన్ను అనుసరిస్తున్నట్లు కాదు. మీ మనస్సును మీరు అనుసరించి తెలుసుకుంటున్నట్లే. మీరు ఎవరినో అనుసరిస్తున్నారనుకోండి. అప్పుడు మీ మాన సిక వృత్తులను మీరు గమనించడం లేదన్నమాట. మిమ్మల్ని మీరు అర్థం చేసుకో కుండా మీరెవరినో అనుసరించడం అంటే మరింత దుఃఖాన్ని కొని తెచ్చు కోవడం!

'అనుసరించడం అంటేనే వినాశం.

అనుకరణలు ఎన్నో భయాలను తీసుకువస్తాయి.

భయంవల్లనే మీరు సత్యాన్వేషణ మార్గాల నుంచి దూరదూరంగా తొలగిపోతు న్నారు.

జీవితంలో యెన్ని దుఃఖాలు వున్నాయి, ఎన్ని క్లేశాలు వున్నాయి?

క్షణికమైన సుఖసంతోషాలు ఎన్ని వున్నాయి?

మృత్యువు అంటే ఏమిటి?

సంబంధ బాంధవ్యాలలో వున్న క్లిష్టతలు, సంకీర్ణతలు ఏమిటి?'

—వీటన్నిటికీ జవాబులు మనం యెవరినో అనుసరించినందువల్ల పొంద గలుగుతామని అనుకుంటున్నాం. అది జరగని పని.

వీటన్నిటినీ నేరుగా ప్రశ్నించి తెలుసుకుని అర్థం చేసుకోవడం- అంటే, ఇంకెవరినో అనుసరించడం మటుకు కాదు.

జీవితంలోని గందరగోళాలు, చికాకులు, చిందర వందరలు-ఇవన్నీ మనం సృష్టించుకున్నవే. మనలో ప్రతి వొక్కరం యిందుకు కారకులం. ఈ కారణం ఏమిటో మనం స్పష్టంగా తెలుసుకోవాలి మన ఆలోచనా విధానంలో యిలాంటి చిక్కులు ఎందుకు వస్తున్నాయో, అర్థం చేసుకునేందుకు ప్రయత్నించాలి-అంటారు ఆయన.

ఏ విషయాన్నీ యితరుల ద్వారా తెలుసుకోకండి. మీ అంతట మీరే ప్రయత్నం చేసుకు-అన్వేషించి- అవగాహన చేసుకోవటానికి చూడండి.

వ్యాఖ్యాన కర్తలు, భాష్యకారులు అసలు విషయానికి తమతమ అభిప్రాయా లను, పరిమితులను జోడిస్తారు. ఇంకొకరి సహాయం కోరుతున్నాం అనడం తోటే భ్రష్టత యేర్పడుతుంది. మనకు మనం స్వతహాగా అన్వేషించి తెలుసుకోగలం అనే ధీమా అంతరించిపోతుంది. మిమ్మల్ని మీరు దూరం చేసుకున్నట్లు, మీ నుంచి మీరు పారిపోతున్నట్లు అవుతుంది— పరాశ్రయం ప్రారంభం అవడం తోటే.

'నా బోధనలు ప్రచారం చేయవలసిన అవసరం లేదు.ఎందుకంటే-మిమ్మల్ని మీరు అర్థం చేసుకోకపోయినట్లయితే ఈబోధనలకు వక్రభాష్యాలు తయారు చేస్తారు. ప్రచారం చేయాలనుకున్నప్పుడు నా పుస్తకాలు కొన్ని కొని యితరులకు అంద చేస్తారు· అదంత ముఖ్యమయిన విషయం కాదనుకుంటాను. మిమ్మల్ని మీరు అర్థం చేసుకోవడం అత్యవసరంగా జరుగవలసిన పని. మీరు అర్థం చేసుకోవడం, అవ గాహన చేసుకోవడం జరిగినప్పుడు, దానిని ప్రపంచంలో ప్రచారం చేస్తారు,వ్యాపకం చేస్తారు. తద్వారా ప్రపంచంలోని మనిషికి మరింత సుఖం, సంతోషం అందచేయ గలుగుతారు. అలా కాకుండా మరెవరి బోధనలనో ప్రచారం చేయడం అంటే.... అవి నావే అయినప్పటికీ....మీరు మరింత అల్లరి, ఆగం చేస్తున్నట్టు అవుతుంది.

కేవలం ప్రచారకులుగానే మిగిలిపోతారు మీరు. ప్రచారం అనేది 'సత్యం' కాదు.

'నా అసహిష్ణుత గురించి చెప్పనివ్వండి.

సహిష్ణుత అంటే ఏమిటి అసలు?

సహించడం, సహించకపోవడం అనే వాటిని అర్థం చేసుకుందాం ముందు.

ఒక విషయం నిజం- యదార్థం అయితే దానిని సహించడం, సహించకపోవడం అనేది ఏమిటి?

యదార్థాన్ని స్వీకరిస్తే స్వీకరిస్తాం, లేకపోతే వదలివేస్తాం. అంతేగాని మన సహిష్ణుతలను ప్రదర్శిస్తూ ఢంకా బజాయించవలసిన అవసరం ఏముంది?.... ఒక్క విషయం గమనించండి. మన విశ్వాసాలలో అన్నీ.... హిందువులవి కానివ్వండి మహమ్మదీయులవి కానివ్వండి క్రిస్టియన్లవి కానివ్వండి.... ఇవన్నీ ప్రజలలో వైరుధ్యాలను శతృత్వాలకు పెంచుతున్నాయి. ప్రజలను ముఠాలుగా తయారుచేసి ఒకరికి మరొకరు వ్యతిరేకులుగా రూపొందిస్తున్నాయి. మనం మానవ మాత్రులమేగాని, పరస్పర విరుద్ధమైన విశ్వాసాల పోగులం కానక్కరలేదు. అయితే మన విశ్వాసంలో మనకు అభిరుచి, ఆసక్తి వుంది. అది మనకు లాభం చేకూరుస్తుందని అనుకుంటాం. మన సమాజాలన్నీ దాని మీదనే నిర్మాణం అయినాయి. మతాలు, పురోహితులు.... యివన్నీ దీనిలో భాగం. ఒక విశ్వాసాన్ని ప్రశ్నించాము అంటే-అదీ అసహిష్ణుత అయిపోతోంది. అయితే జీవితాన్ని, జీవితంలోని సత్యాలను గురించి గమనం పెట్టుకున్న మనిషి యిలా సహించడం సహించకపోవడం అనే విషయానికి అంత ప్రాముఖ్యం యివ్వడు.

విశ్వాసం నిజం కానక్కర్లేదు.

అదే సత్యం కానక్కర్లేదు.

మీరు భగవంతుడిని విశ్వసించవచ్చు.

మరొకరు విశ్వసించక పోవచ్చు.

మీ విశ్వాసంలో మీకెంత ప్రామాణికత వున్నదో, అతనికి అతని విశ్వాసంలో అంత గురి. మీమీ ఆలోచనలకు అనుసరణీయంగా మీరు మీ విశ్వాసాలను ఏర్పరచుకున్నారు. అంతే.

ఇంతకూ నిజం యేమిటి అని తెలుసుకోవటానికి మనస్సు స్వేచ్ఛగా వుండాలి. విశ్వాసం-అవిశ్వాసం ఈ రెంటికీ దానిలో తావు లేదు. ఈ మాటలను మీరు నవ్వుతూనే అంగీకరిస్తారు. కాని మీ మీ జీవన వ్యవహారాలలో ఏదయినా నిర్ణయం తీసుకు తీరాల్సిన అవసరం వచ్చినప్పుడు విశ్వాసాల వల్ల అనుకూలతలు వున్నాయి గనుక వాటి వెనుకనే పరుగులు తీస్తారు. వాటిలో భద్రత, గౌరవం వున్నా

యని మీ అభిప్రాయం. అవిశ్వాసం ప్రకటిస్తే మీ ఉద్యోగం ఊడిపోవచ్చు. మీరు ఏమీ "అస్తిత్వం" లేని మనిషిగా తయారయిపోవచ్చు. విశ్వాసం అనే దాని నుండి స్వేచ్ఛగా, రికామీగా వుండడమే ముఖ్యమైన విషయం. అంతేగాని ఈ గదిలో వున్న కాస్సేపు అంగీకరిస్తున్నట్లుగా చిద్విలాసం కనపరచడం కాదు.

కృష్ణమూర్తి దేనికీ అధికప్రాధాన్యత ఇవ్వరు- వ్యక్తిగతంగా స్వయంగా పరిశీలించి తెలుసుకోవటానికి తప్ప. ప్రతిదాన్నీ దాని నుంచి దూరంగా వుండి గమనించి, శ్రద్ధగా తర్కించుకుని, 'ఉన్నది ఉన్నట్లుగా'చూచుకోవడం ముఖ్యం. అంతేగాని ప్రచారం- ప్రచారకులు- వ్యాఖ్యానాలు- భాష్యకారులు- ఇవన్నీ 'మెలుకువ' తీసుకురావు; రాలేవు.

—o—

# ప్రసంగ రంగం

జె. కృష్ణమూర్తి 1910లో తమ మొదటి పుస్తకం వ్రాశారు. ఇది ఇంగ్లీషులో. At the Feet of The Master దానిపేరు(దీని వివరాలు కావాలనుకున్న వారు "విశ్వతత్త్వవేత్త–జిడ్డు కృష్ణమూర్తి" తత్త్వదర్శనం అనే మా పూర్వ గ్రంథం చూడవచ్చును.)

ఈ పుస్తకంలో అంశాలను గురించి, తన చుట్టూ చేరిన వారితో 'ప్రసంగాలు' చేస్తూ భాషణ కార్యక్రమం ప్రారంభం అయింది: 1911–12 సంవత్సరాల లోనే.

అప్పటి నుండి–

పదులు, వందలు, వేలు సంఖ్యలో శ్రోతలను ఉద్దేశించి ప్రసంగాలు చేయడం ఆరంభం అయింది.

'తారక సంస్థ' ఆధ్వర్యంలో జరిగిన సభలను కృష్ణమూర్తి ప్రసంగాలు ఎంతగానో ఆకట్టుకునేవి: శ్రోతలను ఉత్తేజితులను చేసేవి.

ఈ సంస్థ 'రద్దు' అయిన తరువాత–కొన్నాళ్ళు ఆయన ప్రసంగాలు ఇవ్వడం నిలిపి వేశారు.

తరువాత– ప్రసంగ రంగాన్ని తిరిగి ప్రారంభం చేసిన వెనుక, ప్రతి సంవత్సరం యూరపు, అమెరికా, ఆసియాలలో నియమిత ప్రాంతాలలో ఉపన్యాసాలు ఇవ్వడం జరిగింది.

ఉపన్యాస కార్యక్రమాలను ఏర్పాటు చేయడం ప్రధాన కర్తవ్యంగా 'ఫౌండేషన్లు' స్థాపించుకున్నారు కూడా. 1986 జనవరి వరకు ప్రసంగ రంగం నిరవధికంగా నడిచింది.

ఆయన ప్రసంగ సభలకు ఒక ప్రత్యేకత వుంది.

తాను ఏర్పాటు చేసిన సభలలోనే ఆయన ప్రసంగిస్తారు.

(ఇతర సంస్థలు ఏర్పరచిన సభలు- ఏమూడో, నాలుగో మాత్రమే- ఆయన ప్రత్యేక సందర్భాలను అనుసరించి ప్రసంగించారు.)

ఆయన సభలకు అధ్యక్షుడు,వందన సమర్పణం వంటి లాంఛనాలు ఉండవు. నియమిత సమయానికి వారు వేదిక దగ్గరకు నడిచి వస్తారు.సుఖాసీనులు అవుతారు. వాతావరణం తయారు చేసుకుంటారు· ప్రసంగం సాగిస్తారు.

నేరుగా శ్రోతలతో, ప్రేక్షకులతో తాదాత్మ్యం అవడమే ఆయన పద్ధతి.

'మన మందరము సహపథికులం....

'కలిసి అన్వేషణ చేస్తున్నాం....

'నాతో పాటు ప్రయాణం చేస్తున్నారు గదూ....

అని మధ్య మధ్య వినేవాళ్ళకు గుర్తుచేస్తూ వుండడం వారికి అలవాటు.

అన్ని ప్రసంగాలు సంవత్సరాంతంలో ఒక పుస్తకంగా తయారయి వచ్చేవి. అవసరాన్నిబట్టి రెండు మూడు పుస్తకాలుగా విభాగం గూడా జరిగేది, సంవత్సర ప్రసంగ పాఠాలు.

ఇవి ప్రసంగాల Verbatim Reports. ప్రాథమికంగా యీ ఉపన్యాసాలు విన్నవారికి సహాయకారి అవడం కోసం ఉద్దేశించినవి.అయినా వినని వారూ ఈ పుస్తకాలు సంపాదించి చదువుకునేవారు.

ప్రసంగాలు కాక, కేవలం పుస్తకాలుగా వ్రాసినవి కొన్ని వున్నాయి. The Collected Writings of J. Krishnamurti పేరుతో యివన్నీ ముద్రణ పొందినాయి·

ప్రసంగాలు ఆడియో, వీడియో టేపులుగాను దొరుకుతాయి చాల వరకు.

Mary Lutyens చేత తన జీవిత చరిత్ర సమగ్రంగా వ్రాయించుకున్నారు: ప్రసంగాలను రచనలను Edit చేయించి ప్రత్యేక పుస్తకాలుగా తయారు చేయించారు కూడా.

ఇదంతా తన బోధనలు చదువరులకు- ముందు తరాలవారికి- యథాతథంగా అందాలనే సంకల్పంతో చేశారు ఆయన. తాను ఏం చెప్పారు అనే విషయములో యే మాత్రం సంశయం, సందిగ్ధం లేకుండా వుండేందుకు తగిన జాగ్రత్తలు పడ్డారు.

ముందు ముందు భాష్యాలు- వ్యాఖ్యానాలు వచ్చినా, అవి సరైనవి అయినా కాకపోయినా వారు ఏం చెప్పారు అనే విషయంలో వాద ప్రతివాదాలకు తావు లేదు.

వారి ప్రసంగాలలో, పుస్తకాలలో మరో విశేషం ఏమిటంటే తత్త్వశాస్త్రం వేదాంతశాస్త్రాల పరిధిలోని పడికట్టుమాటలు కనిపించవు. విషయం వినరమే వుంటుందిగాని, పదాల ఆడంబరం వుండదు.

తాను తరుచుగా ఉపయోగించిన మాటలకు (ఉదా: Conditioning, Attention, Awareness Religious Mind) యే అర్థాన్ని-భావాన్ని ఉద్దేశిస్తున్నారో స్పష్టంగా చెప్పారు.

దాదావు ప్రతిమారూ ప్రసంగం అయిన తరువాత రెండు మూడు ప్రశ్నలు అందుకుని వాటికి సమాధానాలు సమకూర్చేవారు. ప్రత్యేకంగా ప్రశ్నలు- సంభాషణలు- చర్చలకు వేరుగా సమావేశాలు వుండేవి కూడా.

ప్రతి సంవత్సరము ప్రతి సమావేశ స్థలంలోను ఆయన ఒకే 'మూల విషయాలను' ప్రస్తావించి ప్రసంగించినట్లు కనిపిస్తుంది. అందుచేతనే, ఒక 'ప్రసంగ సంచిక' చదివితే కృష్ణమూర్తి తత్త్వదర్శనం ఏమిటో చూచాయగా అవగాహన చేసుకోవటానికి అవకాశం వుంది. అంతమాత్రంచేత, అన్ని ప్రసంగాలు, ఉపన్యాసాలు కేవలం అదే విషయాన్ని పునశ్చరణ చేస్తున్నాయని అనుకోవటానికి వీలులేదు ఏ ప్రసంగానికి ఆ ప్రసంగం, ఏ మాలికకు ఆ మాలిక వినూత్నంగా విశేషంగా కొత్త సంగతులను తెలివిడిచేస్తుంది. అనేక వరుసలలో వలయాకారంగా తిరిగి గిరిశిఖరాన్ని చేరుకున్నట్లు అనిపిస్తుంది. ఎప్పటికప్పుడు అదే విషయానికి వస్తున్నామా అనుకున్నా, ప్రతిమారూ కొంత ఎత్తునుంచి చూస్తున్నాముసుమా- అనే స్పృహ కలుగుతుంది.

సామాన్యంగా ప్రస్తావనకు వచ్చే మొదటి విషయాలు ఇలా వుంటాయి.

ప్రపంచం చిన్నాభిన్నంగా వుంది. అల్లకల్లోలం పెరిగి పోతోంది, హింస, దౌర్జన్యం విస్తరిస్తున్నాయి. దీని కంతటికీ ఎవరో బాధ్యులని ప్రతి వారూ అనుకుంటున్నారు. కాని మనమందరమూ కలిసి కట్టుగా బాధ్యులం. ఈ అతలాకుతలం అంతా మనసృష్టే మనమే బాధ్యులం అన్నసంగతి ముందు స్పష్టంగా గుర్తించాలి. గుర్తించిన తరువాత, తగిన రీతిని 'మార్పు' తెచ్చుకోవాలి.ముందుగా మనలో, మన ప్రకృతిలో, జీవితాన్ని, మృత్యువును వేరు వేయగా చూడనవసరంలేదు. ప్రతిక్షణము గతానికి విస్మృతి కలిగిస్తూ నిత్యనూతనంగా భాసిల్లాలి. మానసిక వాతావరణాన్ని

చక్కగా నిజాయితీగా పరిశీలించుకోగలగాలి. కొత్తరకం మనస్సు, తద్వారా కొత్త రకం మానవాళి రూపొందాలి.

ఈ రకంగా చూచినప్పుడు కృష్ణమూర్తి వేదాంతిగానూ, తత్త్వదర్శకుడుగాను కాకుండా సామాజిక శాస్త్రవేత్త (Social Scientist)గా కనిపిస్తారు. ఆయన సమాజంలో అన్ని అంశాలు సముగ్రంగా సమున్నతంగా వుంటాయి, జీవితము, మతము, ఆలోచన, వైఖరి, సంవిధానము అంతా సమరసంగా రూపొంది ఏకత్వాన్ని ఉపాసిస్తుంది.

ఆయినకు యే LABELS వేయకుండా, ముద్రలు తగిలించకుండా కేవలం ఒక ఆలోచనాపరుడు, నిరంతర సత్యాన్వేషిగా చూడడమే శ్రేయస్కరం.

మరణానంతరం మనస్సు యేమయి పోతుంది? యిది అందరికీ సమాధానం దొరకని ప్రశ్న. అంటే సమాధానాలు లేవని కాదు. తత్త్వశాస్త్రం, విజ్ఞాన శాస్త్రం ఎన్నో రకాలుగా జవాబులు చెప్పనే చెప్పాయి. అయినా ఆ జవాబులు అర్థం కావు; మనస్సుకు రుచించవు; చాలవు.

ఇంకా యేదో తెలుసుకోవాలనే తపన ప్రతి మనస్సుకూ వుంటుంది. ఈ ప్రశ్న కేవలం కుతూహలం కొద్దీ వేయవచ్చును; ఆసక్తితో విషయ పరిజ్ఞానం కోసం వేయవచ్చును.

శరీరం, మనస్సు—అవి రెండూన్నీయేదో వేరైన పదార్థాలు అయినట్లు, తతిమ్మా సృష్టితో వాటికి యేమీ సంబంధం లేనట్లు అనుకుంటాం ముందు—ఈ ప్రశ్న వినగానే కృష్ణమూర్తి సమాధాన సరణి చూచిన తరువాత ఈ చొప్పదంటు ప్రశ్నకు యింత మతలబు వుందా? ఇదంతా తప్పనిసరిగా యెలాగో ఆలోచించ వలసిన విషయమేనే-అనిపిస్తుంది,

ఆయన ఈ ప్రశ్నను అర్థం చేసుకునే పద్ధతి గమనించండి.

శరీరాన్ని మనస్సును ఎందుకు విడదీస్తారు? శరీరం లేకుండా మనస్సు విడిగా వుందా? మానసిక వివరణల పరంగా యిటువంటి విభజన సాధ్యమేనా?

'చూడండి. ముందు ఒక విషయం గమనించండి.

'మీరు ఈ దేశంలో పుట్టి పెరిగారు. హిందువుగానో, ముస్లింగానో, క్రిస్టియన్‌గానో ఆ కుటుంబంలో పుట్టారు. ఇంకా ఎన్నో మతశాఖలు, సాంస్కృతిక విభాగాలు వున్నాయి, మీరు వీటిలో-అసంఖ్యాక మయిన వాటిలో-దేనికో ఒక దానికి చేరివున్నారు. మీరు నివసిస్తున్న ఈ సమాజం, ఈ సంఘం మీ మానసిక వ్యవస్థను నిబద్ధితం [Conditioning] చేస్తోంది. ఈ సంఘం, సమాజం యిదంతా మీరే. మీరు సృష్టించిందే ఈ సమాజం. మీ నుండి భిన్నమయినది కాదు. మీరు, మీ తల్లి

దర్శ్రుడులు దీనిని నిర్మించారు. మీ పూర్వీకులందరూ దీనిని తయారు చేశారు. ఈ సంస్కృతిలో మీరు భాగం. ఇప్పుడు దీని నుంచి 'నేను వేరు' అని మీరు అనుకో గలరా? మీరు దీనితో భాగం కాకపోతేనే, దీని నుంచి వైదొలగడానికి, విడివడటానికి వీలవుతుంది. అంతే కదూ? తేలికగానే వుంది గదూ! అలాగే, మీరు విడివడాలని ఎందుకు అనుకుంటున్నారు? నేను ఈ ప్రశ్న అడగడం లేదు. అయినా మనం దీని లోతులను తరిచి చూద్దాం, శరీరాన్ని మనస్సునీ ఎందుకు విడివిడిగా చూస్తున్నారు? ఎందుకంటే-కొన్ని కొన్ని మాటలు మీరు విని వున్నారు: ఆత్మ, ఊర్ధ్వమనస్సు, జీవాత్మ....అని. వీటిని గురించి మీకు ఏమీ తెలియదు గదూ. తెలుసునా లేక ఊరికే వినికిడి మాటలను వల్లె వేస్తున్నారా? ఇతరులు చెప్పిన విషయాలు నిజమేనని మీకు ఎలా రూఢి? ఎవరు చెప్పారు అనేది కాదు ప్రశ్న. మీకు తెలుసునా లేదా అనే. కనుక, ఎందుకు అలా అంగీకరిస్తారు?

'ఇప్పుడు-మనస్సు ఈ శరీరం అంతటిలోనూ ఒక భాగమేనా కాదా అన్న విషయం కనుగొనడానికి-అతి స్పష్టంగా సునిశితంగా చూడగల ఒక మనస్సు ఉండాలి. దానిలో ఎలాంటి వక్రతలు వుండగూడదు. ఎలాంటి గందరగోళాలు వుండరాదు. దేనికో కట్టుబడిన మనస్సు కాదు అది. ఇటువంటి కట్టుబాటులు, సరి పోల్చుకోవటాలు యివన్నీ పనికిరావు. కట్టుబాటు లేకుండా బతకడం అంటే యితర లతో సరిపోల్చుకోకుండా బతకడం అన్నమాటే. నిన్నటి మీ పరిస్థితితో, రేపు జరుగ బోయే దానితో, మరో శ్రీమంతుడితో, కడు పేదవానితో, సాధుపుంగవునితో, మీ నాయకులతో, ఆదర్శాలతో సరిపోల్చుకుంటూ వుంటారు మీరు. అంటే యేమన్న మాట?ఏదో కొలబద్ద పెట్టుకుని,దానితో మిమ్మల్ని మీరు కొలుచుకుంటూ ఉంటారు. ఏలాంటి సరిపోల్చు కోవటాలు లేకుండా వుండడం ఎలా వుంటుందో గమనించండి. అప్పుడు మీకు స్వేచ్ఛ వున్నట్లు. మనస్సు తన నిబద్ధతల నుండి బయట పడి పోయినట్లే.

'తత్త్వ దర్శనంలో ప్రధానమయిన ప్రశ్న శరీరము-మనస్సు వేరువేరేనా, కావా అనేది అంటారు మీరు నాకు తత్త్వదర్శనాలు లేవు. నాకు అభిప్రాయాలు లేవు. అయినాసరే,ఏదో కొంత వెలుగు ఈ ప్రశ్నమీద ప్రసరించండి అంటారు మీరు.

'అలాగే వెలుగు ప్రసరిస్తుంది. కాని మీరు శ్రద్ధగా ఆలకించగలగాలి. ఇలాంటి విషయాలలో యదార్థాన్ని, సత్యాన్ని గుర్తించగలగాలంటే మనం మరెవ రినో అనుసరించడం మార్గంకాదు. తత్త్వ దర్శనం అంటే యేమిటి? సత్యాన్ని ప్రేమించడం కదూ? సిద్ధాంతాలను, ఊహాపోహలను, నమ్మకాలను ప్రేమించడం కాదు. నిజంగా సత్యాన్ని ప్రేమించడమే తత్త్వదర్శనం. ఈ సత్యం అనేది మీ సొత్తూ కాదు, నా సొత్తు కాదు. అందుచేత మీరు మరెవరినీ అనుసరించడం కుధర్మం.

ఈ మూల విషయాన్ని మీరు గమనించ గలిగినప్పుడు—సత్యాన్ని యితరుల ద్వారా తెలుసుకుంటాం అనేది అపోహ మటుకేనని మీకు తెలిసి వస్తుంది. దానిని చూడటానికి మనకు కనులు వుండాలి. ఎండిపోయిన ఆ ఆకు పొదలలో సత్యం వుండ వచ్చును-దానిని మనం జాగ్రత్తగా చూడగలగాలి. దానిని గురించి అభిప్రాయాలు చెప్పడం-యివ్వడం—అపహాస్యమైన ధోరణి. తెలివి తక్కువ వాళ్లు మటుకే అభిప్రాయాలు యివ్వగలుగుతారు. మనం అభిప్రాయాలతో వ్యవహరించడం లేదు. మనకు యదార్థం కావాలి. అదేమిటి? మనస్సుకు ఒక లక్షణం వున్నదా-ఒక ఆంతరికత వున్నదా....దానిని బాహ్య పరిస్థితులు స్పర్శించకుండా వుండగల స్థితి వున్నదా ఈ ప్రశ్న మీకు అర్థమవుతోందా? ఇదే ప్రశ్నమీరు అడుగుతూ వున్నది. మనస్సు శరీరం కంటే భిన్నమయినదా? క్షుల్లకము, జాతీయము, మతైకము అయిన పరిమితుల నుండి మనస్సు స్వతంత్రంగా వుండగలదా....అని అడుగుతున్నారు. దీనికి సమాధానం కనుగొనటానికి మీకు అసాధారణ జాగరూకత, పరిశీలనాత్మకత అవసరం. మీరు జాగరూకులు కావాలి; సునిశితులు అవాలి. వివేక వంతులు అవాలన్నమాట. అప్పుడు ఈ ప్రశ్నకోపలకు ప్రగాఢంగా వెళ్ళ గలిగి, ఆలోచన వల్ల గతం వల్ల ఎప్పటికీ స్పర్శింపబడనిది యేదో వున్నదన్న విషయం గమనించ గలుగుతారు.

'ఆలోచన కూడా వస్తువుమట్టుకే' అన్న విషయం మీరు ఎరుగుదురు. జ్ఞాపకాలకు ఫలితమే-పరిణామమే ఆలోచన. జ్ఞాపకాలు మెదడులో వున్నాయి. మెదడు వస్తువు. మెదడులోని కణాలు బహు సునిశితమైనవి అయితే తప్ప-పరమ ప్రశాంతత పొందినవి అయితే తప్ప మీరు ఈ విషయం గమనించలేరు. అంతేగాని, కేవలం మాటలతో 'యిది యిలాగు, అది అలాగు' అని చెప్పడంలో ఎంతమాత్రం అర్థం లేదు.దీనిని స్వయంగా కనుగొనటానికి, దీని కోసం జీవితం అంతా సమర్పణ చేయటానికి-సంపాదన కోసం సమయమంతా ఖర్చు చేస్తున్నట్లే-తయారు కావాలి. దీనికి ఎంతో శక్తి, తేజస్సు అవసరం. తెలుసుకోవాలనే తీవ్రమైన ఆకాంక్ష కావాలి. మీరు యితరుల కొళాయిల వద్ద దప్పిక తీర్చు కుంటున్నారు. ఎండిపోయినాయి అవన్నీ. మీకు మీరే వెలుగు అవగలగాలి.

'ఆత్మదీపోభవ' అనేది ఒక సూక్తి; చాలా కాలంగా ప్రచారంలో వున్నదే. దీనిని యీ కోణం నుంచి పరిశీలించి అర్థం చేసుకోగలగాలి.

పరిణామం అనే ప్రక్రియ ఒకటి ప్రకృతిలో, సృష్టిలో నడుస్తూ వుంది. దీనిని నమ్మేవాళ్ళు కొందరు, నమ్మనివాళ్ళు మరి కొందరు. మీరు పరిణామ ప్రక్రియను నమ్ముతారా? అంగీకరిస్తారా....అని ఒకరు కృష్ణమూర్తిని అడిగినప్పుడు ఆయన సమాధాన సరళి ఎలా వుండింవో గమనించండి:

'ఎద్దుబండి నుంచి జెట్ విమానం వరకూ వచ్చాము. ఇది పరిణామమే. అలాగే చంద్రగోళానికి వెళ్ళడమూ పరిణామమే.

'నేను' పరిణమిస్తున్నానా లేదా అనేది ప్రశ్న.

దీనికి ముందు 'నేను' అంటే ఏమిటో అర్థం చేసుకోవాలి.

నేను పరిణమిస్తున్నాను, అనుకోవడం కంటె, నేను అంటే ఏమిటో తెలుసుకోవడం ముఖ్యం. ఈ మూల విషయాన్ని స్పర్శించకుండా పరిణమిస్తున్నానా లేదా అని అడగడం అర్థరహితం.

'నేను' అనే దానిలో మీ యిల్లు, యింటిలోని సరంజామా, మీ జ్ఞాపకాలు, మీరు పోగుచేసుకున్న విషయం సంచయ, మీ పుస్తకాలు, సుఖస్మృతులు, బాధలు, భయాలు—యిలా 'నేను' అనేది ఎన్నో విషయాలతో కట్టగట్టుకుని వుంది. నేను కాకుండా యింకేదయినా వున్నదా? దీనిలోనే మానసికత, ఆధ్యాత్మికత వున్నాయంటారు మీరు. ఇదంతా మీకు యెలా ఎరుక? ఆలోచన కనిపెట్టిన సంగతా అది? ఆలోచన యిటువంటి విషయాలను బయట పడవేస్తూ వుంటుందా అనే సంగతిని గమనించాలి మీరు. దేనినీ ప్రశ్నించుకోకుండా అంగీకరించకండి, మిమ్మల్ని మీరు కూడా—సత్యాన్ని తెలుసుకోవటానికి మనస్సు అతి స్వేచ్ఛగా జాగరూకంగా వుండాలి. మనస్సులో ఊర్ధ్వభాగం ఒకటి, అధోభాగం ఒకటి ఇలా ద్వంద్వ ప్రవృత్తిని కూడా తయారు చేసుకున్నాం. అందుచేత పరిణామం అంటూ వున్నదా అన్న విషయం మీరే కనిపెట్టాలి.

పరిణామం కళ్ళకు కనిపిస్తూనే వుంది. శారీరకంగా ఎదురుగా కనిపిస్తోంది. అయితే మనం మానసిక పరిణామాన్ని గురించి ఆలోచిస్తున్నాము. ఆంతరిక పరిణతి గురించి యోచిస్తున్నాము. 'నిరంతరము యేదో అవటానికి ప్రయత్నం చేస్తూ వున్నది' యేమిటో తెలుసుకోవటానికి ప్రయత్నం చేయాలి.

ప్రతి వస్తువునూ ముక్కలు ముక్కలుగా చేసి చూడడం మనకు అలవాటయిపోయింది. అలా కాకుండా అఖండంగా [UNFRAGMENTED] చూడడం అలవరచుకోవాలి—అంటారు కృష్ణమూర్తి.

నాకేమీ తెలియదు, తెలుసుకోవటానికి ప్రయత్నం చేస్తున్నాను—అనే భూమిక నుంచే ప్రయత్నం ప్రారంభం కావాలి అంటారు.

నిజంగా సుందరము, ఆహ్లాదకరము అయిన జీవన విధానం వుంది. దానిని తెలుసుకోవాలని మనకు ఉత్సుకత లేదా?

ఇలాంటి ఉత్సుకత వుంటే-మనం చేయవలసిన పని, అన్ని నినాదాలు పక్కన పెట్టి, యితరులు చెప్పినారన్న మాటలు గట్టున పెట్టి....తెలుసుకుందుకు స్వయానా ప్రయత్నం ఆరంభించాలి.

ఇందుకు ఎంతో శక్తి [ENERGY] అవసరం.

అల్పవిషయాల మీద శక్తి యుక్తులను వృధా చేసుకోకుండా, మన శక్తి సంపద అంతటినీ కూడగట్టుకొని యిందుకు వినియోగించాలి.

కృష్ణమూర్తి ప్రసంగరంగం ఇందుకు ఉపయుక్తం అవుతుంది.

ఈ ప్రకరణం మొదట్లో సూచించినట్లు [AT THE FEET OF THE MASTER అనేది కృష్ణమూర్తి మొదటి పుస్తకం; మొదటి ప్రసంగ పాఠం. మొదటి మెట్టే ఆఖరు మెట్టు కూడా అని ఆయన విశ్వసించినట్లే, ఈ పుస్తకంలోని విషయాలు ప్రాతిపదికగా జీవన దర్శనాన్ని దర్పణ ప్రాయంగా చూపటానికి ప్రయత్నించారు, తరువాతి తమ ప్రసంగ జీవితయానం చివరి వరకూ

మూల విషయాలు, సిద్ధాంతాలు, ఆలోచనలు, అనుసరణరీతులు ఆ పుస్తకంలో చూపినవే, సూచించినవే. దీనికే జీవన విస్తారం, మహావృక్ష నిర్మాణం ఆయన తదుపరి జీవిత పరిశ్రమ అంతా. కాకపోతే చెప్పే పద్ధతిలో మరింత సూటితనం, సున్నితత్వం కనిపిస్తాయి కాలానుగుణంగా.

జీవితాన్ని 'నీతి, పుస్తకంగా మటుకే చూడకుండా, నీతి జీవితాన్నంతటినీ ఆశ్రయించుకు వుండే పద్ధతులలో ప్రసార యోగ్యత కలిగించడం కోసం, నవ సమాజ నిర్మాణంలో నూతన తేజస్సులో దివ్యత్వాన్ని పుణికి పుచ్చుకు నడిచే కొత్త మనిషి కోసం ఆయన పరిశ్రమించారు.

....o....

# అవతార కథనం

ప్రపంచాన్ని ఉద్ధరించడం కోసం భగవంతుడో, ఆయన అనుయాయులో ఎవరో ఒకరు భూమిమీద అవతరించడం అన్ని దేశాల సంప్రదాయాలలోను విరివిగా ప్రచారం అయిన ఒక నమ్మకం. ఈ నమ్మకాన్ని స్వప్రయోజనం కోసమో స్వార్థ లబ్ధి కోసమో ఉపయోగించుకునే చాకచక్యం వున్న వ్యక్తులను, సంస్థలను అందరూ ఎరుగుదురు. సాధారణంగా ఇలాంటి విషయాలలో ఎవరూ చొరవగా ప్రతిఘటించరు, కాదనరు. ఏ పుట్టలో ఏ పాముందో అనే సందేహంతోనో భయంతోనో మిన్నకుండి పోతారు.

ధర్మానికి గ్లాని జరిగినప్పుడు, దానిని మళ్ళీ సంస్థాపన చేయవలసి వచ్చినప్పుడూ భగవంతుడు అవతరిస్తూ వుంటాడు. భూమి మీద—అని భగవద్గీత శ్లోకం వల్లెవేస్తూ వుంటారు మన దేశంలో. విష్ణువు అవతరాలను గురించి, 'స్థితి'కి మూల పురుషుడు ఆయన గనుక—ఆయనే తరుచుగా అవతరిస్తూ వుండడం గురించి సిద్ధాంతాలు ప్రచారంలో వున్నాయి.

గౌతమ బుద్ధుడు, కల్కి యిటువంటివి విష్ణు అవతరాలుగానూ ప్రసిద్ధి. నమ్మదలుచుకున్న వాళ్ళకు ఎన్నయినా తార్కాణాలు, ఉపపత్తులు వుంటాయి. నమ్మ దలుచుకోని వాళ్ళకు ఆ తార్కాణాలు, ఉపపత్తులే అర్థవిహీనంగా కనిపిస్తాయి. ఇంతకూ విషయం యేమంటే—అవతారాల సిద్ధాంతం నిజమా కాదా అన్న సంగతి నిర్ధారణగా ఎవరూ చెప్పకపోయినా దీని వెనకాల ఒక తార్కికమైన సంబద్ధత వున్నట్లుగా ఋజువు చేయడం అంతకష్టమైన పనికాదు. ప్రపంచానికి మంచిచేయడం కోసం వచ్చిన మత పురుషులు, సాంఘిక సంస్కర్తలు అందరూ అవతార పురుషులే;కారణ జన్ములే. కారణం లేకుండా ఏపనీ జరగదు గనుక ప్రతి మనిషి కారణ జన్ముడే అనుకోవడం ఒక పద్ధతి. ఆ కారణం లోకశ్రేయస్సు కోసం అని చూపించ గలిగినప్పుడు ఈ సిద్ధాంతం మరింత మనోరంజకంగా తయారవుతుంది. బుద్ధుడు, క్రీస్తు. మత—తత్త్వ దర్శనాలకు సంబంధించిన ఆధునిక అవతరాలుగా ప్రచారం. బుద్ధుడు మళ్ళీ అవతరిస్తాడనీ, క్రీస్తు మళ్ళీ పుడతాడనీ ఆశించడం అంతకూ తగిన 'ధర్మగ్లాని' ఏర్పడింది సుమా—అని గమనానికి తీసుకురావడం మరో పద్ధతి.

ప్రపంచానికి మంచి జరగడం కోసం ఎవరో వస్తారు–ఏదో చేస్తారు; వారి దగ్గర 'మంత్రదండ' వుంటుంది. దానితో పరిస్థితులన్నీ సరిచేస్తారు—అనుకోవడం జనానికి అలవాటు అయిపోయింది. అలా కాకుండా ఎవరికి వారు సంఘజీవనం

నుంచి వ్యక్తి జీవనాన్ని ఉన్నతం చేసి పదుగురికి పనికివచ్చే మంచి పనులు చేయడం, మంచి సలహాలు యివ్వడం అనే ప్రక్రియ కూడా ప్రపంచంలో అలవాటు చేయవలసిన అవసరం వచ్చినట్లు కనిపిస్తోంది. అందుకనే సమాజం కంటె వ్యక్తి ప్రధానం; వ్యక్తి వికాసం కోసం సమాజం యేర్పడింది; వ్యక్తి అవిరళ కృషి వల్లనే సమాజశ్రేయస్సు ఒనగూడుతుంది అనే అభిప్రాయాలు ప్రచారం అవుతూ వచ్చాయి.

'నేను అవతరిస్తాను!' అంటే కేవలం భగవంతుడే సాక్షాత్తు దిగివస్తాడు అని జనం నమ్ముతూ వచ్చారు సమాజ శ్రేయస్సు కోసం కృషి చేసిన మహామహులను 'సాక్షాత్తు భగవంతుడే' అని వర్ణించారు. భగవంతుడు ఒక మూర్తిమంతమయిన రూపం కాదు, ఒక తత్త్వం— సిద్ధాంతానికి రూపకల్పన మటుకే అన్న అభిప్రాయాలు కూడా ప్రచారంలోనికి వచ్చిన తరువాత యీ అవతార ప్రసక్తి కూడా విస్తృతరూపం పొందవలసి వచ్చింది. భగవంతుడినంటూ ఒక మనిషి అవతరించ వలసిన అవసరం లేదు; ఆ తత్త్వం తాలూకు 'సందేశకుడు' (Messenger), లేక ప్రతినిధి [Reprseentative] వచ్చి పని చేయవచ్చును—అనుకున్నారు అలాగే పదిమంది శ్రేయోభిలాషులు కలిసిన ఒక సంఘం యీ పనిచేయవచ్చుననుకున్నారు. ఇలా అవతార ప్రసక్తి బహురూపాంతరాలు పొందింది. ఏమయినా కనిపిస్తున్న ప్రపంచ తత్త్వం కంటె మిన్న అయిన భగవత్ తత్త్వం —అదృశ్యరూపంలో వున్నప్పటికీ ...రక రకాలుగా ప్రపంచంలో వ్యక్తం అవడం సంభవం అనే అభిప్రాయం గూడుకట్టుకు పోయింది.

దివ్యజ్ఞాన సమాజం అనిబెసెంట్ అధ్యక్ష కాలంలో యిటువంటి అవతార రూపకల్పన వంటి ప్రక్రియ ఒకటి జరిగింది సమాజానికి సంబంధించిన ప్రసక్తి కాకుండా, బెసెంట్ తదితర నాయకులు "జగద్గురువు [World Teacher] అవతరణ జరిగే సమయం ఆసన్నమవుతోంది. దీనికి మనమందరమూ—ప్రపంచ శ్రేయస్సు, పురోగమనము కోరుకుంటున్నవాళ్ళం —కృషి చేయవలె, సంసిద్ధత కూర్చవలె-" అన్న అభిప్రాయాలు ప్రచారం చేయసాగారు. గమనించవలసిన విషయం యేమంటే-యిది దివ్యజ్ఞాన సమాజ కార్యకలాపం, నియమావళికి లోబడిన వ్యవహారం కాదు. ఆ సమాజ నాయకుల వ్యక్తిగత అభిప్రాయం, ఆలోచన మటుకే. వీటిని అనుసరించి వారు పనిచేయడంవల్ల -వారు నాయకులు కనుక, ఆ రూపకల్పన అంతా దివ్యజ్ఞాన సమాజ కార్యకలాపం'గా ప్రపంచానికి అగుపిస్తూ వచ్చింది. నిజానికి సమాజ నిర్ణయాలకు నిర్దేశాలకు యీ వ్యవహారంతో ఎంతమాత్రం నిమిత్తం లేదు.

'The Return of the Christ' అనేది పాశ్చాత్య ప్రపంచంలో ఒక సంప్రదాయ సరళి. ప్రాచ్య దేశాలలో అవతార ప్రసక్తిని పోలి వుంటుంది ఖుధి.

ప్రపంచానికి అవసరం అయిన జ్ఞానాన్ని ఎప్పటి కప్పుడు తగిన రీతిని అందించే 'బోధిసత్త్వుడు—మైత్రేయుడు' మున్నగు బిరుదులతో ప్రఖ్యాతమైన తత్త్వం తిరిగి భూమి మీద అవతరించటానికి తగిన శరీరాన్ని —మనిషిని తయారు చేయాలి అనే పూనిక అనీబెసెంట్‌కు ఆమె అనుయాయుడు సి-దబ్ల్యు. లెడ్‌బీటర్‌కు కలిగింది. బోధిసత్త్వున్ని తత్త్వం అవతరించటానికి దానిని తట్టుకోగల 'పవిత్ర దేహం' తయారుచేసి వుంచడం గురించి వారిద్దరూ ప్రపంచవ్యాప్తంగా ప్రసంగించడమే కాకుండా, ఇందుకు తగినవారు —బాలురు-ఎవరా అని వెదుకడం కూడా మొదలెట్టారు. ఈ అన్వేషణలో కనీసం అయిదు, ఆరుగురిని ఎన్నిక చేయడం— ఆ Short List నుంచి 'కృష్ణమూర్తి'ని యితడే జగద్గురువును తన శరీరంలో ఆవాహన చేసుకు నిలుపుకోగల ధీరసముడు అని ప్రకటించడం జరిగింది. ఇంతకు ముందు చెప్పినట్లుగా యీ కార్యకలాపం ప్రారంభం అవడంతో టీ 'తారకసంస్థ' అనే ఒక కొత్త సమాజాన్ని స్థాపించి, దివ్యజ్ఞాన సమాజానికి యీ వ్యవహార వివరాలకు ఏమీ సంబంధం—Official Connection—లేకుండా జాగ్రత్త పడింది అనీబెసెంట్. కాకపోతే ఆ సంస్థకూ యీ సంస్థకూ నాయకులు, ప్రచారకులు, సమాజికులు దాదాపు ఒకరే అవడంవల్ల యీ రెండు సంస్థల చరిత్ర, ప్రజల మనస్సులలో వీటి అస్తిత్వం 'ఒక్కటే సుమా!' అన్నంత ఓతపోతంగా [Inter Penetrating] కలిసి పోయాయి ఈ విషయం యీ సమాజాల చరిత్రలను పరిశీలిస్తున్నప్పుడు తప్పని సరిగా మనసులో వుంచుకోవాలి. అలా కాకపోతే అనేక విరూలకు వక్రతలకు ఆస్కారం యేర్పడుతుంది.

ఇంతకూ కృష్ణమూర్తిని ఎన్నిక చేయడంలో లెడ్‌బీటర్ ప్రధానంగా చెప్పిన అంశం: ఈ బాలుని మనస్సు-చిత్తం-మీద ఎలాంటి ముద్రలు, వికారాలు లేవు. స్వార్థపరత అనేది యిక్కడ యేమాత్రమూ అగుపించడం లేదు....' అని. ఈ 'చిత్తాన్ని' యిలాగే నిష్కల్మషంగా వుండనీయగలిగితే, మైత్రేయుడు లేక బోధిసత్త్వుడు యితడి శరీరాన్ని వాడుకుని ప్రపంచ శ్రేయస్సుకు పనిచేయగల అవకాశం వున్నదీ—అని. ఈ ప్రాతిపదిక మీదనే కృష్ణమూర్తి యొక్క 'పూర్వ సంసిద్ధత' అంతా తయారయింది.

1928లో అనీబెసెంట్‌ను జాన్ కానుడో Jeanne Canudo అనే పత్రికా ప్రతినిధి కలిసి జగద్గురువు - అందుకు కృష్ణమూర్తి ఔచిత్యం—యీ విషయంపై ఆమె అభిప్రాయాలన్నీ కూలంకషంగా చర్చించింది. ఈ చర్చలో అంశాలు కృష్ణమూర్తి వ్యక్తిత్వాన్ని అర్థం చేసుకోవటానికి కొంతలో కొంత పనికివస్తాయి. తారకసంస్థ ఆ మారు సంవత్సరమే రద్దు అయిన విషయం మనం గుర్తుంచుకోవాలి.

ఆనీబెసెంట్ చెప్పిన మాటలలో ఆమె అభిప్రాయాలు యిలా ఉన్నాయి:

'అవతారాలు, ఆవేశాలను గురించి వర్ణించి చెప్పడం కష్టం. అందులోనూ వార్తాపత్రికలలో సమాచార వితరణకు అనుకూలంగా యీ విషయాలను విడమరచి చెప్పలేము. ఒకే వ్యక్తికి వేరు వేరు వ్యక్తిత్వాలు [Personalities] వుండటం ఆధునిక మానసిక శాస్త్రవేత్తలు అంగీకరించే విషయం. భారత సంప్రదాయంలో 'పరకాయ ప్రవేశం' అని ఒక విద్య వుంది. అవసరం అయినప్పుడు శరీరాన్ని వదలి వెళ్ళడం, ఆ శరీరాన్ని కొన్ని సమయాలలో యితరులు ఎవరయినా ఉపయోగించడం ఈ విద్యలో భాగం. మరెవరో ఉన్నతుడు ఈ శరీరాన్ని చక్కగా ఉపయోగించుకోవాలంటే, దీనిని పరిశుభ్రంగా- పరిశుద్ధంగా— పవిత్రంగా ఉంచవలసిన అవసరం వుంది.

'కృష్ణమూర్తి చిన్నతనం నుంచి పరిశుద్ధంగా వున్నవాడు. ఆ కుటుంబంలో మాంసాహారం, పొగాకు సేవనం, మద్యపానం లేవు. శారీరకంగా పరిశుభ్రత, పరిశుద్ధత అలవరచుకున్నాయి. జగద్గురువు ఈ శరీరాన్ని ఆక్రమించుకుంటాడు. ఒక క్షణం కావచ్చు, కొన్ని క్షణాలు కావచ్చు. 1925లో ఒకమారు కృష్ణమూర్తి శరీరం ద్వారా జగద్గురువు మాట్లాడాడు. ఆ తరువాత నేను అతన్ని అడిగాను- ఆ క్షణాలలో నీకు ఏమనిపించింది అని....అతను సమాధానం చెప్పాడు: "నాకు ఏమీ తెలియదు. మళ్ళీ కూర్చున్నప్పుడు అప్పుడే మెలుకువ వచ్చినట్లు అనిపించింది". ఆ సమాలోచన కావటానికి ఎంతో శక్తి కావాలి....క్షణాలలో అతని చుట్టూ గొప్ప కాంతివలయం ఏర్పడడం చూచారు దివ్యదృష్టి వున్నవాళ్ళు.

'ఆరు నెలల నుంచి ధ్యాన సమయంలో కృష్ణమూర్తికి గౌతమబుద్ధునిగురించి గీతికలు వ్రాయడం అలవాటు అయింది. ఆయనను చూడడం కూడా తటస్థిస్తోంది. ఇదంతా ఆంతరికంగా జరిగే వ్యవహారం. అతని చేతనం ఆ దివ్యచేతనాన్ని తనలో యిముడ్చుకునే ప్రయత్నం చేస్తోంది. దీనివల్ల "పరకాయ ప్రవేశం" కంటె మిన్న అయిన యేర్పాటు సుసాధ్యం అవుతోందన్నమాట. కృష్ణమూర్తి క్రమ పరిణామాన్ని నేను జాగ్రత్తగా గమనిస్తున్నాను. ఇప్పుడు కృష్ణమూర్తి అనే వేరే మనిషి మటుమాయం అయిపోయి, బుద్ధుని చేతనమే అతనిలో పనిచేస్తోందనిపిస్తుంది నాకు. అతని జన్మాంతర సంస్కారం కూడా ఇందుకు దోహదం చేసి వుంటుంది. అతని ప్రత్యేక వ్యక్తిత్వం అంతరించి సర్వజనీనత ప్రవేశించింది ఆ చిత్తంలో. అతనికి కోపము,విచారము లాంటి లక్షణాలు లేవు. అందరినీ ప్రేమగా ఆదరంగా చూస్తాడు. ఒక కొత్త జీవన విధానాన్ని ప్రసరిస్తున్నాడు.

'బాహ్యమైన అధికారం ఏమీ ప్రదర్శించకుండా మనం ఏం చేయాలో, ఎలా

వుండాలో ఆదేశాలు యిస్తున్నాడు. నిజమైన స్వేచ్ఛ యెలా పొందగలమో సూచిస్తు న్నాడు. విముక్తత ఏర్పడాలంటే....ఏమీ కోరుకోగూడదు, ఏదీ మన స్వంతం అనుకోగూడదు. నిరపేక్షగా నిరతిశయంగా వున్నప్పుడే మనం హాయిగా, సుఖంగా ఆనందంగా వుంటాం... అని చెబుతాడు. 'ఆనంద సామ్రాజ్యం' [Kingdom of Happiness] అని అతను వర్ణించేది ఈ స్థితినే. అన్ని వస్తువులను అందరు జీవ రాశులను భగవదాలయాలుగా చూడాలి;భగవద్ నిలయాలుగా భావించాలి. భగవద్-దైవ-సంపద తప్ప యింకేం లేదు. ఈ సంపదను మనలో మనం-అంతర్లీనంగా మనలోనే- గుర్తించడమే విముక్తి. ఇదే అతను పొందిన స్థితి, అనుకుంటాను. ఈ మార్గాన్నే మనకూ చూపుతున్నాడు.

'ఆదర్శం ఒక్కటే కావచ్చును. కాని కాలానుగుణంగా మనుషుల తీరు తెన్నులు మారుతూ వుంటాయి. ప్రదర్శన రీతులు మారుతాయి. వాటి వివరాలు, వివరణలు విలువలు పలువలు సంతరించుకుంటాయి.

'కృష్ణమూర్తి సరళమైన జీవితాన్ని ఉపాసిస్తాడు, ఇతరులకు ఆదేశిస్తాడు. వీలయినంతవరకు నిరాడంబరమైన ప్రకృతికి దగ్గరగా మన జీవితాలు గడచిపోవా లంటాడు. జగద్గురువు పాత్ర సామాన్య ప్రజలకు "విముక్తులు" అయేందుకు తగిన సూచనలు యివ్వడం. ఎప్పుడూ ఆనంద సామ్రాజ్యంలో భాగస్వాములుగా వుండేం దుకు తగిన జీవన విధానాన్ని ఆదేశించడం. దుర్భర భౌతిక పరిస్థితులలో కూడా ఆనందాన్ని అనుభవించగల స్థాయికి తీసుకురావడం.'

అనీబెసెంట్ ప్రదర్శించిన సాహసోపేత ధోరణి, కృష్ణమూర్తి నిరాడంబర జీవన విధానం ఈ పత్రికా ప్రతినిధి జాన్ కానుడోకు ఆక్కజం కలిగిస్తాయి. వీటిలో ఏది "మిన్న" అని ఆమె కొంతసేపు తడబడుతుంది.

"నేను జగద్గురువు కాను!" అని కృష్ణమూర్తి ప్రకటించినా అందుకు అతని వినయం, నిరతిశయ వర్తనం ఆలంబన అనుకుంటారుగాని- ఈ విషయాన్ని విశ్వ విషయాన్ని విశ్వసించటానికి సిద్ధంగా వుండరు చాలమంది.

'గురువులకే గురువుగా భావిస్తాం మేం ఆయన్ను'- అని చెబుతారు కొందరు.

గురువు అనే మాటకు కొత్త అర్థాన్ని- నిజమైన అర్థాన్ని ప్రయోజనాన్ని- తీసుకువచ్చి ప్రజల ముందు వుంచిన వ్యక్తి కృష్ణమూర్తి.పరాశ్రయం కాకుండా ప్రతి వాడూ స్వావలంబనపైననే స్వప్రజ్ఞ; వికాసం కోసమే ప్రయత్నించాలని ధారాపూర్వ కంగా చెప్పినవాడు ఆయన. నూతన జీవన విధానాన్ని అప్రయత్న పూర్వకంగా అనుసంధించే సులువులు చూపినవాడు.

* * *

కృష్ణమూర్తికి దివ్యజ్ఞాన సమాజంతో ఉన్న సంబంధం యీ **జీవిత పరిధిలో** ఆద్యంతాలకూ విస్తరించి వుంది.

ఆయన మతైక అభిలాషలు, తాత్త్వికచింతనలు దివ్యజ్ఞాన సమాజ సభ్యులు చక్కగా అర్ధం చేసుకోగలుగుతున్నారు. ఈ సమాజ వాతావరణంలో పెరిగి పెద్దవాడై పుష్పించిన కుసుమం ఆయన. ఆయన బోధనలు ప్రాతిపదిక దివ్యజ్ఞాన తాత్త్వికాంశాలే. కాకపోతే ఆ సాంకేతిక పదజాలాన్ని **Technical jaurgun** ను ఆయన ఉపయోగించలేదు.

దివ్యజ్ఞాన సమాజం విశ్వవ్యాప్తమయిన సంస్థ. సోదరభావాన్ని అన్ని చెరగులా విస్తరింప చేయటానికి కంకణ బద్ధం అయిన సమాజం. జీవ ఏకత్వము-అరూప భగవత్ తత్త్వము ఈ సమాజ తాత్త్విక చింతనకు మూలస్తంభాలు. సమాజానికి మూలపురుషులయిన మహాత్ములు భగవత్ విషయంగా చెప్పిన సంగతులు అతి స్పష్టంగా ఎరుకపరుస్తాయి- జీవ ఏకత్వము, బహురూప పవిత్రత అన్ని స్థాయిల లోను పడికట్టు ప్రమాణాలని. వ్యక్తిగత ఇష్టా ఇష్టాలకు, ఈర్ష్యాసూయలకు, ద్వేషాతిశయాలకు ఆస్కారం లేదు.

దివ్యజ్ఞాన పరమైన జీవనం అంటే ఏ రకమయిన అరమరికలు లేకుండా భేదభావాలు లేకుండా విశ్వమానవ సోదర భావాన్ని, యితర జీవరాశుల పట్ల సహకార మనోభావాన్ని మటుకే చూపుతూ జీవించడం. ప్రతి జీవరాశీ పెరిగేందుకు తగిన వాతావరణాన్ని కల్పించడం; అవరోధాలను తొలగించడం.... ఇలా ఎన్ని రకాలుగానయినా చెప్పవచ్చు. వ్యక్తిపరమయిన ఆశాపాశాలకు కట్టుబడకుండా ప్రగాఢమైన హృదయపు లోతులకు వెళ్ళి ఏకత్వాన్ని అనుభూతికి తెచ్చుకోవడం, అనుసందానం చేసుకోవడం ఇక్కడ మార్గదర్శక సూత్రం. మానవ ప్రకృతి, ప్రవృత్తి వున్న స్థితిగతులలో అటువంటి అమాయక-అనావృత్త మనస్థితి ఏర్పడడం బహు అపురూపం.

ఈ మనస్థితికి చేరువ అవటానికి కృష్ణమూర్తి బోధనలు చాలామందికి ఉపకరించాయి, ఇకముందూ ఉపయోగపడతాయి. **Unconditioned Mind** ఎవరికి వారు ఏర్పరచుకోవలసిన వ్యవహారం. సూచనలు, సూత్రాలు పైపై నుంచి రావచ్చు గాని దీనికి తగిన స్ఫూర్తి మటుకు అంతరంగం నుంచే రావాలి. ఈ రకమయిన మనస్సు రావటానికి వీలుగా మనిషికి వున్న కోశాలు, తత్వాలు విడమరచి చెప్పింది. దివ్యజ్ఞాన వాఙ్మయం మనస్సుకు వున్న ప్రత్యేకస్థానం-దీని వికాసావశ్యకత నొక్కి చెప్పింది. ఈ బోధనలతో తగిన స్థాయిని పొందిన వారికి కృష్ణమూర్తి వచనాలు మరింత ఉత్తేజం ఇచ్చి ప్రోత్సాహం సమకూర్చాయి. జీవితాన్ని దర్పణంగా చూచుకుని తత్త్వదర్శక ప్రాతిపదిక ఏర్పరచుకుందుకు సహాయపడ్డాయి.

కృష్ణమూర్తి భగవంతుడిని గురించి, మతాన్ని గురించి చెప్పిన విషయాలన్ని టికీ దివ్యజ్ఞాన తత్త్వదర్శన మూలసూత్రాల ప్రాతిపదిక బాహాటంగా వుంది. ఈ సూత్రాల ఆదరణ ప్రయోగకే ఆయన బోధనలు. దివ్యజ్ఞాన సమాజంలో సభ్యునకు వున్న స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు. అభిప్రాయాలను కేవలం సూచనలుగా దత్తాంశంగా చూచుకోవడం.... ఇలాంటివన్నీ కృష్ణమూర్తి Unconditioned Mind ప్రాతిపదికకు ఒదిగివుంటాయి.

మేడంబ్లావట్స్కీ మతాన్ని గురించి ప్రస్తావిస్తూ ఇలా అన్నారు :

'మనుషులందరినీ కలిసికట్టుగా వుండి ఒక తాటిపై నడిపించేది మతం.అంతే గాని ఏదో సిద్ధాంతాల, సూత్రాల మాటలపోగు కాదు మతం. అంటే, మతం కేవలం మనుషులకే పరిమితం అయివుండదు. జీవరాశులన్నిటికీ, విశాల విశ్వంలో వున్న అన్ని జీవులకూ చెందినది ఇది. అన్నిటినీ ఒకటిగా కలిసి వుంచేది.

భగవంతుడంటే చాలామందికి అర్చారూపమే భావసంకల్పమే. ఇదే మనుషులను విడదీస్తోంది. పెడత్రోవలలో పోయేట్లు చేస్తోంది. యుద్ధాలను, వైరుధ్యాలను తీసుకువస్తోంది. కృష్ణమూర్తి ఏమంటున్నారో చూడండి:

'భగవంతుడు ఉన్నాడా లేడా, సత్యం ఉన్నదా లేదా.... అన్న ఈ తరహా ప్రశ్నలకు సమాధానాలు పుస్తకాలలోను, పురోహితుల వల్ల, తత్త్వవేత్తల నుంచి, రక్షకుల ద్వారా వచ్చేవి కాదు. ప్రేమతత్త్వాన్ని పరిపూర్ణంగా ఆస్వాదించినదే మతైకమైన మనస్సు. ఈ ప్రేమకు విభజనలు లేవు.అడ్డుగోడలు లేవు. దూరతీరాలు లేవు. ఇక్కడ అన్నీ సమసిపోయి ఒకటిగా ఉండిపోతాయి-'

సరైన జీవన విధానం అవలంబించకుండా ధ్యాన నిమగ్నాసక్తులు కావడం అసంబద్ధం అంటారు కృష్ణమూర్తి. కేవలం సాంఘిక నైతికత (Social morality ను పాటించడం సక్రమ జీవన విధానం కాదు. అసూయ. ద్వేషం, దురాశ, అధికార లాలస.... ఇలాంటి వాటి అన్నిటి నుండి దూరంగా వుండడమే సక్రమ జీవన విధానం— అంటారు ఆయన.

జీవితాన్ని మరో కొత్త కోణంలో చూడటానికి వీలున్నదనీ, యీ కొత్త కోణమే అవిరళంగా ముందుకు సాగిపోతుందనీ చూపారు కృష్ణమూర్తి.

వ్యక్తి తన సునిశిత శక్తి సామర్థ్యాలను వికసింపచేసుకున్న కొద్దీ జీవన దర్శనం ఎప్పటికప్పుడు పరిపూర్ణంగా తయారవుతుందని సూచించారు. పురాతన, సనాతన సూక్తులకు కొత్తకోణాలు వున్నాయనే అవగాహన పెంచారు.

కృష్ణమూర్తి జీవన ఆంతరిక వికాసం మానవాళి అభ్యున్నతికి సరికొత్త రహదారులను తెరిచింది. మానవాళిలో ప్రతి ఒక్కరికీ— ఎలాంటి మినహాయింపు అవసరం లేకుండా- విముక్త స్థితిపొందే అవకాశం వున్నదనీ, ఆ స్థితి సిద్ధమై స్వాగత ..నాలు పలుకుతోందనీ తెలుపుతుంది.

—0—

# చివరి మాటలు

శ్రీ కృష్ణమూర్తి 1986లో జనవరి 1, 4 తేదీలలో మదరాసు వసంత విహార్‌లో చేసిన ప్రసంగాలు కడపటివి. మామూలుగానే ఈ సమావేశాలకు వేల సంఖ్యలో ప్రేక్షకులు, శ్రోతలు హాజరయ్యారు. కృష్ణమూర్తి అతిసాధారణంగా ప్రతి ప్రసంగ సంచికలోను ప్రస్తావించే విషయాలను యిక్కడ కూడా తీసుకువచ్చారు. ఎన్నో విషయాలు చెప్పవలెననే ఆయన ఆతురత యీ ప్రసంగాలలో కనిపిస్తుంది.

కడపటివి గనుక వీటికి ఒక ప్రత్యేకత, మరో విశిష్టత వుండే అవకాశం వున్నదని మా అభిప్రాయం ఆసక్తి వున్న ప్రతిమనిషి వీటిని యథాతథంగా చదువుకు, ఆకళింపు చేసుకోవడం శ్రేయోదాయకం అని మనవి.

## 1 జనవరి 1986

'నేను దారినపోయేవాడిని; అంత ముఖ్యమైన మనిషిని కాను. పని రోజున కూడా-ఈ సాయంకాలం-ఇంతమంది పోగవడం విడ్డూరంగా వుంది కదూ?' అంటూ ఆశ్చర్యం ప్రకటిస్తారు కృష్ణమూర్తి ముందు.

మనమందరము కలిసికట్టుగా ఆలోచిస్తున్నాము [Together] మీరు, నేను ఒకే వీధిని నడుస్తున్నాము నేను చెబుతూవున్నది మీరు వింటూ 'ఊ' కొట్టడం కాదు. నేను చెబుతూ వున్నది-గుడ్డిగా-తలవూపి "బావుంది" అనుకోవడం కాదు.

మొదటగా-మన వైఖరి ఎలా వుండాలంటే, ప్రతిదాన్నీ ప్రశ్నవేసుకు చూచుకోవాలి. అనుమానంగా పరీక్ష చేసుకోవాలి. అనుభవాలను, తీర్మానాలను, ఆలోచనలనూ ఎవరో చెప్పారుగదా, ఆ చెబుతున్నది నేనయినాసరే- ఫలాన పుస్తకంలో వున్నది గదా- ఆ పుస్తకం ఎంత గొప్పదయినా కావచ్చును- అని అంగీకరించడం కాదు, చేయవలసింది. మనం కలిసికట్టుగా పరీక్షిస్తున్నాం, పరిప్రశ్న వేసుకు చూచుకుంటున్నాం ఈ ఉపన్యాసం మిమ్మల్ని నడిపించటానికి, మీకు బోధ చేయడానికి కాదు. మీకేదో సహాయంచేసి ఉద్ధరించాలనీ కాదు. అలాంటి ప్రయత్నం తరాల తరబడి, వేల సంవత్సరాల నుంచీ జరుగుతూనే వుంది.

బహుదూర ప్రయాణం చేస్తున్నాం మనం; సుదీర్ఘమయిన యాత్ర.

మనం ప్రస్తుతంలో ఎలా వున్నాం- అన్న స్థాయి నుంచీ ఆలోచన, పరీక్ష ప్రారంభించాలి. గతంలో ఎలా వున్నాం, భవిష్యత్‌లో ఎలా వుంటాం అనే స్థాయి నుంచీ కాదు. మన దురాశలు, అసూయలు, ఈర్ష్యలు, మూఢనమ్మకాలు, ఏదో

పూజలు పునస్కారాలు చేయాలనుకోవడం- ఏమన.... ఇదీ మన ప్రస్తుత పరిస్థితి.

బహుదూర ప్రయాణానికి ఎంతో శక్తి (**Energy**) కావాలి.

ప్రేమ (**Love**) అంటే ఏమిటి?— అదీ మనం పరీక్షించవలసిన విషయం. ఈ విషయాన్ని సమూలంగా, విస్తారంగా, లోతుగా....సమాలోచన చేసుకోవడానికి ఎంతో శక్తి కావాలి. ఈ శక్తి (**Energy**) ఏమిటో కూడా మనం పరీక్షించుకోవాలి.

మనం చేస్తున్న ప్రతి పని వెనక- వినడము, మాట్లాడడము, చేయి కదపడము యిలా చిన్న చిన్న పనుల వెనుకకూడా- శక్తి వుంది.

ఇళ్ళు కట్టటానికి, చెట్లు నాటటానికి....అన్నింటికీ శక్తి కావాలి.

కాకి అరవడం, సూర్యుడు ఉదయించడం-అస్తమించడం ఇదంతా కూడా శక్తే. ఇప్పుడే పుడుతున్న శిశువు ఆక్రందనం కూడా ఈ శక్తిలో భాగమే.వయొలిన్ వాయించాలన్నా, మాట్లాడాలన్నా, పెళ్ళిచేసుకోవాలన్నా, లైంగిక వ్యవహారం నడపాలన్నా....ఈ భూమిమీద ఏపని చేయాలనుకున్నా శక్తి కావాలి.

అందుచేత మన మొదటి ప్రసక్తి- ఈ "శక్తి"ని గురించి.

ఏమిటి ఈ శక్తి?

శాస్త్రజ్ఞులు వేసుకునే ప్రశ్న యిది.

'శక్తి కూడా ద్రవ్యమే-పదార్థమే' **Energy is Matter** అంటారు వాళ్ళు. కావచ్చును. కాని అంతకుముందు, పూర్వం.... అనాదిగా వున్న శక్తి యేమిటి? **Primordial Energy** యేమిటి? దానికి పునాది ఎక్కడ? ప్రారంభం ఎక్కడ? మూలం ఏమిటి? దీన్ని సృష్టించింది ఎవరు? జాగ్రత్తగా సమాలోచనలు చేయండి. 'భగవంతుడు' అని సమాధానం చెప్పేసి ఊరుకోకండి. నేను భగవంతుడిని అంగీకరించను; ఈ మాట్లాడుతున్న మనిషికి (**Speaker**) భగవంతుడు లేడు. వింటున్నారా?

ఏమిటి ఈ శక్తి?

విజ్ఞాన శాస్త్రవేత్తలు. పూర్వతత్త్వజ్ఞులు.... వీళ్ళు చెప్పినవన్నీ కాస్సేపు పక్కనపెట్టండి. మనం కలిసి యిప్పుడు సమాలోచన చేసుకుంటూ ముందుకు పోదాం....కలిసికట్టుగా.

మీ మెదడు వుంది (**Brain**). ఇది పదార్థమే (**Matter**) కోట్లాది సంవత్సరాల అనుభవాన్ని యిది ప్రోది చేసుకుని వుంది. అన్ని సంవత్సరాల పరిణామం (**Evolution**) యీ శక్తే.

ఇప్పుడు మనం సమాలోచన చేయబోతున్నది ఏమిటంటే....

మనకు ఎరుక అయిన ప్రాంగణంలో వున్న విషయం [Knowledge] కాకుండా, దానిలో మథనం అయినది కాకుండా, దానిలో యిమిడి పోయినది కాకుండా.... మరేదో "శక్తి" అనేది వున్నదా? భావజాలంలో యిరుక్కుపోయినది కాక వేరే శక్తి అంటూ వున్నదా?Is there Energy which is not put together by thovght ?

భావన (Thought) మనకు గొప్ప శక్తిని ఇస్తుంది. రోజూ ఉదయం తొమ్మిది గంటలకు ఆఫీసుకు వెళ్ళటానికి, ధన సంపాదన చేయటానికి మంచి ఇల్లు కట్టుకోవటానికి.... భావన మనకు అవసరం అయిన శక్తిని ఇస్తుంది.

గతాన్ని గురించి ఆలోచించేందుకు, భవిష్యత్తును గురించి ఊహించుకోవటానికి, వర్తమానంలో అనేక ప్రణాళికలు తయారు చేసుకోవటానికి.... మనకు భావన ఎంతో శక్తిని ఇస్తుంది. శ్రీమంతులు అవడం కోసం అగ్నిశిఖలలాగ పని చేస్తాం. (Work like blaze to become rich) భావన ఈ శక్తిని తయారు చేస్తుంది. అందుచేత మనం ఈ 'భావన' యొక్క స్వరూప స్వభావాలను తెలుసుకుందుకు ప్రయత్నం చేయాలి.

భావన ఈ (మానవ) సమాజాన్ని తయారుచేసింది. ఈ సమాజం-ప్రపంచం ఎన్నో విభాగాలుగా రూపొందింది. కమ్యూనిస్టులు, సోషలిస్టులు, ప్రజాస్వామ్య వాదులు, రిపబ్లికన్లు, ఇలా. కాల్బలం, నౌకాదళం, వాయుదళం.... ఇవన్నీ కేవలం కదలి ముందుకు వెళ్ళటానికే కాదు– 'చంపటానికి' కూడా. భావన మన జీవితాలలో అతి ప్రధానమైనది. భావన లేకుండా మనం యేమీ చేయలేం. భావనా ప్రక్రియలోనే అంతా ఇమిడిపోయి వుంది. Everything is contained in the process of thought.

భావన- ఆలోచించడం- అంటే ఏమిటి? ఆలోచించండి, కేవలం నా మాటలే వింటూ కూర్చోకండి.

ఈ ఉపన్యాసకుడు దీని గురించి ఎంతో మాట్లాడివున్నాడు ఇదివరకే. మళ్ళీ ఆ పుస్తకాలు తిరుగవేయకండి, 'ఇదంతా నేను లోగడే వినివున్నాను' అని తోసి పారవేయకండి. ఇక్కడ కూర్చున్నప్పుడు.... వెనక పుస్తకాలలో చదివినదంతా మరచిపొండి.... మనం దీనిని ప్రతిసారీ కొత్తగా.... నూతనంగా ... యిప్పుడే ప్రారంభం చేస్తున్నాం అన్నట్లుగా వ్యవహరించాలి.

భావన పాండిత్యం మీద ఆధారపడి వుంది.

Thinking is based on knowledge.

మనం ఎంతో పాండిత్యాన్ని పోగుచేసుకున్నాం. ఒకళ్ళనొకళ్ళు అమ్మేసు

కోవడం ఎలా, కొల్లగొట్టుకోవడం ఎలా, దేవుళ్ళను దేవాలయాలను నిర్మించడం ఎలా.... ఇలా ఎన్నో విషయాలు మనకు తెలుసు.

అనుభవం లేకుండా పాండిత్యం లేదు.

**Without Experience tnere is no knowledge.**

మెదడులో పోగుచేసుకున్న పాండిత్యమే అనుభవం.

ఇదీ భావనకు మొదటి మెట్టు.

అనుభవం ఎప్పుడూ పరిమితమయినది. ఎందుకంటే ప్రతిక్షణమూ దీనికి ఏదో ఒకటి జోడిస్తూనే వుంటాము.

అందుచేత :

అనుభవం, పాండిత్యం, జ్ఞాపకం.... ఇవన్నీ పరిమితమైనవే.

అందుచేతనే 'భావన' కూడా పరిమితమైనది.

భావన నిర్మించిన భగవంతుళ్ళు- మీ దేవుళ్ళ మీ ఆలోచనలు- యివన్నీ ఎప్పుడూ పరిమితమైనవే.

ఈ పరిమితి లోనుండే మనం మూలాన్ని, పునాదిని, శక్తిని అన్వేషించి తెలుసుకుందుకు ప్రయత్నిస్తున్నాం.

సృష్టికి ప్రారంభాన్ని, ఆదిని, మూలాన్ని ఈ భూమిక మీదనే వెదికి కనుక్కోవటానికి చూస్తున్నాము.

భావన భయాన్ని సృష్టించింది.

**Thought has created fear.**

సరేనా?

తరువాత.... ముందు ముందు.... ఏమవుతుందోనని మనకు భయం.

ఉద్యోగం పోతుందేమో-

పరీక్షలు ప్యాసు కాలేకపోతామేమో-

నిచ్చెన ఎక్కలేక పోతామేమో....

కృతకృత్యులం కాలేకపోతామేమో, ఒంటరిగా నిలబడలేకపోతావేమోనని భయం మనకు. అవసరం అయిన బలాన్ని కూడగట్టుకోలేక పోతామేమోనని భయం.

ఎప్పుడూ ఎవరి మీదనో అధారపడటం.

అదే మనకు విపరీతమయిన 'భయం' ఉత్పన్నం చేస్తుంది.

మన నిత్యజీవితంలో ప్రధానమయిన సత్యం (నిజం) ఏమిటంటే.... మనం భయస్థులం. We are frightened people.

మనకు భద్రత (Security) కావాలి గనుక, దాని గురించిన భయం ముందుగా ఉత్పన్నం అవుతుంది.

భయం ప్రేమను నశింపచేస్తుంది.

భయం ఉన్నచోట ప్రేమ వుండలేదు.

భయం– దానంతట అదే-ఓ గొప్ప శక్తి.

భయానికి, ప్రేమకు నిజంగా సంబంధమే లేదు,

అవి రెండూ వేరు వేరు విషయాలు.

ఈ 'భయా'నికి మూలం యేమిటి?

ఈ ప్రశ్న వేసుకోవడమే-సజీవంగా, సచేతనంగా వుండడం, ప్రేమ స్వరూప స్వభావాలను తెలుసుకుందుకు నాంది.

భావన భయాన్ని సృష్టించింది—భవిష్యత్తును గురించి ఆలోచించడం, గతాన్ని గురించి యోచించడం, పరిసరాలకు ఒదగ లేకపోవడం, యేం జరుగుతుందో ననుకోవటం—నా భార్య నన్ను వదలి వేస్తుందేమో—నేను వంటరివాడిని అయిపోతానేమో-అప్పుడు నా గతి యేమిటి? యిలా. నాకు చాలామంది పిల్లలు వున్నారు. ఎవరినో ఒకరిని మళ్ళీ పెళ్ళి చేసుకోవాలి-అప్పుడే నా పిల్లలకు కొంతలో కొంత రక్షణ-పోషణ!—యిలా గతాన్ని తలపోసుకుని భవిష్యత్తును రూపొందించుకోవడం. దీనిలో భావన, సమయం మిళితం అయివున్నాయి. భవిష్యత్తు గురించి యోచన. భవిష్యత్తు అంటే రేపు. దీనిని గురించి ఆలోచించడం భయాన్ని తీసుకు వస్తుంది. అందుచేత భయానికి సమయం, భావనలు కేంద్రాంశాలు [Central Factors] అన్నమాట.

కనుక, సమయం–భావన యివి రెండూ జీవితంలో ప్రధానాంశాలు. సమయంలో మళ్ళీ రెండు ముఖాలు: నేను ప్రస్తుతం యిలా వున్నాను, రేపు అలా అవుతాను. ఒకటి ఆంతరికం, మరొకటి బాహ్యం. సమయమే భావన. రెండూ కదలికలే, గమనమే. They Both are Movements.

నా అనుభవంలో గడిచిన-మృత్యువు, బాధ, ఆదుర్దా, దుఃఖం, ఒంటరితనం, నిరాశ—వీటన్నిటికి జీవితంలో వున్న స్థానం యేమిటి? మనిషి అనుభవించే ఇవన్నీ జీవితం కదూ? నేను అడుగుతున్నాను: యిదేనా జీవితం అంతా?-అని!

ఇవే జీవితం. ఇదే మీ జీవితం; మీ చేతనం (Consciousness) పరీక్షగా చూచుకుంటే మీ చేతనంలో ఒదిగి వున్న వస్తు సంచయం అంతా యిదే: మీ భావనలు, మీ సంప్రదాయాలు, మీ చదువులు, మీ పాండిత్యం, మీ భయాలు, మీ

ఒంటరితనం. వీటన్నిటి మిశ్రమ రూపమే మీరు. మీ బాధలు, దుఃఖం, ఆదుర్దాలు, ఒంటరితనం, పాండిత్యం ప్రతి మనిషీ పాలు పంచుకుంటాడు. ఈ భూమి మీది ప్రతి మనిషి దుఃఖం, బాధ, ఆదుర్దా, ఘర్షణ, బలాత్కారాలు-పట్టింపులు, కామనలు అక్కర్లేక పోవటాలు [రాగద్వేషాలు]....వీటన్నిటినీ అనుభవిస్తాడు. అందుచేత, మీరు ప్రత్యేక వ్యక్తి **Individual** కాదు. ఓ ప్రత్యేకమైన 'ఆత్మ' కానే కాదు. మీ చేతనం—యిదే. మీరు-భౌతికంగా కాకపోవచ్చు, మానసికంగా, ఆంతరికంగా మానవాళి యొక్క చేతనమే.

మనం జీవితం అంటే యేమిటో తెలుసుకునేందుకు ప్రయత్నిస్తున్నాం. ఏ రకమైన భయం ఆశ్రయించుకు వున్నప్పటికీ, మరొకటి **The other** వుండటానికి వీలులేదనుకుంటున్నాం. ఏ రకమైన బంధనం-**Attachment**-అనురాగం వున్నప్పటికి మరొకటి వుండటానికి ఆస్కారం లేదనుకుంటున్నాం. ఆ మరొకటి ప్రేమ **Love.**

మనం ప్రపంచం అంటే ఏమిటి? మృత్యువు అంటే యేమిటి అనే విషయాలు తెలుసుకోవటానికి ప్రయత్నిస్తున్నాం. మన కందరకూ మృత్యువు అంటే భయం ఎందుకు? చనిపోవడం అంటే ఏమిటో మీకు తెలుసు. వందలాది జనం చనిపోవడం చంపబడడం మీరు చూచే వున్నారు. మృత్యువు అంటే యేమిటో లోతుగా ప్రగాఢంగా తెలుసుకోవటానికి ప్రయత్నం చేశారా? ఇది చాల ముఖ్యమైన ప్రశ్న. జీవితం అంత ముఖ్యమయినది కూడా.

జీవితం అంటే యీ మామూలు గుంజాటన అనుకున్నాం. రోజూ పొద్దున్న తొమ్మిది గంటల కల్లా ఆఫీసుకు వెళ్ళడం....పాండిత్యం....సంఘర్షణ, ఇది అక్కర్లేదనీ, యిది కావాలని అనుకోవడం, జీవితం అంటే యేమిటో మనకు క్షుణ్ణంగా తెలుసుకొని మృత్యువు అంటే యేమిటో తెలుసుకోవటానికి మటుకు ప్రయత్నం చేయలేదు.

మృత్యువు అంటే యేమిటి?

చనిపోవడం ఒక అసాధారణ విషయం అయివుండాలి.

మీ దగ్గర వున్నవన్నీ తొలగించబడతాయి, తీసివేసుకో బడతాయి: మీ అనుబంధాలు, మీ డబ్బు. మీ భార్య, మీ పిల్లలు, మీ దేశం, మీ మూఢనమ్మకాలు, మీ గురువులు, మీ భగవంతుళ్ళు, వాటినన్నిటినీ మీరు మరో లోకానికి తీసుకు వెళ్ళాలనే అనుకుంటారు. కాని ఆ పని అసాధ్యం. మృత్యువు అంటుంది: పూర్తిగా నిరాసక్తంగా వుండండి **Be Totally Detatched**—అని. మృత్యువు తటస్థించినపుడు జరిగేది అదే. మీరు ఎవరి మీదా వాలి పోవటానికి కుదరదు. **You have no**

**Person to Lean on** ఏమీలేదు. **Nothing.** మళ్ళీ జన్మ వస్తుందని మీరు విశ్వసించవచ్చు. అది చాల ఊరట కలిగించే నమ్మకం. కాని అది నిజం కాదు. **That is a comfortable idea; But it's not a fact.**

జీవించి వుండగానే మృత్యువు అంటే ఏమిటో తెలుసుకోవటానికి ప్రయత్నిస్తున్నాం, అంటే ఆత్మహత్య చేసుకోవడం కాదు. నేను అలాంటి క్షుల్లకమయిన విషయాన్ని గురించి మాట్లాడడం లేదు, నా మటుకు నేను చనిపోవడం అంటే ఏమిటో తెలుసుకోవాలని అనుకుంటున్నాను. అంటే: మనిషి తాను సృష్టించిన అన్నిటి నుంచీ-నాతో సహా-స్వేచ్ఛగా విడిగా-**Freely**-వుండటానికి వీలవుతుందా?

చనిపోవడం అంటే యేమిటి? అన్నిటినీ వదలుకోవడం. **To give up Everything.** మృత్యువు మిమ్మల్ని అన్నిటి నుంచీ తోసివేస్తుంది. మీ బంధాలు, భగవంతుళ్లు, మూఢ విశ్వాసాలు, ఊరట కోసం చేసుకునే కోరిక—మరుజన్మ యిలాంటి వన్నిటినీ.

మృత్యువు అంటే ఏమిటో తెలుసుకోవాలనుకుంటున్నాను; అది జీవితం అంత ప్రధానం అయినదీ గనుక.

అయితే యీ తెలుసుకోవటం ఎలా? ఏది మార్గం? సిద్ధాంత పర్వంగా కాదు, నిజంగా యదార్థంగా తెలుసుకోవడం ముఖ్యం.

నాకు నిజంగా తెలుసుకోవాలని వుంది. మీరు అదే అనుకుంటున్నారు. నేను మీ అందరి కోసం మాట్లాడుతున్నాను. నిద్రపోకుండా జాగ్రత్తగా వినండి. చనిపోవడం అంటే ఏమిటి? ఈ ప్రశ్న మీకు మీరే వేసుకోండి. మనం వయసులో వున్నప్పుడు-లేక-ముసలివాళ్ళం అయిపోయినప్పుడు కూడా ఈ ప్రశ్న యిలాగే వుండిపోతుంది.

మృత్యువు అంటే—

పూర్తిగా స్వేచ్ఛగా వుండడమే. మనిషి సృష్టించిన అన్నింటి నుంచీ దూరంగా విరామంగా వుండడమే.

To be Totally free

To be Totally Unattached

మీరు తయారు చేసుకున్న వాటినుంచి బహుదూరంగా వుండడమే.

ఏమీ బంధాలు లేవు No Attachments

దేవుళ్ళు లేరు No Gods.

భవిష్యత్తు లేదు No Future.

గతం లేదు No Past.

మీరు దీని సుందరతను చూడలేకపోతున్నారు,

దీని ఔన్నత్యాన్ని Greatness గమనించలేక పోతున్నారు.

దీని అసాధారణ బలాన్ని Extraordinary Strength గమనించ లేక పోతున్నారు.

బతికి వుండగానే చనిపోవటాన్ని గురించి తెలుసుకోలేకపోతున్నారు.

ఇదంతా యేమిటో మీకు అర్థం అవుతోందా?

మీరు బ్రతికివున్న ప్రతిక్షణం-చనిపోతున్నారు.

జీవితం పొడుగునా మీరు దేనికీ Anything అంటిపట్టుకు వుండడం లేదు.

మృత్యువు అంటే అదే.

బతకడం అంటేనే చనిపోవడం.

**Living is Dying.**

అర్థం అయిందా?

బతకటం అంటే-మీరు పోగుచేసుకున్న వాటినన్నిటినీ ప్రతిరోజూ వదులు కుంటున్నారు.

Every day you are abandoning Everything that you are attached to.

మీరు యీ పని చేయగలరా?

చాల సూక్ష్మం, సరళం అయినదే—యీ విషయం. కాని దీనికి చాల పర్యవసానాలు Implications వున్నాయి.

అప్పుడు-

ప్రతి రోజూ ఒక కొత్తరోజు.

ప్రతిరోజూ మీరు మరణిస్తున్నారు, పునర్జన్మ ఎత్తుతున్నారు.

మీలో ఎంతో వీర్యం, శక్తి వుంది. Uitality-Energy. మీరు దేనిని గురించి భయపడడం లేదు గనుక ఎంతో వీర్యం శక్తి మీలో ఉన్నాయి. మీకు యిప్పుడు యేదీ దిగులు అనిపించదు. There is nothing that can hurt.. అసలు Hurt అవడం-దెబ్బతినడం-అనేదే జరగదు.

మనిషి తాను చేసిన నిర్మాణాన్ని-సృష్టిని-అంతా విసర్జించాలి. అదే మృత్యువు అంటే.

మీరు ఆ పని చేయగలరా?

ప్రయత్నం చేస్తానంటారా?

ఈ ప్రయోగం చేసి చూస్తానంటారా?

ఏదో ఒకమారు, ఒకరోజు కాదు—ప్రతిరోజూ.

ఉహు–లాభం లేదండీ, మీరు చేయలేరు, మీ మెదడులు యిందుకు తగిన శిక్షణ పొందలేదు. మీ మెదడులు చదువులతో, సంప్రదాయాలతో, పుస్తకాలతో, ప్రొఫెసర్లతో నిబద్ధితం అయిపోయినాయి.

ప్రేమ అంటే ఏమిటో కనుక్కోవడంతో యిది ముడిపెట్టుకు వుంది.

ప్రేమ, మృత్యువు....యివి రెండూ కలిసికట్టుగానే వుంటాయి.

మృత్యువు అంటుంది: 'స్వేచ్ఛగా వుండండి: నిరాసక్తంగా వుండండి, మీతో పాటు ఏమీ మోసుకు వెళ్ళలేరు'—అని.

**Be free, non-Attached, you can carry nothing with you.**

ప్రేమ అంటుంది: ప్రేమ అంటుంది....దానికి వేరే మాటలేదు. **There is no word for it.**

స్వేచ్ఛ వున్నచోటనే ప్రేమ మనగలుగుతుంది.

స్వేచ్ఛ అంటే భార్య నుంచి,కొత్త అమ్మాయి నుంచి లేక అబ్బాయి నుంచి కాదు.

అది ఓ స్పందన. **The Feeling.**

పరిపూర్ణమైన స్వేచ్ఛతో కూడిన మహత్తర బలం, వీర్యం, శక్తి. **Enormous strength, the uitality, the energy of complete freedom.'** —అని ఆ రోజుకు ప్రసంగాన్ని ముగిస్తారు.

0 0 0 0

## 4 జనవరి 1986

అతను మాట్లాడుతున్నదాంట్లో మీరు కూడా దయచేసి పాల్గొంటారా? కేవలం వింటూ కూర్చోవడం కాకుండా అతనితో కలిసి పాల్గొనండి. అలవోకగా ఊ కొడుతూ వినడం కాకుండా జరుగుతున్నదానికి గమనం యివ్వండి.

ఒకటి రెండు విషయాలు అతి స్పష్టంగా చెప్పవలసి వుంది.

ఇది వ్యక్తిపరమైన స్పోత్కర్ష కాదు.

మాట్లాడుతున్న వ్యక్తికి—వక్తకు- అట్లాంటివి గిట్టవు. ఒక వ్యక్తిని పూజించినా, అతన్నే భగవంతుడు అనుకున్నా–యిన్నాళ్ళూ యీ వక్త చెబుతున్న దానిని మీరు ఖండించినట్లు అయిపోతుంది. ప్రధానమయిన విషయం యేమిటంటే—మీరు

అతను చెబుతున్న దానిని జాగ్రత్తగా వినాలి; పంచుకోవాలి. కేవలం వినడం చాలదు; చెబుతున్న దానితో మీరు భాగస్థులు కావాలి.

మనం జీవితాన్ని గురించి మాట్లాడుకున్నాం. జీవితంలో వున్న సంకీర్ణత, క్లిష్టత తలపోసుకున్నాం. దాని ప్రారంభాన్ని గురించి ముచ్చటించుకున్నాం. జీవితం అంటే ఏమిటి? దీనికంతటికీ మూలం ఆది ఎక్కడ? అద్భుతమైన యీ భూమి, సుందరమైన సాయంకాలం, ప్రభాత సూర్యకాంతులు, నదులు, లోయలు, పర్వతాలు, వైభవోపేతమైన నేల....యివన్నీ క్రమంగా పాడయిపోతున్నాయి. దీనికంతటికీ మూలం'భగవంతుడు' అని నిర్ధారించుకుంటే, ఇక అంతా అయిపోయినట్లే! సమస్య పరిష్కారం అయిపోయింది గనుక మీరందరూ హాయిగా ఆనందంగా గంతులు వేయవచ్చు అయితే అన్నిటినీ ప్రశ్నించడం....అనుమానించడం ప్రారంభిస్తే....దేవుళ్ళను గురువులను—నేను ఈ కోవకు చెందిన వాడిని కాను సుమా—యిలా మనిషి తయారు చేసిన ఉత్సవమూర్తులను, యుగాల తరబడి పరంపరాగతంగా వస్తున్న పరిణామ మూర్తులను ప్రశ్నిస్తే....ఆ ప్రశ్నల రూపం యిలా వుంటుంది.

దీనికంతా ప్రారంభం ఎక్కడ ?

అది యేది ?

ఇంత విస్తృత రూపకల్పన ఎలా జరిగింది?

....మీరు యిలాంటి ప్రశ్నలను వేసుకుంటున్నారనే అనుకుంటున్నాను. వక్త మాట్లాడుతున్నది వింటూ కూర్చుండి పోకండి. దీనితో భాగస్థులు కండి. దీన్ని చీల్చి చెండాడండి. వక్త చెబుతున్నాడు గనుక గుడ్డిగా నిజమేనని అంగీకరించకండి. ఆతనేమీ మీకు గురువు కాదు. మీకు నాయకుడు కాదు. మీకు సహాయకుడు కూడా కాదు. ఇది వేదిక, ఉపన్యాసానికి ప్రారంభం.

ఇది చాలా గంభీరమైన ఉపన్యాసం. మీ మెదడు చురుకుగా వుంటే తప్ప మీరు దానిని అనుసరించగలగడం అసాధ్యం. బోలెడు మాటలు వినడం వల్ల ఏమీ ప్రయోజనం లేదు. మనమందరం బహుదూర ప్రయాణం చేయాలి; కలిసికట్టుగా నడవాలి. కాలంలో చిక్కుకుపోయిన ప్రయాణం కాదు. నమ్మకాలలో, తీర్మానాలలో, సిద్ధాంతాలలో చిక్కుకుపోయిన జీవితం కాకుండా మన జీవన విధానాన్ని గురించి-యిందులో వున్న అనిశ్చితం, భద్రతా రాహిత్యం, మనిషి చేసిన అన్వేషణలు-అసాధారణమైన కంప్యూటర్లు....యిలా రెండు మిలియన్ల సంవత్సరాలుగా జరిగిన దానినంతా సమాలోచించుకోగలగాలి. మనమందరం ఎటుగా, ఎక్కడకు ప్రయాణం

చేస్తున్నామో చూచుకోవాలి. ఏదో సిద్ధాంత ప్రకారం కాకుండా, శాస్త్ర గ్రంథం చెప్పిన రీతిని కాక....మన ప్రయాణం ఎటువయిపో గమనించ గలగాలి. మనం ఎక్కడ ఆరంభం చేశాం? ఆరంభం, అంతం.... మొదలు, తుది ...యీ రెంటికి సంబంధం వుంది. ప్రారంభమే తుది కావచ్చును. అవునని తలలు ఊపకండి. పరీక్షించి చూడండి. ప్రారంభము, తుది అనేవి అసలే లేకనే పోవచ్చును. ఆ విషయమంతా మనమందరం కలిసి పరిశీలన చేయబూనుకుంటున్నాం.

సమయ ప్రారంభం నుంచి,యిప్పటి వరకు-ఆది నుంచి వర్తమానం వరకు-మనిషి మతపరంగానే ఆలోచిస్తూ వచ్చాడు. 'మతం అంటే యేమిటి? మనిషి ఎప్పుడూ లౌకిక ప్రపంచానికంటె అతీతమయినది యేమయినా వుందా అని వెతుకుతున్నాడు. నక్షత్రాలను, సూర్యచంద్రులను యితర సృష్టి జాలాన్ని ఆరాధిస్తున్నాడు. ఎంతో గొప్ప పరిశ్రమ, శోధన జరుగుతోంది—దేవాలయాలు. మసీదులు, చర్చిలు....వీటిపై ఎంతో శక్తి వినియోగం అవుతోంది. దైనందిన కలవరం,శ్రమ, పనిపాటలు, రోజూ ఆఫీసులకు వెళ్ళడం, కర్మాగారాలకు వెళ్ళడం, విజయసాధనకు ఎన్నో నిచ్చెనలు, ధన సంపాదన, జనాన్ని సమ్మోహన పరచడం, ఆదేశించడం....వీటన్నిటినీ అధిగమించి మనిషి దేనికోసమో వెదుకుతున్నాడు. ఇదంతా మీకు అంగీకార యోగ్యంగా వుందా? మీరు అంగీకరించినా, తిరస్కరించినా జరుగుతున్నదంతా యిదే. అందరూ యేదో ఒక రూపంలో అధికారం కోసం పరితపిస్తున్నారు. అందరూ తమ చుట్టూ అధికార వలయాలు తయారు చేసుకోవాలనీ చూస్తున్నారు. ఢిల్లీలో, యిక్కడ యితర ప్రదేశాలలో....అనవరతము జరుగుతున్నది యిదే. అందరూ అధికార కేంద్రాలుగా తయారవుతున్నారు.

ఇప్పుడు మనం ప్రశ్నిస్తున్నాం: మతం అంటే యేమిటి? దేవాలయాలకు అనంత ధనరాశులు కూరుస్తున్నాడు మనిషి-ఇలా ఎందుకు చేస్తున్నాడు? దీని అంతటి వెనక వున్న శక్తి యేమిటి? భయమా? స్వర్గం నుంచో మరెక్కడి నుంచో పారితోషికం వస్తుందనా? పారితోషికం కోరడమే మూలకారణమా? ఏదో ఫలితం కావాలి. ప్రతి పనికి ఏదో బహుమానం కావాలి, రోజూ మూడుమార్లో అయిదుమార్లో ప్రార్థన చేస్తారు. దీనికి ఎవరో బహుమానం యివ్వాలి. రిఫ్రిజిరేటర్ కావాలి, కారు కావాలి, మంచి భార్య కావాలి, లేదా మంచి భర్త అనుగ్రహం కావాలి. వర ప్రసాదం కోసం అర్చన దానికి అంటిపట్టుకుని వుండడం....ఇదే మతాలు అన్నిటి చరిత్ర. భగవంతుడు, డబ్బు...ఎప్పుడూ కలిసికట్టుగానే వుంటాయి. కాథోలిక్

చర్చికి అనంత ధనరాశులు ఉంటాయి ఇక్కడ-ఈ దేశంలో కూడా యిదే పద్ధతి. ఎన్నో దేవాలయాలు, పూజలు, పునస్కారాలు, కల్పాలు, క్రతువులు. యివన్నీ అర్థరహితమైనవే నిజానికి. మనం ఇప్పుడు మరింత ప్రగాఢంగా- లోతుకు వెళ్ళి-మతం అంటే యేమిటో తెలుసుకుందుకు ప్రయత్నిస్తున్నాం. ధనసంపాదన, సమర్ప ణలతో ముడిపెట్టుకొని విషయం ఏమిటో కనుక్కుందామనుకుంటున్నాం. మనం అడుగుతున్న ప్రశ్న ఏమిటంటే మన ప్రార్థనలతో, భగవంతుళ్ళతో, దేవాలయాలు-చర్చిలు—మసీదులతో సంబంధం లేని ఆ మహత్తర శక్తిSupreme Intelligence, నామరహితమైన ఆ"మహత్యం" ఏమిటి? ఇవన్నీ మానవ నిర్మితమైనవి. వివేకవంతు డయిన మనిషి దీన్నంతటినీ పక్కకుపెట్టి-దోషదర్శి, నిత్యశంకితుడు అవకుండా, చురుకయిన మెదడుతో ఆలోచిస్తాడు. ఆ మెదడు అన్నిటినీ ప్రశ్నించి తెలుసుకుం టుంది। పైపై మెరుగులతో తృప్తిపడదు. బాహ్యప్రపంచంతో ఆగిపోదు. తన ఆలోచనలను, చేతనాన్ని, ఆంతరికచింతనం అంతటినీ కూడకట్టుకుని సమాలోచన చేయగల మెదడు మనకు వున్నదా? అటువంటి మెదడు మనకు సాధ్యపడుతుందా? లభ్యం అవుతుందా?

ఇక్కడ మనం-మనస్సును మెదడు నుంచి వేరు చేసి చూడగలగాలి. మెదడు నరాశయానికి కేంద్రస్థానం. మన పాండిత్యానికి, సిద్ధాంతాలకు, అభిప్రాయాలకు, దురూహలకూ అది నిలయం.వీటినన్నిటినీ మనం కాలేజీల నుంచి విశ్వవిద్యాలయాల నుంచి పోగుచేసుకున్నాం. ఇది మెదడులో స్థావరించుకు కూర్చుంది. మన ఆలోచ నలు, భయాలూ అన్నీ యిక్కడ చేరుకుని వున్నాయి. ఈ మెదడు మనస్సు కంటె వేరయినదా? దయచేసి వక్త అడుగుతున్న ఈ ప్రశ్నను నిదానంగా పరికించకుండా కొన్ని కోట్ల సంవత్సరాల నుంచి మనం పోగుచేసుకున్న యీ పాండిత్యాన్ని మెద డులో నింపుకువున్నాం మనం. ఈ మెదడు కంటె మనస్సు వేరయినా,అతీతమైనదా అని అడుగుతున్నాను. మెదడు ఎప్పుడూ పరిమితమైనదే. అలాగని తల వూపి అంగీకరించకండి. ఇది చాల గంభీరమైన, లోతయిన ప్రశ్న, ఆలోచన. మనస్సు దీనికంతటికి వేరయినదా? నా చేతనం, నా దైనందిన కార్యకలాపాలు, భయాలు, ఆందోళనలు, అనిశ్చితాలు, దుఃఖం, బాధ.... వీటి చుట్టూ మనిషి పోగుచేసుకున్న అనేక సిద్ధాంతాలు....వీటి అన్నిటి నుంచీ మనస్సు దూరమైనదా, అతీతమైనదా? మనస్సుకు మెదడుతో ఏమీ సంబంధం లేదు మనస్సు మెదడుతో కలిసి వ్యవహ రించగలుగుతుంది. మెదడు మాత్రం మనస్సుతో కలిసిపోయి వ్యవహరించ లేదు.

ఊ-కొట్టి ఊరుకోకండి. బాగా ఆలోచించండి. వక్త యేమంటున్నాడంటే....మెదడు మన చేతనాన్ని ఆలోచనలను భయాలను.... ఇత్యాది అన్నింటినీ కలుపుకుని కూర్చుంది. భగవంతుళ్ళు, ఆస్తికుల, నాస్తికుల అభిప్రాయాలు అన్నీ మెదడులో వున్నాయి. దీన్ని మనం కాదనలేం, వివాదించలేం. జ్ఞానంతో, అనుభవాలతో, సంప్రదాయాలతో పరిమితమయిపోయిన మెదడు–దానికి పూర్తిగా అవలవున్న మనస్సుతో వ్యవహరించలేదు. మనస్సు మెదడుతో వ్యవహరించగలదు, మెదడు మాత్రం అలా మనస్సుతో వ్యవహరించ లేదు. ఎందుకంటే- దాని నిండా పూర్వపు ఆలోచనలు,సిద్ధాంతాలు వున్నాయి. మెదడు కూడా అనంతంగా ఆలోచించ గలదు నామరహితమైన దానిని ఊహించ గలదు. ఏమయినా చేయగలదు.మనస్సు మాత్రం చాల వ్యాప్తమయినది–విశాలమయినది.అది మీకు చెందినది కాదు. అది మీ మనస్సు కాదు. **The Mind is too immense Because it Doesn't Belong to you; it's Not your Mind.**

మనం అన్వేషించబోతున్నాం, కలిసికట్టుగా. అందరం కలిసి అన్వేషిస్తున్నాం, ఆ విషయం మరచిపోకండి. మనం మతం స్వరూప స్వభావాలనేకాక **Computer**ను కూడా శోధిసున్నాం. కంప్యూటర్ అంటే ఏమిటో మీకు తెలుసునా? అదో యంత్రం;దాని చార్యకలాపాన్ని అది నియామకం చేసుకోగలదు.తన కంప్యూటర్ను తానే నిర్మించుకోగలదు. జనక కంప్యూటర్ వుంది **Father Computer.** అది జన్య కంప్యూటర్లను తయారు చేసుకుంటూంది. **Son Computer.** ఈ జన్య కంప్యూటర్ పూర్వపు కంప్యూటర్ కంటె శ్రేష్ఠమైనది, మిన్న అయినది. ఇది వివాదించాల్సిన విషయంకాదు. సువ్యవస్థితమైన మాటే గదూ? ఇందులో ఏమీ రహస్యం లేదు. కనుక జాగ్రత్తగా వినండి– గమనించండి. కంప్యూటర్ మనిషి చేస్తున్న పనులన్నీ చేయగలదు. మీ దేవుళ్ళను, సిద్ధాంతాలను, కర్మక్రతువులను తయారు చేయగలదు. మీకంటె చక్కగా రూపొందించగలదు అది. అలాంటి కంప్యూటర్ ప్రపంచంలోకి వస్తోంది. అది మీ మెదడులను మరో రకంగా- విభిన్నంగా–రూపొందిస్తుంది, జెనెటిక్ ఇంజనీరింగ్ గురించి మీకు తెలుసు కదూ? మీకు యిష్టం వున్నా లేకపోయినా మీ ప్రవర్తన రీతులన్నిటినీ మార్చివేయటానికి ప్రయత్నిస్తున్నారు వాళ్ళు. అదే జెనెటిక్ ఇంజనీరింగ్. మీ ఆలోచనాసరళిని కూడా మార్చి వేయాలని చూస్తున్నారు.

జెనెటిక్ ఇంజనీరింగ్, కంప్యూటర్ కలిసిపోయినప్పుడు మీరు ఏమవుతారు? ఒక మానవుడుగా-Human being-గా మీ పరిస్థితి ఏమిటి? మీ మెదడు మారి పోతోంది. మీ ప్రవర్తన తీరుతెన్నులు మార్పాటు అవుతున్నాయి. వాళ్ల భయాన్ని పూర్తిగా తొలగించి వేయవచ్చును. దుఃఖాన్ని, మీ దేవుళ్ళను తొలగించి వేయ వచ్చును. నిదానంగా వినండి-ఇదంతా జరగవచ్చు. అంతా యుద్ధంలోనో మృత్యువు లోనో పరిసమాప్తి అవుతుంది. ప్రపంచంలో జరగబోతున్నది యిదే. జెనెటిక్ ఇంజ నీరింగ్ ఒక ప్రక్క, కంప్యూటర్ మరోపక్క. ఇవి రెండూ కలిసినప్పుడు- ఆ కలవడం తప్పకుండా జరుగుతుంది-అప్పుడు మానవుడుగా మీ పరిస్థితి ఏమిటి? నిజానికి యిప్పుడు మీ మెదడు ఒక యంత్రం. మీరు భారతదేశంలో పుట్టారు, 'నేను భారతీయుడిని' అనుకుంటున్నారు. ఆ చట్రంలో యిమిడిపోయి వున్నారు. మీరో యంత్రం. ఇందులో నింద యేమీ లేదు నేను మిమ్మల్ని నిందించడం లేదు, చిన్నపరచడం లేదు. మీరు కంప్యూటర్‌లాగ పునరావృత్తం అయ్యే ఒక యంత్రం. మీలో యేదో 'దైవికం' Divine-వున్నదని ఊహించుకోకండి. ఆ ఊహ చాల ప్రియమైనదే, మక్కువ అయినదే, ఏదో పవిత్రమైనది మనలో ఉన్నదనుకోవడం, ఎప్పటికీ అవినాశంగా వుండేది వున్నదనుకోవడం మంచి ఊహే. కంప్యూటర్ కూడా అదే మీకు చెబుతోంది. కనుక, మానవుడు అప్పుడు యేమయిపోతున్నాడు? మీకేం జరుగుతుంది?

ఇది చాల ముఖ్యమైన అంశం. అంగీకారం, అనంగీకారం జొప్పించకుండా ఆలోచించండి. సృష్టి అంతా యేమిటో గమనించండి. ఓ శిశువును తయారుచేయడం- అది బహు తేలిక-ఏదో కొత్త వస్తువు రూపొందించడం అది కాదు సృష్టి అంటే యిక్కడ. Invention—కనిపెట్టటం, అంటే సృష్టి కంటే వేరు అయినది. కని పెట్టటం అనేది పాండిత్యంమీద ఆధారపడి వుంటుంది. ఇంజనీర్లు జెట్‌ను కనుగొం టారు, అభివృద్ధిపరుస్తారు. ఈ గమనం పాండిత్యం మీద ఆధారపడి వుంటుంది. కనుక—కనిపెట్టటం అంతా పాండిత్యం మీదనే ఆధారం అయివుంటుంది. కనుక- కనిపెట్టడాన్ని సృష్టి నుంచి వేరుచేయాలి మనం. దీనికి మీ శక్తి అంతా కావాలి. లోనికి చొచ్చుకుపోయే సామర్థ్యం అంతా కావాలి. కనిపెట్టటం ప్రధానంగా పాండి త్యం మీద ఆధారమై వుంటుంది. నేను గడియారాన్ని అభివృద్ధిపరుస్తాను—అప్పుడు నాకో కొత్త పరికరం యేర్పాటు అవుతుంది. కనిపెట్టటం అంతా పాండిత్యం మీద, అనుభవం మీద ఆధారమై వుంటుంది. అలా ఆధారపడివుంటుంది గనుక కనిపెట్టటం అంతా తప్పనిసరిగా పరిమితమైనవే అవుతాయి. పాండిత్యం పరిమితమైనది గనుక

కనిపెట్టటం, పరిశోధన కూడా పరిమితమే.భవిష్యత్తులో జెట్‌లు వుండకపోవచ్చును, ఢిల్లీ నుంచి లాస్‌ఏంజెల్స్‌కు రెండు గంటలలోనే తీసుకు వెళ్ళగల మరో పరికరం రావచ్చును. ఇదంతా పూర్వ పాండిత్యం మీద ఆధారపడిన పరిశోధన. క్రమ క్రమంగా అభివృద్ధి పొందుతున్న కనిపెట్టటం. అది సృష్టి కాదు.

సృష్టి అంటే ఏమిటి? ప్రాణం- జీవం అంటే యేమిటి? చెట్టులో ప్రాణం, గడ్డిపరకలో ప్రాణం- శాస్త్రజ్ఞుడు కనిపెట్టే ప్రాణం కాదు, ఈ ప్రాణానికి మొదలు ఏమిటి, మొదలు అయిన ప్రాణం యేమిటి? జీవించే ప్రాణం యేమిటి? ఒకదాన్ని మీరు చంపవచ్చును, కాని మరో దాంట్లో యింకా అది నిలచే వుంది. అంగీకారం, అనంగీకారం కాకుండా ఆలోచించండి....ప్రాణానికి మూలం, ఆది, ప్రారంభం యేమిటి అని ఆలోచిస్తున్నాం మనం. మహాద్భుతమైన **Absolute** గురించి ఆలోచిస్తున్నాం. ఇది ఒక పనికి ప్రతిఫలం కాదు, దానిని మనతో యింటికి తీసుకు పోలేం, దాన్ని ఉపయోగించుకోలేం.

**Meditation**– ధ్యానం- అంటే యేమిటి? ధ్యానం అంటే యేమిటని మీరు అనుకుంటున్నారు? మామూలు నిఘంటువులలో యీ పదానికి అర్థం: ఆలోచించడం, పునః పునః చింతించటం, ఏకాగ్రంగా సమాలోచన చేయడం. మెదడును అన్యత్రా పోకుండా నిలిపి వుంచడం. అయితే ధ్యానం అంటే యింతేనా? సరళంగా నిదానంగా యోచించండి. ఏమిటది? ప్రతి రోజూ కొంత సమయం....గదిలో ఒక మూలకు వెళ్ళి పదినిమిషాలపాటు ప్రశాంతంగా కూర్చోవడం....అరగంటసేపు గడపడం.... యిదేనా? ఏకాగ్రంగా ఏదో ఉదాత్తమైన విషయాన్ని గురించి ఆలోచించడమే ధ్యానమా? ధ్యానం చేయటానికి యేదో నియమిత కాలంలో కట్టుబడి కూర్చోవడం– ఆఫీసు కార్యకలాపాలలో భాగం అయిపోతుంది. 'ధ్యానం చేస్తే నాకు ప్రశాంతచిత్తం దొరుకుతుంది.' లేదా 'మరేదో స్థితికి వెళ్ళిపోతాను' అనుకుంటారు మీరు. ఇదేనా ధ్యానం అంటే? ధ్యానం [Meditation] అనే మాటకు కొలవడం, ప్రమాణం ఎంచడం, పోలికలు చూచుకోవడం అని కూడా అర్థం వుంది. ఒక చిత్తరువు, నిగ్రహం, అభిప్రాయం మీద మనస్సు నిలపి వుంచుతున్నారు- కనుక మీ ధ్యానం పరిమితం, నియమబద్ధం అయిపోతోంది. యాంత్రికం అవుతోంది. ఆ 'నిలిపి వుంచడం' అనేది మిమ్మల్ని వేరు చేస్తోంది. ఏకాగ్రత- **Concentration**- ఎప్పుడూ విభాగాన్ని తీసుకు వస్తుంది. ఒక విషయం మీద లగ్నం చేసి వుంచుతారు, ఆలోచన మరో విషయం మీదకు పోతుంది. అలా పోగూడదని చెప్పుకుంటారు-

దాన్ని మళ్ళీ వెనక్కు లాక్కు వస్తారు. రోజంతా యీ పరిశ్రమ పునరావృతం చేస్తారు- కనీసం ఓ అరగంట యీ పరిశ్రమ నడుస్తుంది. తరువాత మీరు బయటకు వస్తారు. నా ధ్యానం పూర్తయింది- అనుకుంటారు. ఇలాంటి ధ్యానాన్నే మీకు గురువులు, సాధకులయిన శిష్యులు నేర్పుతున్నారు. క్రిష్టియన్ల అభిప్రాయం పరికించండి: 'నేను భగవంతుడిని విశ్వసిస్తున్నాను, భగవంతునికే అంతా సమర్పణ చేస్తున్నాను, నా ఆత్మను పరిరక్షించమని కోరుకుంటున్నాను- ప్రార్థిస్తున్నాను.' ఇదేనా ధ్యానం అంటే? ఈ రకమైన ధ్యానాన్ని గురించి నాకు ఏమీ తెలియదు. ఇదో సాధన. దేనినో కనిపెట్టి లబ్ధి పొందడం- **Achievement.** ఒక అరగంట ధ్యానం చేస్తే, నాకు కులాసాగా వుంటుంది....యిదీ ఆలోచన. దీని కంతటికీ వేరయిన, అతీతమైన ధ్యానం వున్నదా? వక్త చెబుతున్నదాన్ని నిర్నిమిత్తంగా అంగీకరించకండి. ఇదంతా ధ్యానం కాదని వక్త చెబుతున్నాడు. సాధనక్రమంలో యిదో అంతస్తు- అంటున్నాడు. ఒక నెల రోజులపాటు మీకు ఏకాగ్రత కుదరలేదు. ఒకరోజు దాన్ని సాధించారు. 'ఆ! నాకు దొరికింది' అనుకుంటున్నారు. గుమాస్తా, మేనేజర్ పదవిని సాధించడంలాంటిది యిది. అందుచేత....సాధనకు అతీతమైన, పరిశ్రమకు ఫలితం కానటువంటి ఒక 'ధ్యానం' వుంది. అది కొలవడం- ప్రమాణపూర్వకమైనది కాదు. **Not measurement.** అది దైనందిన ప్రక్రియ కాదు, యాంత్రికమయినది కాదు. సరిపోల్చి చూచుకోవడం వంటిది కాని ఒక ధ్యానం వుంది. దానిలో కొలతలు, పారితోషికాలు- శిక్షలు (నష్టాలు) లేవు. ఇలాంటి ధ్యానం వున్నదా? ఆలోచన- భావన- మీద ఆధారపడని, కొలతలు-సమయాలు లేని- పరిమితులకు లొంగని ధ్యానం వున్నదా!

ఇలాంటి కొలతలు, పోలికలు, సాధన అనంతర ప్రయోజనం.... కాని ధ్యానం గురించి ఎవరయినా వర్ణించి వివరించగలరా? 'నేను ఇప్పుడు ఇది; యిక ముందు ఇంకేదో.... అనే మాటలు చెప్పదు ఆ ధ్యానం. ఇంకేదో అనేది ఓ భగవంతుడో మరో ఉన్నత శక్తో కాదు. మన ఇచ్ఛతో, సంకల్పంతో ఏమీ సంబంధం లేని ఓ శక్తి **Energy** 'నేను ధ్యానం చేస్తాను—' అనేది.... ఉందా? ప్రయత్నం, పరిశ్రమతో సంబంధంలేని ధ్యానం అంటూ వుందా? అటువంటిది ఉంది అని వక్త చెబుతున్నాడు. మీరు ఈ విషయాన్ని ఆమోదించనవసరం లేదు. అతను మాట్లాడుతున్నదంతా అర్థంలేని చెత్త– **Nonsense** కావచ్చును. కాని అతను ఏమనుకుంటున్నాడంటే, మీరు మామూలుగా ధ్యానం అనుకుంటున్నదంతా మిమ్మల్ని మీరు

సమ్మోహన పరచుకోవడమే Self-hypnosis, మోసగించుకోవడమే Deceiving oneself అంటున్నాడు. తార్కికంగా యోచించితే ఈ మోసగించుకోవటానికి పరిసమాప్తి చేయగలిగితే, ఈ యాంత్రికత నుంచి బయలుపడగలిగితే.... మరేదో రకమయిన 'ధ్యానం' వుందా? వక్త అంటున్నాడు. ఉంది. అయితే దాన్ని మీరు పరిశ్రమకు ఫలితంగా పొందలేరు, మీ శక్తినంతా దేనికో ధారాదత్తం చేసినందువల్ల పొందలేరు.... అంటున్నాడు. Absolutely silentగా ఉండటానికి సంబంధించింది అది, అంటున్నాడు. పరిపూర్ణంగా నిశ్శబ్దంగా మౌనంగా ఉండడం అది- అంటున్నాడు.

ముందుగా.... వినయంతో ప్రారంభం చేయండి.

**First of all, Begin very humbly, very, very humbly** అంటున్నాడు. అంటే చాల లలితంగా **very gently**- తోసుకుపోవడం, పరుగెత్తడం కాకుండా ప్రారంభం చేయండి. 'నేను చేస్తున్నాను.... నేను ప్రయత్నిస్తున్నాను' అనే భావన లేకుండా మొదలు పెట్టండి దీనికి ఎంతో మహత్తరమయిన **Sense** ఎరుక కావాలి. **Aloneness....** ఏకాంతం ఒక్కటే చాలదు, ఏదో మహత్తరమైన వివేకం.... అదేమిటో నేను వర్ణించను, వివరించను. ఎందుకంటే నేను దానిని వర్ణిస్తే వివరిస్తే.... మీరు ఆ వర్ణనలు, వివరణ పదాలు పట్టుకుంటారు. వర్ణిస్తే....ఆ వర్ణన అసలు వస్తువు'కాదు. చంద్రుడిని వర్ణిస్తాము. ఆ వర్ణన అంతా చంద్రుడు కాదు. హిమాలయాల చిత్తరువు హిమాలయాలు కాదు. అందుచేత....వర్ణన అంతటినీ నిలిపివేస్తాము; నిలిపి వేద్దాము. మీరే దానితో ఆటలు ఆడుకుంటారు – మామూలు ప్రక్రియల్లో దాన్ని బిగించి ఆటలాడు కోవడమో, ఆడకుండా వుండడమో చేస్తారు. అటువంటి ధ్యానంలో ఎలాంటి ప్రయత్నమూ లేదు; సాధన లేదు; ఆలోచన–భావన లేదు. మెదడు ప్రశాంతంగా వుంది. సంకల్పం వల్ల- ఇచ్ఛ వల్ల- ఉద్దేశ్యపూర్వకం వల్ల సాధించినది కాదు ఈ ప్రశాంతత. ప్రశాంతంగా వుంది, అంతే; ప్రశాంతంగా వుంది గనుక యిప్పుడు దానిలో అనంతమయిన వైశాల్యం వుంది **Infinite space.** నేను ఇంకా దీన్ని కొనసాగించాలని, వివరించి చెప్పాలనీ అనుకుంటున్నారా? నేను చెబుతున్నది విని దాన్ని పొడిగిద్దామనుకుంటున్నారా? ఏం మనుషులు మీరు!

మీ మెదడు ఎప్పుడయినా ప్రశాంతంగా వుందా?– అడుగుతున్నాను. మీ మెదడు ఆలోచిస్తోంది, భయపడుతోంది. ఆఫీసు పనిని గురించి- కుటుంబ వ్యవహా

రాల గురించి,కొడుకులకు-కూతుళ్ళకు ఏమేమి చేశాడు అని ఆలోచిస్తుంది. ఈ ఆలోచన అంతా సమయంలో, భావనలో పరిమితం అయివుంది. మీ మెదడు ఎప్పుడైనా ప్రశాంతంగా వుందా? మందుమాకులతో, విస్కీలాంటి మాదక పదార్థాలతో తయారయిన ప్రశాంతత కాదు. మీ నమ్మకాలతో, మీ విశ్వాసాలతో మిమ్మల్ని మీరు మందులతో నింపుకున్నట్లు చేస్తున్నారు. మీ నమ్మకాలు, విశ్వాసాలే మందుమాకులు. ఈ మందు ప్రభావంలో నిండిపోయి మీకు మీరే చెప్పుకుంటున్నారు. 'అవును ఇప్పుడంతా బాగుంది, సక్రమంగా వుంది. బుద్ధుడు యిలాగే చెప్పాడు.... అందుచేత ఇదే సక్రమమైనదై వుండాలి-' అనుకుంటున్నారు. ప్రతి మారూ- ప్రతి సమయమూ ఈ మందులలోనే కూరుకుపోతున్నారు. అందుచేతనే మహత్తరమయిన విషయాల లోనికి చొచ్చుకు వెళ్ళి ఆలోచించుకోగల శక్తి Energy మీకు లేదు. **You have no Energy of that kind that demands the penetration of Something immense.**

ఇప్పుడు మనం సృష్టి అంటే ఏమిటో తెలుసుకోవటానికి పునఃప్రయత్నం చేద్దాం. సృష్టి అంటే ఏమిటి? అది కనిపెట్టటం అనే దాంతో ముడిపెట్టుకుని లేదు. ఆది- మూలం- ప్రారంభం ఏమిటి సృష్టికి. ప్రాణం, జీవం అంటే ఏమిటి? దాన్ని గురించి ఏం అనుకుంటున్నారో చెప్పండి. జీవితం అంటే ఏమిటి? ఆఫీసులకు పోవడం.... అదంతా కాదు. లైంగిక వ్యాపారం, పిల్లలు- కనడం, కనకపోవడం.... యిదంతా కాదు. జీవితం అంటే ఏమిటి? సిమెంటులో కూరుకుపోయిన ఆ గడ్డి పరకకు ప్రాణం, జీవం యిస్తున్నది ఏమిటి? మనలో వున్న ప్రాణకిరణం- **Life**- ఏమిటి? అధికారం, అంతస్తు, గౌరవం, కీర్తి- లేక అపకీర్తి, అవమానం....ఇదంతా జీవితం కాదు. జీవితాన్ని గురించిన మన అవగాహనలో భాగం యిది. నిజంగా జీవితం అంటే ఏమిటి?

నా మాటలు యింకా వింటూ కూర్చున్నారేం? మీరు వింటూ కూర్చున్నట్లయితే మిమ్మల్ని అలా చేయాలనిపించేది యేమిటి? మీ వినడం వెనకాల వున్న ఉద్దేశ్యం ఏమిటి? మీకేం కావాలి? మీ కామనలు యేమిటి? కామనలన్నీ స్పందనలతో భాగం కదూ! ఈ అందమైన గడియారం కేసి చూస్తున్నాను. లేకపోతే విరూపం అయిన గడియారం వేపు చూస్తున్నాను. అది స్పందన **Sensation.** చూడడం ఒక స్పందనను అనుభూతిని తీసుకు వస్తుంది. ఆ వేదన నుంచి భావం పుట్టుకు వస్తుంది. ఒక రూపం తయారు చేస్తుంది. ఇదిగో, ఈ గడియారం. అందమయిన వస్తువు. దీన్ని

నా దగ్గరే అట్టే పెట్టుకుంటాను చూడడం అనే వేదన [Sensation], దాన్నుంచి భావన, రూపం, తరువాత కామన. **Desire**. ఇదంతా అతి సరళం—తేలికగా జరిగే పరిణామం,

వాతావరణంలో-పరిసరాలతో, సంప్రదాయాలతో నిండిపోని మెదడు వుందా మీకు ? సంప్రదాయం—సమాజం, సంఘం.... యిలాంటివన్నీ. ఇప్పుడు ప్రాణం యొక్క ప్రారంభం ఎక్కడో ఆలోచించండి. నా జవాబు కోసం ఎదురు చూస్తూ వున్నారా? ఇది చాలా గంభీరమైన ప్రగాఢమైన విషయం. దీనితో ఆటలాడుకుంటూ కూర్చోవటానికి కుదరదు. పేరులేని, అంతులేని విషయాన్ని గురించి శోధించటానికి **Enquire** చేయటానికి కూర్చున్నాం,మనం యిప్పుడు. నేను ఆ పక్షిని చంపగలను. మరో పక్షి వస్తుంది. అన్ని పక్షులనూ నేను చంపలేను, అంతమొందించలేను. ఈ ప్రపంచంలో ఎన్నో పక్షులు వున్నాయి అందుచేత మనం అసలు ఈ పక్షి ఎలా తయారవుతోంది అని పరిశీలించటానికి చూస్తున్నాం. దీని వెనకాల వున్న సృష్టి అంతా యేమిటో పరికించటానికి చూస్తున్నాం. దీన్నంతా వర్ణిస్తానని, నేను వర్ణిస్తే కులాసాగా విందామనీ చూస్తున్నారా మీరు? నేనే దానిలోనికి ఆసాంతం వెళ్ళాలని వుందా మీకు? ఎందుచేత?

(శ్రోతలలో నుంచి) సృష్టి అంటే యేమిటో అవగాహన చేసుకునేందుకు.

మీరెందుకు యిలా ప్రశ్నిస్తున్నారు? నేను ప్రశ్న వేశాను గనుకనా?

ఏ వర్ణన, వివరమూ కూడా ఆదిని - మూలాన్ని - సవిరంగా విస్తారంగా చెప్పలేదు.

ఆది [**Origin**]కి పేరులేదు. ఆది-పరిపూర్ణంగా ప్రశాంతమైనది. (**Absolutely Quiet**) చప్పుళ్ళు చేసుకుంటూ నడయాడడం కాదు, అది.

సృష్టి అనేది అత్యంత పవిత్రమైనది. జీవితంలో—జీవంలో ఎంతో పవిత్రమైనది అది.

మీ జీవితాన్ని అతలా కుతలం చేసుకున్నట్లయితే- **If you have made a mess of your Life, Change it** — దాన్ని మార్చుకోండి.

దాన్ని యీ రోజే మార్చుకోండి. రేపు కాదు.

**Change It Today, Not Tomorrow.**

మీకు అనిశ్చితం అనిపిస్తే, ఎందుకు అలా అనిపిస్తోందో కనిపెట్టండి. కనుక్కోండి. నిశ్చితం అవండి.

**If you are Uncertain, find out why and be Certain-**

మీ ఆలోచన సూటిగా, నేరుగా లేకపోతే, దాన్ని సరిపరుచుకోండి. తార్కికం చేసుకోండి. **Think straight, Logically.**

అదంతా సిద్ధ పరచుకోకపోతే, అంతా సమాయత్తం చేసుకోకపోతే మీరు ఈ ప్రపంచంలో ప్రవేశించలేరు. ఈ సృష్టి అనే ప్రపంచంలో అడుగు పెట్టలేరు.

అది ముగుస్తుంది [**It Ends**].... ఈ రెండు మాటలూ దాదాపు వినబడ లేదు. మాటలు బయటకు రాలేదు కేవలం లీలా మాత్రంగానే [**Breathed Rather than spoken**].

ఇదే చివరి భాషణ [**Last talk**]. కొంతసేపు ప్రశాంతంగా కూర్చుండి పోదాం అనుకుంటున్నారా? సరే, అలాగేనండి. కొంతసేపు ప్రశాంతంగా కూర్చోండి?

ఆయన కోరిక మేరకు శ్రోతలందరూ కొన్ని క్షణాలు మౌనంగా కూర్చుని తరువాత నిశ్శబ్దంగా నడచి వెళ్ళారు.

చప్పుడు లేని ఆ నడక సవ్వడి యింకా శ్రోతల హృదయాలలో మెదులు తూనే వుంది. ఆ ప్రసంగ పాఠాలు చదువుతున్న తరువాత తరం చదువరుల మనస్సులనూ యింకా ప్రభావితం చేస్తూనే వుంది.

ఇది నిరంతరం కొనసాగే నిరతిశయ నివేదిక.

# కృష్ణమూర్తి పద్ధతి

మనిషిని నిర్నిబద్ధంగా పరిపూర్ణంగా స్వేచ్ఛా యుతుడిని చేయడం విముక్తుడిని చేయడం....ఇదిఒక్కటే తన పని అని కృష్ణమూర్తి 1929లో చెప్పారు. అదే పల్లవిని చివరంటా పాడుతూ వచ్చారు.

ఇలా విముక్తుడిని చేయటానికి ఆయనకు ఏమయినా ప్రత్యేక 'పద్ధతి వున్నదా—అన్న ప్రశ్న కొందరు సమాలోచన చేస్తూ వుంటారు. ఆయన ఉపన్యాసాలు వింటుంటే, పుస్తకాలు చదువుతూ వుంటే—ప్రస్తుతం అమలులో వున్న అనేక విధానాలను నిర్ద్వంద్వంగా ఖండించడం మటుకే కనిపిస్తుంది గాని, ఒక దారిని యేర్పాటు చేసి మనిషిని దాని మీదుగా-ద్వారా- క్రమంగా ముందుకు-పైకి తీసుకు వెళ్ళే పద్ధతి కనిపించదు. భగవంతుడిని గురించి , మతాన్ని గురించి ఆయన వెలి బుచ్చే అభిప్రాయాలు ఆకుకు అందక పోకకు పొందక వున్నట్లు అగుపిస్తాయి. ఇదీ దారి—అని ఖచ్చితపరచి నొక్కి చెప్పితే దానిని ఆలోచించటానికి, అనుసరించటానికి జనం తయారుగా వుంటారు. కాని కృష్ణమూర్తి యీ విధానాన్ని తిరస్కరిస్తారు. అందుకనే ఆయనను అర్ధం చేసుకోవడం, అవగాహన పరిధిలోనికి తీసుకు వచ్చి ఆదరణ సూత్రాలు తయారుచేసుకోవడం కష్టం అయిపోతోంది.

జపతపాదులు, యజ్ఞయాగాదులు, మంత్ర తంత్రాలు, పూజాపునస్కారాలు దేవుళ్ళు, నీతి సూత్రాలు యివేవీ మనిషిని ముందుకు తీసుకుపోవు, విముక్తుడిని చేయవు—అని ఆయన ఖచ్చితంగా చెబుతారు. ఈ మాటలు వినగానే సామాన్య మానవుడికి కొంత ఎబ్బెట్టుగాను, తిరోగమన ధోరణిగా వ్యవహరిస్తున్నట్లు అనిపిస్తుంది. యుగయుగాలుగా మనిషి యీ చర్యలన్నిటినీ ఆశ్రయించుకున్నాడు, అయినా సత్ఫలితాలను పొందలేదు. కనుక వీటివల్ల యేమాత్రమూ ప్రయోజనం లేదు-అంటారు కృష్ణమూర్తి.

అలవాటులోను, ప్రచారంలోను వున్న పద్ధతులను తిరస్కరిస్తున్నట్లుగా కనిపించినందువల్ల-మామూలు ఆలోచనా పరుడికి కొంత తికమక యేర్పడుతుంది.

అన్నీ తిరస్కరిస్తాను—అయితే ఏమవుతుంది? నేను యేం చేయాలి? ఏ కొమ్మను పట్టుకోవాలి?—అని అడుగుతాడు మనిషి.

ఏ కొమ్మనూ పట్టుకు పాకులాడే ప్రయత్నం చేయకు-శాఖా సంక్రమణం వల్ల అసలే ప్రయోజనం లేదు నిన్ను నీవు పరిశీలన చేసుకో. పరీక్షగా చూచుకో. ఏ మార్పులు చేర్పులు తీసుకు రాకుండానే జాగ్రత్తగా పరిశీలించినందు వల్లనే నీలో తగిన మార్పు సహజ సిద్ధంగా వస్తుంది-అంటారు ఆయన. జీవితానికి సంబంధించిన అనేక మౌలిక అంశాలున్నాయి. వాటిని అన్నిటినీ దురర్థం చేసుకుంటున్నాం మనం. జీవితాన్ని యధాతథంగా-ఉన్నది ఉన్నట్లుగా చూచి అనుభవించగల స్థాయికి చేరుకోవాలి. అలా చేయకుండా ఎన్నో మానసిక వికారాలు యేర్పరచుకున్నాం. ఈ వికారాలన్నీ వదల గొట్టుకోవాలని తెలిసినప్పటికీ, అందుకు ఎన్నో సంఘర్షణల్లో చిక్కుకుపోయి జీవితాన్ని మరింత సంక్లిష్టం, గందరగోళం చేసుకుంటున్నాం. దీన్ని గమనించి సరిచేసుకునే స్థితికి సహజంగా చేరుకోవాలి—అంటారు.

ఈ ప్రపంచం మనది. దీనికి-యిక్కడ జరుగుతున్న ప్రతిదానికీ బాధ్యత మనది. ఈ బాధ్యత తీసుకోకుండా-పై వాడి మీద, పక్కవాడి మీద తోసివేసి చేతులు దులపరించుకుంటున్నాం. ఇది సబబయిన పని కాదు-అని గుర్తు చేస్తారు కృష్ణమూర్తి

మనిషిలో సమాజంలో మార్పు తీసుకురావడం కోసం కృష్ణమూర్తికి ఒక పద్ధతి వున్నదా లేదా? ఒక పద్ధతి అనగానే యిక దానిని గురించి ఆలోచించకుండా-గుడ్డిగా అనుసరిస్తూ పోవడమే అనుకుంటాం. ఆది కూడని పని. గమ్యం మనసులో, హృదయంలో స్పష్టంగా సూటిగా వుంటే—దానికి తీసుకు వెళ్ళే మార్గం-పద్ధతి-ఎప్పటికప్పుడు అందుకు అవసరం అయిన మార్పులు చేర్పులు చేసుకుంటూ పోతుంది.

ముందుగా మన దైనందిన జీవితాలను పరిశీలించుకోగలగాలి-నిష్పాక్షికంగా. ఆదే ఆత్మ పరిశీలన. ఉన్నదానిని ఉన్నట్లుగా చూచుకోవడం. మళ్ళీ ఏదో సిద్ధాంత దృష్ట్యా, తాత్త్విక సంప్రదాయాల గిటురాయిలో మానసిక విశ్లేషణల్లో చిక్కుకు పోవడం కాకుండా వీటన్నిటినీ అర్థం చేసుకునే ధోరణిలో పనిచేయాలి. అంటే మన చుట్టూ మనం ఏర్పాటు చేసుకున్న మానసిక వాతావరణాన్ని క్షుణ్ణంగా అర్థం చేసు

కునే ప్రయత్నం చేయాలన్నమాట. ఈ వాతావరణానికి మూలం 'భయం' అన్న సంగతి గమనించాలి. భయానకమైన స్థితి కల్పించుకుంటున్నాం ముందు. ఈ భయం నుంచి భద్రత కోరుకుంటూ అనేక నిర్మాణాలు చేసుకుంటున్నాం మన చుట్టూరా. ఎన్నో పంజరాలు ఏర్పరచుకుంటున్నాం. వాటిని పైకెత్తుతూ కీర్తిస్తూ కాలం గడుపుతూ అదే 'విముక్తి' అనుకుంటున్నాం. మనం ఏర్పాటు చేసుకున్న భయానికి మూలం 'సమయం'-'భావన' అనే విషయం గమనించం. సమయం అనగానే భూతకాలం, వర్తమానం, భవిష్యత్తు....అనే విభాగాలు ముందుకు వచ్చి నిలుస్తాయి. కాని వర్తమానంలోనే భూతకాలం, భవిష్యత్తు యిమిడి వున్నాయని మరచిపోతాం. వర్తమానంలోనే సమయం అంతా ముడుచుకుపోయి వున్నది. ఇప్పుడు మనం ఎలా వున్నామో—రేపూ అలాగే వుండాలి—యీ లోపల ఏదయినా మానసిక పరిణామం ఏర్పడి, మెదడు కణాలలో ఆకస్మిక మార్పులు రాకపోతే! ఇలాంటి మానసిక ఆకస్మికతకు (Mutation) ప్రాధాన్యం యిస్తారు కృష్ణమూర్తి.

మన మంతా ప్రయాణం చేస్తున్నాం. బహుదూర ప్రయాణం. చాలా సంక్లిష్టమైన ప్రయాణం కూడా. ఎత్తయిన ఎవరెస్ట్ శిఖరమో యింకేదో పర్వతమో ఎక్కటానికి ప్రయత్నం చేస్తున్నాం. అప్పుడు సాధ్యమైనంత తక్కువ బరువు, సరంజామా మనతో తీసుకు వెడతాం. ఎంతో వెనక్కు జారవిడవలసి వస్తుంది. ఎత్తుకు మనం బరువుల్నీ మూటల్నీ మోసుకు పోలేం. ఆధ్యాత్మిక ప్రయాణం ప్రసక్తి వచ్చినప్పుడు యిదంతా నేర్పుగా మరచిపోతాం.

మనిషికి 'భయం' వుంది. దీనికి వ్యతిరేకంగా 'సుఖలాలసత' వుంది. ఈ సుఖలాలసతకు అంతరాయం ఏర్పడుతుందేమోనని భయం. సుఖలాలసత ఎన్నో రకాలు—ఇంద్రియసుఖం, శరీరసుఖం, మానసిక సుఖం, సంపద—భోగభాగ్యాల సుఖం—చాకచక్యం నైపుణ్యం సంపాదించే సుఖం. భగవంతుడిని తెలుసుకుందామనే తృష్ణ తెచ్చిపెట్టే సుఖం—ఇలా ఎన్నో రకాలు. అన్నిటినీ యధాతథంగా చూడండి....ఏ రకమైన భ్రమ ప్రమాదాలు లేకుండా గమనించండి. మిమ్మల్ని మీరు చూచుకోవటానికి, ఆత్మ పరిశీలన చేసుకోవటానికి భయపడకండి. దురదృష్టకరమైన విషయం ఏమంటే—మనకు ఏదో దురభ్రమలో చిక్కుకు పోవడమే సులభం అనిపిస్తుంది ప్రతిదాన్నీ ఏదో ముసుగు తొడుగు వేసి చూస్తాం తప్ప, ఉన్నది ఉన్నట్లుగా చూడం. మనలోకి మనం స్పష్టంగా-సూటిగా-నిశితంగా చూచుకోవాలంటే

పరస్పర సంబంధాల దర్పణం (Mirror of Relationship) తప్ప యింకో మార్గం లేదు. మన దగ్గర ఉన్నది యీ దర్పణమే. తల దువ్వుకుంటున్నప్పుడో ముఖానికి పౌడరు అద్దుకుంటున్నప్పుడో అద్దంలో మన ముఖాన్ని చూచుకుంటాం. అప్పుడు ఆ అద్దం మన ముఖాన్ని ఉన్నది ఉన్నట్లుగా చూపుతోంది. ఇది భౌతికం-స్థూలం-అయిన ఏర్పాటు. మానసికంగా కూడా నేను ఏమిటి,నా స్థితి ఏమిటి తెలుసుకోవటానికి ఒక అద్దం వుంది. అదే పరస్పర సంబంధాల దర్పణం!

"భగవంతుడు, శాంతి, ఆదర్శం, సుఖలాలస....యితరులపై ఆధిపత్యం సంపాదించడం కోసం మనిషి యేవేవో పనులు చేయడానికి అలవాటు పడిపోయాడు. మీరు గమనించారో లేదోగాని యితరుల మీద అధికారం,ఆధిపత్యం సంపాదించడం అంత అసహ్యమైన పని యింకొకటి లేదు'—అంటారు కృష్ణమూర్తి. భార్యమీద భర్త, భర్తపైన భార్య ఆధిపత్యం, పెత్తనం సంపాదించడం కోసం బహు విధాల ప్రయత్నం చేయడం–సాంఘికంగా ఎన్ని దురాగతాలకు దారితీస్తోందో మనం చూస్తూనే వున్నాం. జీవితంలో అత్యంత దుర్మార్గం, దురాగతం అయిన పని—ఆధిపత్యం వైపు మొగ్గు చూపించడం....అంటారు ఆయన.

భయం ఒకపక్క-సుఖలాలసత మరొకపక్క భయాన్ని విశదంగా, ప్రగాఢముగా, సునిశితంగా తెలుసుకుందుకు ప్రయత్నం చేసినట్లే సుఖలాలసత గురించి కూడా తెలుసుకునే ప్రయత్నం చేయాలి.

అందమయిన వస్తువును చూడడం, సూర్యోదయమో, సూర్యాస్తమయమో ఎంత సుందరంగా వుంటుందో తిలకించడం, రంగురంగుల చిత్రాలు గమనించడం సూర్యుడి ప్రతిబింబం నీళ్ళమీద ప్రతిఫలించడం....యిలాంటివి ఎంతో హృదయానంద కరంగా వుంటాయి. అయితే వీటిని మనం అలా మధురస్మృతులుగా వుంచుకుందాం అనే ధ్యాసతో వాటిని మనసులో ముద్రలుగా జ్ఞాపకాలుగా తయారు చేసుకుంటాం. కృష్ణమూర్తి ఏమంటారంటే-యిలా ప్రతి మధురమయినదాన్ని జ్ఞాపకంగా మలుచుకోవటానికి ప్రయత్నం చేయకండి. ఆ క్షణంలో అలా జాగ్రత్తగా చూడండి అంతే!

కృష్ణమూర్తి మరో విషయంలో మనను ఎప్పటికప్పుడు హెచ్చరిస్తూవుంటారు. ఉదయం లేచింది మొదలు రాత్రి నిద్రపోయేంత వరకూ మనం అనేక పనులతో తల మునకలయి వుంటాం. భౌతికంగా-అంటే స్థూలకాయంతో పనులు చేయడమే కాదు;

మనస్సుతో క్షణం విరామం లేకుండా వ్యవహరిస్తాం. మన మెదడు ఎప్పుడూ 'వాగు తూనే' వుంటుంది. నిరంతరం Chatter చేస్తూ వుండే యీ మెదడుకు మౌనం నేర్పవలసిన అవసరం వుంది. ఒక విషయం మీద నుంచి మరో విషయానికి మనకు తెలియకుండానే దూకేస్తూ వుంటాం. అంతేకాదు, పగటి కలలు, రాత్రికలలు కంటూ వుంటాము. మెదడు ఎప్పుడూ విశ్రాంతంగా వుండదు. పనిలో మునకలై వుంటుంది. 'పని' అంటే ఏమిటో కూడా మనం వివరంగా తెలుసుకోవాలి. ఎప్పుడో జరిగిపోయింది, యిక ముందుకాలంలో చేయబూనుకున్నదీ 'పని' కాదు అంటారు కృష్ణమూర్తి. పని అంటే 'వర్తమానం'లో మనం చేసేదే. ఇప్పుడు మనం,పూర్తిగా, సరిగా, నిరాటంకముగా, నిరుద్దేశ్యపూర్వకంగా చేసేదే 'పని'. ఏదో ఆదర్శం కోసం చేసేది పని కాదు. ఆదర్శాలతో పద్ధతులతో ఏదో ప్రయోజనం కోసం చేసేది అసలే పని కాదు. వీటిలో సంఘర్షణలు అనేకం వుంటాయి. అందుచేత పనిని గురించి దీనిలోని మెలుకువలను గురించి ఆలోచించి చూచుకోవలసింది చాలా వుందంటారు —కృష్ణమూర్తి.

మనం అతలాకుతలం; గందరగోళం అయిన జీవితం గడపటానికి అలవాటు పడిపోయాం. వాటిలోనే సుఖం, శాంతి వున్నాయని భ్రమించే స్థితిలో కూడా పడి పోయాం. ఈ ప్రపంచం ఎలా వుందో ఒక్క క్షణం చూస్తేచాలు—ఈ విషయం అతి స్పష్టంగా మన కళ్ళముందు కదుతుంది. మనం చెప్పేది ఒకటి, చేసేది మరొకటి, ఆలోచన ఒకతీరు, ఆచరణ మరోతీరు. ప్రపంచంలో అనుక్షణం యుద్ధ ప్రమాదం, శాంతికి భంగం కలిగించే వాతావరణం. పేదరికాన్ని నిర్మూలించాలని ఒకమారు అనుకుంటాం. సాంఘిక వ్యవస్థను సరిచేయడం తప్పనిసరి పని అని తీర్మానించు కుంటాం. తీరా మనం చేసే పనులు తద్విరుద్ధంగా వుంటాయి! గందరగోళం అయిన స్థితిని అంతమొందించకుండానే మరో విలయం వచ్చి పడుతుంది. మనస్సు గందరగోళంగా తయారవుతుంది. ఇలా గందరగోళంగా తయారయిన మనస్సుతో శాంతిని క్రమతను సంస్థాపించుకోలేము. మనస్సుకు స్పష్టత, సూటితనం కావాలి. మన జీవితాలలో ముందుగా అవ్యవస్థ తొలగించుకోవాలి. ఈ తొలగింపుతో క్రమత-వ్యవస్థ రూపొందుతాయి. ఇదంతా సహజంగా జరగాలి. ఏదో అంచనాలు వేసుకుని దీనిని తయారు చేసుకోవడం కుదరదు. ఈ పని ఎట్లా చేయాలో అని విచారిస్తు న్నాము మనం. విషయాలు పోగుచేసుకోవడం ఒక పద్ధతి. వీటినుంచి వివేకం పొందటం మరో అంతస్తు. వివేక సమపార్జన క్రమానుగతంగా, నిరంతరం జరు

గుతూ వుండవలసిన పని. విషయాలు పోగుచేసుకోవడం పరిమితమైన చర్య. వివేక సముపార్జనకు వక్రత లేకుండా, దురూహలు లేకుండా చూడడం చేతనవాలి. ఇది పోగుచేసుకునే వ్యవహారం కూడా కాదు. ఒక్క క్షణంలో-తృటిలో-ఆకాశంలో నక్షత్రంలా ధగ ధగ వెలుగుతుంది. కాంతిరేఖలా జ్వలిస్తుంది. కనుక-మన జీవితాలలో అక్రమత, గందరగోళం తొలగించుకుంటే సహజ సిద్ధంగా ఎలాంటి అరమరికలు లేకుండా క్రమత ఏర్పడుతుంది. క్రమత ఉండడమే ఉదాత్తమైన విషయం. ఎవరో విధించినదీ, అధికార యతంగా పురమాయించినదీ కాకుండా....క్రమంతో కూడినదంతా సహజసిద్ధమైన సుగుణంగా భానిస్తుంది.

ప్రపంచంలో ఎంతో దుఃఖం వుంది, ఖేదం వుంది. బాధలు, ఇబ్బందులు వున్నాయి. పసిపిల్లలు స్కూళ్ళకు వెళ్ళటానికి మైళ్ళదూరం నడిచి వెడుతూ వుండడం అగుపిస్తుంది కొన్ని దేశాలలో. కారుకి నోచుకోనివాళ్ళు, వేడినీళ్ళ స్నానానికి అర్హత లేనివాళ్ళు కొన్ని దేశాలలో వున్నారంటే మీకు ఆశ్చర్యం అనిపించకపోవచ్చు. శరీరాన్ని ఆచ్ఛాదన చేసుకుందుకు అవసరం అయినంత బట్టలేని కుటుంబాలు ఎన్నో! ప్రపంచంలో కార్లు, వేడినీళ్ళ యంత్రాలు, బట్టల తయారీ ఎంతగా పెరిగి పోతూవున్న యీ దేశదరిద్రం మటుకు మటుమాయం కావడం లేదు. చదువు-వ్రాత రానివాళ్ళు లక్షలు, కోట్లు, తన విషయం తనకు తెలియనంత అజ్ఞానంలో కూరుకుపోయి వున్న మనుషులు ఎంతమందో లెక్కించలేము. ఈ విచారం అంతా-ఖేదం అంతా సమిసి పోయేందుకు మనం ఏమయినా చేయగలమా? క్రూర చర్యలు చేయకుండా జనాన్ని అరికట్టలేమా? క్రూరత్వం వల్ల ఎంత ఖేదం పోగవుతుందో గమనించే తెలివితేటలు మనకెందుకు లేవు?

—పుస్తకాలలోంచి, ప్రయోగాల అనుభం వల్ల సేకరించిన విషయాలు కావు యివన్నీ. ఆషామాషీగా జీవితాన్ని గడిపివేయడం కోసం చూడకుండా- ప్రతిదీ పరిశీలనగా గమనించగలిగితే యిదంతా మన కళ్ళ యెదురుగానే వుంది: ఈ దుఃఖం, ఈ పరితాపం, ఈ చింత.... ఎప్పటికయినా పరిసమాప్తి అయిపోతుందా లేదా అని మనను మనం ప్రశ్నవేసుకు చూడాలి. ఈ దుఃఖాన్ని నేను క్రొత్తగా తీసుకువచ్చి మీ మీద రుద్దటానికి ప్రయత్నం చేయడం లేదు సుమండీ! ఇదంతా అనాదిగా వున్నదని తృప్తిపడకుండా. దీనికి అంతం తీసుకు రావడం ఎలాగా అని ఆలోచించండి మీరు, అంటారు 'కృష్ణమూర్తి. ఇందుకు వారు చెప్పే మరో మూల విషయం

యేమంటే ఖేదం, చింత వున్నచోట ప్రేమ, ఆనందం వుండలేవు. మీరు మీ మీ స్వంత విచారాలలోనే మునిగిపోయివుంటే ప్రేమ సాగరాన్ని ఎలా ప్రవహించనీయ గలుగుతారు?

దుఃఖం దానిని అనుభవిస్తున్న మనిషి కంటె వేరయినది కాదు. బాధలో వున్నవాడు దాని నుంచి పరుగెత్తుకుపోవాలని ప్రయత్నం చేస్తాడు. అలా కాకుండా దాని వయిపు ఒక పసి పిల్లవానిని చూచినట్లుగా చూడండి. దాని నుంచి పరుగెత్తుకు పోవడం, తప్పించుకుందుకు ఉపాయాలు ఆలోచించడం కాకుండా దానిని కొంత సేపు మీతోనే కట్టిపడవేసి వుంచడం, నిలిపివేయడం, చేయండి. అప్పుడు మీకు తెలిసివస్తుంది. దుఃఖాన్ని ఖేదాన్ని అంతమొందించటానికి మార్గం వున్నదని. దుఃఖానికి- విచారానికి—ఖేదానికి అంతం వున్నప్పుడు ఒక రకమైన తన్మయత **Passion** బయలుదేరుతుంది. మనను గురించే మనకు ఏదో సానుభూతి, దురాశ, నిరాశ యిలాంటివన్నీ వుంటే యీ రకమైన **Passion** ఏర్పడదు.

మనలో ఎంతో శక్తిపాతం వుంది. ప్రపంచంలో యీ శక్తి ఎలా వినియోగం అవుతోందో చూడండి. కొత్త కొత్త పరికరాలు, మారణాయుధాలు కనిపెట్టటానికి శక్తి అంతా వినియోగం అవుతోంది. చంద్రమండలానికి యితర గ్రహయానాలకు ఎంతో శక్తి ఖర్చవుతోంది. ప్రేమ అనే లక్షణం ఆహ్వానిస్తే, ఆవాహన చేస్తే వచ్చేది కాదు. సహజంగా సజావుగా వస్తుంది, అంతే. ఆత్మ పరిశీలన వల్లనే యిది సాధ్యపడుతుంది. ప్రేమ వున్నచోట కరుణ కూడా వుంటుంది. కరుణకు ప్రత్యేక మైన వివేకస్ఫూర్తి వుంటుంది. ప్రేమ కరుణ సంపూర్ణంగా విలసిల్లినప్పుడు వివేక స్ఫురణ, ప్రకటన సృజనాత్మకంగా వుంటాయి. దానిలో యాంత్రికత యేమాత్రం వుండదు— అంటారు కృష్ణమూర్తి.

మృత్యువు గురించి ఆయన అభిప్రాయాలు, సూచనలు చూడడం గూడా అవసరం. మరణంతో అంతా అయిపోతుందా? కథంతా సమాప్తం అయిపోతుందా? కొన్ని దేశాలవారు పునర్జన్మ వున్నదంటారు. కర్మ అని ఇంకొక మాట కూడా వుంది. కర్మ అంటే పని చేయడం. పని చేస్తే ఫలితం వుంటుంది. ఒక జన్మలో యేమి పనులు చేస్తే, వాటి ఫలితాలు మరు జన్మలో వచ్చి తీరుతాయని కొందరు నమ్ముతారు. జన్మాంతంలో చేసిన పనులన్నిటికీ పారితోషికం. పరిశిక్ష వుంటాయని మరికొందరు విశ్వసిస్తారు. ఈ రకాల వివాదాలను కాస్సేపు పక్కన పెట్టి యీ విష

యాన్ని గురించి కొత్తగా ఆలోచించటానికి వీలుంది. మృత్యువు అంటే ఏమిటి? శారీరకంగా అంతమయి పోవడం మటుకేనా? వైఖరులు, ఆశాపాశాలు, వ్యక్తిగత అభిప్రాయాలు, ఆకాంక్షలు- నిరసనలు....సంపాదించుకున్న మానసిక ఆస్తిపాస్తు లన్నీ కూడా అంతం అయిపోతాయా? ఎన్నో పోగుచేసుకుని కూర్చుంటాం మనం. చావు వచ్చి 'అయ్యా, మీరు యివన్నీ మీతో తీసుకురావటానికి కుదరదు!' అంటుంది. అందుచేత- అసలు మృత్యువు అంటే యేమిటో తెలుసుకోవడం, పరిశీలించి ఎఱుక పరచుకోవడం అవసరం. పుట్టటం, పెరగడం, సుఖదుఃఖాల మధ్య ఓలలాడడం, రోగగ్రస్తులు కావడం, మతి పోగొట్టుకోవడం, యాంత్రికంగా అనేక పనులు వరుస ప్రకారం జరుపుకుంటూపోవడం....వీటన్నిటి మధ్య మృత్యువువచ్చి పలుకరించడం- దాన్ని గురించి మనం భయావహులమై పోవడం జరుగుతోంది.అంతేగాని మృత్యువు యొక్క గొప్పదనాన్ని మనం గమనించకలేకపోతున్నాం. పుట్టుకను గురించి ఎంతో విశేషంగా చెప్పుకుంటాం. చావు కూడా యింత విశేషమయినదే. దాని ప్రగాఢత అసలు స్వరూపం అర్థం చేసుకోవటానికే జంకుతాం మనం.... పోగుచేసుకున్న వస్తువులన్నిటినీ బలవంతాన వదులుకుని ముందుకు వెళ్ళిపోవడం—మృత్యువు అంటే. కాని యిది మనకు యిష్టం వుండదు. మనం కొన్ని మూలాలు ఏర్పరచుకు వుంటాం. వాటిని పెకలించుకు యివతల పడడం అసాధ్యం- అసంగతం అను కుంటాం. పోగుచేసుకున్నదంతా ఒక్కమారు యే తొంభయి యేళ్ళ తరువాతనో పోగొట్టుకోవడం కాకుండా, ఎప్పటికప్పుడు—జీవితం పొడుగునా వదిలించుకుంటూ పోతూవుండడం సాధ్యమా? ఆత్మహత్య చేసుకోవడం కాదు. ఏ రోజుకారోజు పోగు చేసుకున్నదంతా వ్యయం చేయడం. కొనసాగుతూ వున్నదానిని పునర్నిర్మాణం చేయడం అసాధ్యం. పునర్నిర్మాణం జరగాలంటే—ఒకమారు అంతం అయిపోవాలి. కొత్తగా మళ్ళీ బయలుదేరాలి; కొనసాగడం కాదు. పోగుచేసుకున్న ఆస్తిపాస్తులతో పాటు విచారాలు, దుఃఖం, ఖేదం.... అంతా అంతమయిపోవాలి. కొనసాగడం కంటె అంతమైపోవడం చాల అవసరం—మృత్యువు పరిధిలో. అంతమవడం అంటేనే- కొత్తగా మళ్ళీ ప్రారంభం కావడం అన్నమాట! అంతమవకుండా కొన సాగుతూవుంటే మరో మూసలో పోసి నడిపించుకుపోతూ వున్నట్లు లెక్క.

ప్రపంచాన్ని మన యిష్టం వచ్చినట్లు- అన్ని రకాలుగానూ పాడుచేశాం. అంతతో వూరుకోకుండా అన్ని కోణాలనుంచీ మళ్ళీ దానిని బాగుచేయాలని విశ్వ ప్రయత్నం చేస్తున్నాం. రాజకీయంగా, మతపరంగా, సాంఘికంగా, ఆర్థిక ప్రాంగ

ణములో,....యిలా రకరకాలుగా మార్పులు
స్తున్నాం. వ్యవస్థలు, సంఘాలు పనిచేయకుం
గతం చేయడం కోసం సరికొత్త వ్యవస్థలు,
కొత్త పేర్లు తయారు చేసి ప్రచారాలు చేస్తా
పోవడం, అత్యున్నతి అనుకుంటాం....యుద్ధ
ఆపడం ఎట్లా అని చర్చలు చేస్తూనే వుంటాం
టాన్ని మనం గుర్తించి గౌరవిస్తూ కూర్చుం
ముఖాలను....తీసుకు వచ్చి ప్రజల ముందు
జరిగిపోతూ వుంది. దీనినంతటినీ సమాప్తం
ముఖాముఖీ బతకడం జరుగుతుందా? అదే
కరుణ, వివేకస్ఫూర్తి వున్నాయి. ఇది పరిస
వుంటుంది.

మనిషి మతాన్ని గురించి కూడా యి
చేరుకుందుకు ప్రయత్నించాడు. పవిత్రమైన
చూస్తున్నాడు. పవిత్రత అంటే యేమిటి? కా
పోయి వుండనిదీ కాదూ? దానికి పేరు లేదు
అవదు. మనిషి దీనిని పట్టుకోవడం కోసం
సూర్యుడిని, భూమిని, ప్రకృతిని, చెట్లను,
ప్రతిదానినీ పూజించడం చేశాడు. వేదాలు....ఉప
మీరు. వాటిలో ఎక్కడా భగవంతుడి ప్రసక్తి లేదు, పేరు లేదు. అవి చెబుతూవున్న
దల్లా....పరమ ప్రామాణికం అయినదీ, అత్యున్నత పదార్థమూ ఎప్పుడూ వ్యక్తం
కాదు-అనే!

అసలు అలా పవిత్రమయిన వస్తువు అంటూ యేదయినా వున్నదా అని మనం
కూడా యిప్పుడు ప్రశ్నలు వేసుకుంటున్నాం. మతాల మాదిరిగా వ్యవస్థీకరణ జరగ
కుండా భావాతీతంగానే వుండిపోయినది యేదయినా వుందా? మతాలకు ఎన్నో
పేర్లు వున్నాయి. ఎన్నో పద్ధతులు, ప్రక్రియలు వున్నాయి. బౌద్ధమతంలో దేవుడు
లేడు. హిందూమతంలో మూడు కోట్ల దేవతలు; ఎంతో పెద్ద సంఖ్యలో దేవుళ్ళు

దేవతలూ వుంటే తమాషాగానే ఉంటుంది. వాళ్ళతో హాయిగా ఆడుకుంటూ కూర్చో వచ్చు మనం. మత మౌఢ్యం మరోపక్క విస్తరిస్తూ విచ్చలవిడిగా మనిషిని నరికి పోగులు పెడుతూ వుంది.

మతాన్ని గురించి- దానికి అనుసరణీయంగా వుండే మెదడు....జీవితాన్ని గురించి ఆలోచించాలంటే పరిపూర్ణమైన స్వేచ్ఛ ఉండాలి. ఒక వస్తువు నుంచి ఒక ఆలోచన నుంచి స్వేచ్ఛ కాదు: పరిపూర్ణమైన స్వేచ్ఛ;....ఈ రెంటికీ వ్యత్యాసాన్ని జాగ్రత్తగా గమనించాలి ఇటువంటి స్వేచ్ఛ ఉన్నప్పుడు ఖేదం, దుఃఖం, విచారం.... యిలాంటి వన్నీ ప్రపంచంలో సమసిపోతాయి. ఆదుర్దాలు ఒంటరి తనాలు వాటికి సంబంధించిన చికాకులు తొలగిపోతాయి. మత ధోరణుల గురించి యీ రకమైన ప్రశ్నలు వేసుకు చూచుకోవాలి.

ధ్యానం అంటే యేమిటో అర్థం చేసుకోవాలి. ధ్యానాన్ని గురించి యోగులు- మతానుయాయులు- గురువులు- మూఢులు....ఎన్నో యాంత్రికమైన విషయాలు వెల్లడించారు. వీటన్నిటి మధ్య నిజంగా ధ్యానం అంటే యేమిటి- అని మనం పరిశీలించగలగాలి. ధ్యానం అంటే ఒక వేడుకా? లేక జీవితంలో ఒక క్రమం తీసుకు రావటానికి చేసే ప్రయత్నమా? ఒక్కో మతానికి, ఒక్కో సంప్రదాయానికి ధ్యాన పద్ధతులు వేరుగా వుంటాయి. నియమిత పద్ధతిలో నడిపేదయితే ధ్యానం సృజనాత్మకతను తీసుకు రాగలుగుతుందా? అక్షరాలు వల్లె వేసుకుంటూ కూర్చోవడం, పాడిన పాటలే పాడుతూ వుండడం ధ్యానం అవుతుందా?

మనిషి డబ్బు సంపాదించాలనుకుంటున్నాడు. దాని కోసం కొన్ని పనులు చేస్తున్నాడు. అలాంటిదేనా 'ధ్యానం' అంటే? శాంతి సమరసత సుఖం కావాలనే వుద్దేశ్యంతో ధ్యానం చేయడం అంటే యేమిటి మరి? భౌతిక సుఖాల కోసం లాలస కోసం ఆస్తులు, డబ్బు, జయం, కీర్తి సంపాదించుకుంటున్నారు. అలాగే ఆధ్యాత్మిక లాలస కోసం ధ్యాన ప్రక్రియల వెనకాల పరుగులు తీస్తున్నారు. పూర్వ నిశ్చితమైన ప్రక్రియ కాకుండా ధ్యాన స్వరూపం వేరుగా ఉండటానికి వీలుందా? నిరంతర గమనంతో నిప్పులా వెలిగి పోతూవున్న జ్వాల మాదిరిగా ధ్యానాన్ని రూపొందించుకోవచ్చునా? ఏదో- ఫలితంగా చివరలో కనిపించే జ్వాల కాదు. ప్రారంభం నుంచీ మొదటి క్షణం నుంచి వెలిగిపోతున్న జ్వాల. ప్రతి మాటను, చర్యను, కదలికను, భావనను పూర్తి గమనం యిచ్చి గడుపుతూ ఉన్న జ్వాల. పూర్తి గమనం యివ్వడం— కేవలం ఆషామాషీగా సాక్షికంగా చూచీ చూడనట్లుగా

గమనించడం కాదు. పూర్తి గమనం యిచ్చి చూస్తూవున్నప్పుడు పరిశీలిస్తూ ఉన్నప్పుడు....పరిశీలకుడు అంటూ ఒకడు మిగలడు, ఆ పరిశీలనకు పరిమితులు, అవధులు ఉండవు.

మన మెదడు- మనస్సుల నిండా ఎన్నో విషయాలు పోగయి వున్నాయి. వీటిలో ఖాళీ జాగా మచ్చుకయినా లేదు ఖాళీ జాగా అంటే శక్తిపాతం (Energy) జాగా లేనప్పుడు శక్తి కుంచించుకుపోతుంది. కుదించుకుపోతుంది. పరిమితం అయిపోతుంది. ఒక రూపకల్పనలో యిమిడిపోని, మూసలో తయారు అవని ధ్యానం అవసరం. మన మెదడు అనేక విషయాల ఒరిపిడిలో, శక్తి అశక్తులమధ్య ఒరిపిడిలో మునిగిపోయి ఎప్పుడూ సంఘర్షణలో చిక్కుకుపోతోంది. దానిలో ఖాళీజాగా లేదు; విరామనిగా లేదు. ఓపికగా చూచుకోవడం లేదు- స్వేచ్ఛ—పరిపూర్ణమయిన స్వేచ్ఛ- కావాలంటే అపరిమితం అయిన విస్తారం— జాగా- కావాలి. మెదడుకు ఎంతో చాకచక్యం వుంది చురుకుగా పనిచేస్తుంది. అనంతమయిన శక్తి సామర్థ్యాలు వున్నాయి. అయితేనేం, దానిని మనం సంకుచిత పరచాం. చిన్నది చేసి పరిమిత ప్రాంగణంలో యిమిడ్చి వేశాం.

పరుచుకున్న విస్తారసీమ, కాళీతనం- అప్పుడే అక్కడ ఏవేవో పోగుబడి పోయి వుండడం అనేది లేకపోతే— ఎంతయినా శక్తి ఉద్భవిస్తుంది; ఉత్పన్నం అవుతుంది. శక్తి (Energy) అంటేనే తన్మయత (Passion), ప్రేమ(Love) కరుణ (Compassion), వివేకం (Intelligence)- వీటన్నిటి సమ్మిశ్రం. అప్పుడే పరమ పవిత్రము, పావనము అయిన 'సత్యం' ఆవిర్భవిస్తుంది. దీనికోసమే మనిషి కోట్లాది యుగాలుగా వెదుకుతున్నాడు; వెంపర్లాడుతున్నాడు.

సత్యం ఏదో దేవాలయానికి పరిమితమై వుండదు. ఆత్మ పరిశీలన తప్ప— తనను తాను శోధించి చూచుకోవడం తప్ప.... ఈ సీమను చేరడానికి వేరే రహదారి యేమీలేదు.

నిరంతర పరిశీలనం కావాలి.

జాగరూకమయిన అధ్యయనం కావాలి.

అవిశ్రాంతంగా నేర్చుకోవడం కావాలి.

అప్పుడే శాశ్వతము, అనంతమూ అయిన సాక్షాత్కారం సంభవం అవుతుంది.

కృష్ణమూర్తి జీవిత సత్యాలను గురించి, వాటిపై మానవాళి యుగాల తరబడి పేర్చిన దుమ్ము ధూళి గురించి, దానిని జాగరూకంగా వైదొలగించుకొని అసలు (నిజ) స్వరూపాన్ని సాక్షాత్కరించుకోవడం గురించి.... ఎంతో సూటిగా, నిష్కల్మషమయిన హృదయానికి నేరుగా చేరుకునేట్లుగా చెబుతారు. ప్రతిదానినీ యేదో సాధనాంశం అనుకోకుండా అదే సాధనాంతం అనుకున్న ధోరణిలో పెంపొందించుకుంటూ మళ్ళీ దానికి అంటిపెట్టుకోకుండా- వేళ్ళాడకుండా వుండడం అత్యవసరం అంటారు.

మనిషి తనలో నిగూఢంగా వున్న శక్తిపాతరను తవ్వుకోవడం, పైకి తీసుకురావడం.... యిందుకు కావలసిన వాతావరణాన్ని తనకు తానే తయారు చేసుకోవడం అత్యవసరం- అని వక్కాణిస్తారు.

దివ్యజ్ఞాన సమాజ ప్రకటిత ఆదర్శాలలో మూడవది; ప్రకృతి సూత్రాలు, న్యాయాలు, ధర్మాలు పరిశీలనాత్మకంగా తెలుసుకోవడం; మానవునితో నిగూఢంగా వున్న అంతర్ శక్తులను (Latent powers) బహిర్గతం చేసుకోవడం.

దీనికి అవసరం అయిన పరిశ్రమ మూల స్వరూపాన్ని, స్వభావాన్ని కృష్ణమూర్తి సాంకేతిక పదజాలంతో నిమిత్తం లేకుండా అభివర్ణించి, విశదీకరించి చెబుతారు.

'దివ్య జ్ఞానం' అనేవి తరగని గని. జ్ఞాన సంశయం— బహు ముఖాలుగా, రూపాలుగా తాత్త్వికాంశాలుగా బయలు పడుతుంది, సరయిన సమయం వచ్చినపుడు.

మానవుడికి శ్రేయోమార్గం చూపించడం కోసం; మార్గ దర్శనం యివ్వడం కోసం, ఎప్పటికప్పుడు విస్తరిస్తున్న అతని మేధస్సుకు తరువాతి పాఠాల అవగాహన అందించడం కోసం విశ్వవ్యాప్తమయిన వికసనంలో ఒక సమకాలీన కుసుమం. రంగులు వాసనలతో ఆకట్టుకోకుండా పరిణత మనస్కులకు అసలయిన 'రుచి' ని వాచవిగా చూపడం కోసం కృష్ణమూర్తి చేసిన ప్రయత్నంలోనూ కొన్ని పద్ధతులు వున్నాయి. వాటిని జాగ్రత్తగా పరిశీలించి కట్టుకొని పురోగమించటానికి అవకాశం వుంది. అయితే ఆ పద్ధతులే మళ్ళీ మన మెడలకు మెదడులకు గుదిబండ రాళ్ళుగా తయారవకుండా జాగ్రత్త తీసుకోవాలి.

—)0(—